

# సుధామా శతకము

అరుణాచల శాస్త్రి భారతం

# తొలిమాట

శతకమున ప్రతి పద్యము స్వతంత్రముగ నిలుచునట్టిదే అగును కనుక, శతకములను ముక్తక కావ్యములందురు. అట్టి శతాధిక పద్యములను భావైక (భావ + ఏక) సూత్రముతో చేర్చి ఒక దండగుచ్చుటయే శతక ప్రక్రియగా కనబడును. అనగా, భక్తి, స్తుతి, నీతి, వేదాంతము మొదలైన వానిలో ఒక భావమును ఆత్మానుభూతితో చేకొని, ప్రతి పద్యమునందున ఆ భావము ఉట్టిపడునట్లుగా పెక్కు దృష్టాంతములతో, ఉపపత్తులతో శతక పద్యములు చెప్పబడినట్లుగా కనిపించును. ఇటుల గమనించగా, శతక సాహిత్యమునకు సంఖ్యా నియమ, ఛందో నియమ, మకుట నియమ, ముక్తక నియమములు గలవని గ్రహింతుము.

అష్టోత్తరశతముగా కలిగిన స్తోత్రములను ప్రతి నిత్యమూ చదువు తెలుగువారు 108 సంఖ్యను కలిగి యున్నప్పుడే నూరు సంఖ్యకు నిండుతన మేర్పడునని తలతురు. శతక రచనల యందునూ ఈ అష్టోత్తర పద్య రచనలనే తెలుగువారు ఆనవాయితీగా స్వీకరించిరి. ఆ సంప్రదాయము ననుసరించియే, నేనును ఈ శతకమున 108 పద్యములను పొందుపరచినాను. పద్య నిర్మాణమునందు ప్రాచీన కవులను అనుసరించి ఈ శతకమును, శుద్ధ గ్రాంథిక భాషలోనే రచించితిని.

కంద పద్యములకు పెక్కు నియమములు, పెక్కు సౌలభ్యములు కలవు. నాలుగు మాత్రలుగా కల ఎనిమిది గణములను కూర్చి ఒక అర్థకందముగనూ, మరొక ఎనిమిదింటిని చేర్చి మరొక అర్థకందముగనూ వ్రాయగలుగు సౌలభ్యము కందమున కలదు. [నేటి కంప్యూటర్ లలోని ఆపరేటింగ్ సిస్టమ్ ను, దానిని సపోర్టు చేయు హార్డువేర్ ను – *32* బిట్' లేక *64* బిట్ లలో కొలుచుట వాడుకలో కనిపించును]. ఆనాటి పూర్వకవులు ఈ 64 మాత్రలతో కూడిన కంద పద్యాలను వృద్ధి చేయుట - ఆ వ్యవస్థలోని సాధకబాధకములను గ్రహించి నందులకే కాబోలు!

అట్టి 'చతుష్షష్టి' (64) మాత్రలతో కూడిన కందములనే ఈ శతక సంపుటికి ఎంపిక కావించి పద్యములను కూర్చుట జరిగినది. కనుక, ఈ కృతియందలి ప్రతి పద్యమూ, అనుభవైక వేద్యమైన సర్వాత్మ తత్త్వమును అభివ్యక్తీకరింపగలిగి నిలుచునట్టి స్వతంత్ర పద్యము అగుచున్నది. అనగా, ఈ పద్యసంపుటి యందలి పద్యములు భక్తి, స్తుతి, నీతి భావములతో కాక, వేదాంతాధ్యయనానుభవమున (వేద + అంత + అధ్యయన + అనుభవమున) బోధపడు పరమాత్మ తత్త్వమును ప్రస్ఫుటీకరించును.

మకుటము – 'సుధామా'గ సాగును. అనగా, ప్రతి పద్యము 'సుధామా' అని అంతమగు కంద పద్యమగుచున్నది! 'సుధామ' అనగా, ('సు ధామ'=) గొప్ప ధామము / మంచి ధామము -- అనగా, "గొప్ప స్థానము".

భవసాగరమును దాట జాలక తమకు తోచిన కష్టములను, దుఃఖములను తొలగింప వలసినదిగా భగవంతుని కోరుకొను ప్రపత్తి మార్గచరులు, తమ శరీరమును వివిధ పద్ధతులలో కృశింపచేయుట ద్వారా, లేక తమ శ్వాసను నియంత్రించుట ద్వారా తమ మనస్సును కట్టడిచేయు యోగ మార్గచరులు, లోకములోని వివిధ భాగ్యములను అనుభవించి తనివి తీర్చుకొనదలచు భోగ మార్గచరులు, శాస్త్రములను పరిశోధించి ప్రజోపయోగ కార్యములు చేయదలచు శాస్త్రజ్ఞులు ఇత్యాదులు చేరుకొనదలచు స్థానమే ఈ సుధామము.

రామ భక్తాగ్రగణ్యుడు, కర్ణాటక సంగీత త్రిమూర్తులలో నొకడుగ ప్రసిద్ధికెక్కి, త్యాగరాజు అని కీర్తింపబడిన "కాకర్ల త్యాగబ్రహ్మం" గారు తన ఒకానొక "తోడిరాగ" కృతియందు -- "కోటి నదులు ధనుష్కోటిలో నుండగా, ఏటికి తిరిగెదవే ఓ మనసా" అని పాడుకున్నారు! ఆ పాటయొక్క భావము కూడా ఈ సుధామ తత్త్వమునే ప్రస్ఫుటము చేయును. భాగవత కథయందు అటుకులను తన మిత్రుడైన కృష్ణునకు ఇచ్చి, ఆ గీతాచార్యుని నుండి కుచేలుడు పొందిన పరమైశ్వర్యము కూడ ఈ సుధామ తత్త్వమే!

ఈ ప్రపంచములో తారసపడు ప్రతివ్యక్తీ, ప్రతి జీవీ పరమాత్మ తత్త్వమే. పరమాత్మము లేని తావు లేదు. ఆ పరమాత్మను ఆధారముగా చేసికొని ఈ సంసారమున్నది కానీ, ఈ సంసారమును ఆధారముగా చేసికొని పరమాత్మము ఉండదు! ఈ సత్యమును తెలియబరుప లేకపోవుట చేత, ఈ సంసారము అసత్యమగుచున్నది. అదియే మాయ. ["యా మా సా మాయా" -- ఏదైతే ఉన్నట్లు గోచరించి నిజమునకు ఉండదో, అదియే మాయ యనగ]. గోచరించు సంసారంతయూ మాయయే, భ్రాంతియే. అట్టి భ్రాంతియందు దేనికై వెదకిననూ అది అజ్ఞానమునకు దోహద పడగలదు, కానీ, మాయను నశింపచేయు పరమాత్మ తత్త్వమును అనుభవింపచేయ జాలదు!

పరమాత్మ తత్త్వము - రూప, వర్ణ, లింగ, దేశ, వయో భేదములు లేక, విశ్వవ్యాప్తము, గుణరహితము, కాలమునకు అతీతము అయి, అచింత్యము (ఆలోచనలకు అందనిది), అవ్యయము (వ్యయము కానిది), అచలము (కదలనిది, స్థిరమైనది), అక్షయము (నశింప జాలనిది) అగును. ఇంద్రియములచే గ్రహింపజాలని దగుటచే అధోక్షజమైన ఈ పరమాత్మ తత్త్వమును మానవులు తమకు కలుగు ఆనందానుభవముల ద్వారా మాత్రమే గ్రహింపవలసి యున్నది!

కానీ, మానవులు (జీవులు) పుట్టిన నాటినుండి తామున్న స్థితిగతుల వలన నిజము నెఱుగలేక, అజ్ఞానమందే మ్రగ్గుచుందురు. నిజమునకు పరమాత్మ తత్త్వమునకూ జీవతత్త్వమునకూ ఎట్టి భేదమూ ఉండదు. అనగా, జీవుడే పరమాత్ముడు. అజ్ఞానమనే తెర తొలగిన మరుక్షణమున సత్యమాకళింపునకు రాగా, జీవుడు తానెచ్చోటకునూ పోనవసరము లేదనియూ, తానున్న స్థానమే సత్యధామమనియూ, తనకేమియూ కోర పనిలేదనియూ, తనయందే సర్వమూ ఉన్నదనియూ, సకలైశ్వర్యములూ తానేనను గ్రహింపునకు వచ్చును. అదియే సుధామ తత్త్వము.

అట్టి ఆకళింపును గొనిన జీవుడే మహనీయుడు. అటుల గొప్ప స్థానమును పొందిన మహనీయుని "సుధామా" అని సంబోధించుచూ వ్రాసిన పద్యమాలికయే ఈ 'సుధామా

శతకము'. అజ్ఞాన తిమిరము క్రమ్మగా సుధామ తత్త్వము అవగతము కాక, ప్రవర్తించు వారికి ఆ తత్త్వమును విశదీకరించి దారిచూపు జ్ఞానదీపికయే ఈ "సుధామా శతకము".

శ్రీ శంకరుల వారి మాటల్లో -- "*విశ్వం - దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం - నిజాంతర్గతం - పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా*"

[అద్దములో చూడగా మనకు కనిపించు వస్తువుల ప్రతిబింబము వలే, మనకు కనబడుచున్న ఈ సంసారము కూడా 'నిజము' కాని, నిద్రయందు కలుగు కలవంటి అబద్ధమే. అనగా, మెలకువ గాంచిన తోడనే కల నశించునట్లుగనే, బాహ్యమున కనిపించు ఈ సంసారము జ్ఞానోదయమైన పిదప నశించును సుమా!

ప్రతిబింబపు నునుపును గని
బ్రతుకన్న నిటుల వలెనను భ్రాంతిని మనుజుం
డతి రయమున స్థిరత వదలి
వెతగాంచుచుఁ బట్టు బంధ విధిని సుధామా!

ప్రతిబింబము + నునుపునున్ + కని = తమ ధామమును ఈ అస్థిర ప్రపంచమున ప్రతిబింబముగా చూచుచూ అద్దాని యొక్క స్నిగ్ధతను, మురిపెములను చూచి; బ్రతుకు + అన్నన్ = జీవనము అనగా; ఇటుల వలెను = ఈ విధముగా నుండవలెను; అను భ్రాంతినిన్ = అను మోసపు తలపులను, భ్రమలను పొందుచూ; మనుజుండు = జీవుడు; అతిరయమునన్ = అమితమైన వేగముగా; స్థిరతన్ వదలి = తనయొక్క సహజ భావమైన స్థిరత్వమును విడిచి పెట్టి; వెతన్ + కాంచుచున్ = దుఃఖమును పొందుచూ; బంధ విధినిన్ = కష్టము, బాధ కలిగించు (బంధన) మార్గమును; పట్టున్ = ఎన్నుకొనుచున్నాడు

అనగా, అజ్ఞానము వలన మానవులు ఈ దుఃఖ ప్రవృత్తిని తమంత తామే కల్పించు కొనుచున్నారకటా!

ఇదియే విషయమును [1]ముఖచిత్రము కూడ విశదీకరించు చున్నది. గొప్ప స్థానమున నిలిచి ఉన్న మానవులు - ప్రతిబింబము యొక్క స్నిగ్ధతను గాంచి, అది నిజము కాదని గ్రహింపలేక, మోహితులై, తమ ప్రస్తుతమును మరచి అసత్యమును కాంక్షించుచూ మాయాబంధములకు చిక్కుకుపోవుచున్నారు సుమా!

## మనవి

తెలుగు పద్యములను కేవలమూ భావము తెలిసికొన గలందులకే కాక ప్రతి పదము యొక్క అర్థమును తెలిసికొనుచూ, వ్యాకరణమును తెలిసికొనుచూ పఠించినచో చదువరులు కూడ అనతి కాలమున కావ్యములను అల్లగల శక్తి సామర్థ్యములను పొందగలరు. అందువలన ఈ పద్యములకు తాత్పర్యమును ప్రతి పదార్థమును కూడ పద్యముతో పాటు పొందుపరచుట జరిగినది. కాగా, ఈ రెంటి (తాత్పర్య, ప్రతి పదార్థముల) యందు మాత్రము శిష్ట వ్యావహారిక ప్రయోగము కనబడును.

పాఠకలోకమునకు సగౌరవముగా, సవినయముగా చేయు విన్నపమేమనగా –

## అంగఁ గొనరు కోటీశ్వరు

## లంగడి యందుఁగల వస్తులన్నిటిఁ గొనఁ గాన్;

---

*[1] NOTE: ఈ ముఖచిత్రపటము భారత దేశంలోని 'చిదంబరం' సమీపములో నున్న 'పీచవరం' అభయారణ్యములో తీయబడిన ఒక ప్రకృతి దృశ్యము. ఈ దృశ్యమునందు కాలువ కిరువంకలలోగల 'మడ' వృక్షములను, ప్రవాహమునందు వాని ప్రతిబింబములను కాంచగలము. మా మిత్రులు శ్రీ పోలిశెట్టి వీరసుబ్రహ్మణ్య కుమార్ గారు 'ఫోటోగ్రఫీ' యందు అభిరుచిని కలిగియుండి వివిధ సమయములలో వివిధ ప్రదేశములయందు సంచరించుచూ ఎన్నో చిత్రములను వారి 'కెమెరా'లో బంధించి, ఇట్టి మక్కువ కలవారితో అంతర్జాలములో పంచుకొనుచు ఉందురు. వారీ దృశ్యమును ఈ శతకమునకు ముఖచిత్రగా తమ అంగీకారముతో అందజేసినారు. వారికి ధన్యవాదములతో కృతజ్ఞతలు చెప్పుచుంటిని.*

ఇంగితముగ నీకృతి యం

దంగంబులఁ జేకొనుఁడని హార్దిక వినతుల్!

కోటి + ఈశ్వరులు = గొప్పధనవంతులు; అంగడి యందున్ + కల = దుకాణమందు గల; వస్తులు + అన్నిటిన్ కొనగాన్ = వస్తువులన్నింటినీ గ్రహించుటకు; అంగన్ + కొనరు = ముందుకు రారు (ఉత్సాహము చూపరు); ఇంగితముగన్ = అభిప్రాయ పూర్వకముగ; ఈ కృతి+అందున్ = ఈ శతకమునందు (గల); అంగంబులన్ = విశేషములను, భావములను; చేకొనుడు + అని = స్వీకరించ వలసినదని; హార్దిక వినతుల్ = హృదయ పూర్వక విజ్ఞాపనములు.

గొప్ప ధనవంతులై దుకాణములో గల వస్తువులన్నింటినీ కొనగల సమర్థులైనను, తమకు కావలసిన వస్తువులను మాత్రమే గ్రహింతురు, కానీ, వస్తువులన్నింటినీ కొనరు కదా! అదే విధముగా, పాఠకులు ఈ శతక సంపుటిలోని ప్రతి ఒక్క (ప్రత్యేక = ప్రతి + ఏక) విషయమును గ్రహింపగల సమర్థులై యున్నప్పటికీ, వారికి నచ్చిన విషయములను గ్రహించి, మిగిలిన విషయాలను ఇతర పాఠకులకు వదిలివేయ వలసినదిగా మనవి.

ఇట్లు

అరుణాచల భారతం

## సుధామా శతక కర్తకు శుభాశీస్సులు

క.ల.న.కొండలరావు

సంస్కృతాంధ్ర పండితులు (రిటైర్డ్), విజయనగరం

చి॥ భారతం అరుణాచల శాస్త్రి రచించిన సుధామా శతకమును ఆమూలాగ్రము చదివితిని. ఈ శతకము అందమైన కంద పద్యాలతో భక్తి, ముక్తి, నీతి, వైరాగ్య బోధముగా నున్నది. శతక లక్షణములతో నొప్పారుచు 108 పద్యాలతో సంపూర్ణముగ నున్నది.

గొప్ప గొప్ప మహాత్ములు, తత్త్వవేత్తలు అనుభవపూర్వకముగా రచించిన సూక్ష్మ విషయాలను కూడ కవి తేలికైన పద్యాలలో సులభశైలిలో రచనను సాగించినాడు. ఈ గ్రంథములోని విశిష్టతను పాఠకులు గ్రహించి ఆచరింతురు గాక! 'సుధామా' అనే మకుటమును ఉంచుటకు కారణము కవి వివరించినది చాల యుక్తియుక్తముగను, సహేతుకముగను ఉన్నది. వైరాగ్యబోధకములైన ఇందలి విషయములు మెచ్చుకోదగినవి.

ఇక, పాండిత్యము, కవిత్వ విషయాలకు వచ్చినచో -- ఈ బాలకవి తాలూకు మాతామహులు శ్రీ ఆకెళ్ళ అరుణాచల శాస్త్రి గారు 'ఆచార్య', 'విద్వాన్' మొదలగు బిరుదులు పొంది మహారాజా సంస్కృత కళాశాల, విజయనగరం (ఆంధ్ర) లో తెలుగు పండితులుగా పనిచేసి ఎంతోమందిని తెలుగు పండితులుగా తీర్చిదిద్దినారు! ఆంధ్రవిశ్వవిద్యాలయ పాఠ్య గ్రంథ నిర్ణేతలు వీరు. "భీష్మ విజయము" అనే పద్య గ్రంథమును, "కవి శిరోభూషణ వివృతి" అను వ్యాకరణ గ్రంథమును రచించి పండిత లోకానకు అందించినారు. అట్టి మహాత్ముని మనుమడు (దౌహిత్రుడు) ఈ కవి. ఈతని తల్లిదండ్రులు కూడ పండితులే! తండ్రి "శ్రీమన్నారాయణ భారతం" గారు, సంస్కృతాంధ్రములలో నిష్ణాతులై సంస్కృత కళాశాలాధ్యక్షులుగా పనిచేసినారు. వీరు తెలుగున, సంస్కృతమున అనేక గ్రంథములు రచించి పండితలోకమునకు అందించినారు. "రమణాయానము" (రమణ మహర్షి గారి జీవిత చరిత్రము) అను గ్రంథమును పద్యరూపముగా రచించిరి. కవిగారి తల్లిగారు "కమలాంబ భారతం" గారు

సంస్కృతాంధ్ర భాషలలో నిష్ణాతురాలై భాషాప్రవీణ బిరుదాంకితయై ఆంధ్రోపాధ్యాయినిగా పనిచేసి విశ్రాంతి తీసికొనినారు.

కవిగారు పండిత పుత్రులు. అనగా, "పండితస్య పుత్రః" అని షష్టీ తత్పురుష కాదు -- "పండితశ్చాసౌ పుత్రశ్చ" అను కర్మధారయ సమాసము. వీరి చెల్లెలుగారు "అపర్ణ", బావగారు "ఆంజనేయ శర్మ" కూడ పండిత కవులు. కావుననే, పండితకుటుంబములో జన్మించిన ఇతనికి కవిత్వమబ్బుట ఆశ్చర్యము కాదు! ఇతను వృత్తిరీత్యా సాంకేతిక ఉపాధిదారులు (బి.టెక్.) అయిననూ కృషి సల్పి, జరామరణములు లేని సుధామా శతక కృతిని నిర్మించెను. ఎంతయో దుర్బోధ్య విషయమును కూడ సుబోధ్యము చేయగల శక్తి ఈతని కలము నుండి జాలువారినది.

సుధామా అను పదమే, ఈ శతకమునకు మకుటాయమానమైనది. ఉదాహరణకు, "సందేహింపకు మెందరో ... ఆనందభరితులైరి సాధనమున సుధామా" (49 పద్యం) అని సాధనకునకు ప్రోత్సాహమిచ్చినాడు. మరియు "సమయంబావశ్యకమగు ... అమితంబగు ముదము గొందు వవల సుధామా" (50వ పద్యం) అని “ఆనందో బ్రహ్మేతి” అను శ్రుతిని తెలిపినాడు.

ఇట్టి వైరాగ్యమును, భక్తిని కలబోసి చక్కని పదజాలముతో చిక్కని భావములతో రచన గావించిన ఈతని శతకము సర్వజనులకు ఆనందదాయకముగాను, ఆచరణ యోగ్యముగను ఉన్నదనుటలో సందేహము లేదు!

చిరంజీవికిదే నా ఆశీస్సులు

కట్టమూరి లక్ష్మీనారాయణ కొండల రావు

విజయనగరము -- జనవరి 15, 2015 (మకర సంక్రాంతి దినము)

Phone: 94400 57552

## పుత్రోత్సాహము తండ్రికి

శ్రీమన్నారాయణ భారతం
ప్రిన్సిపాల్ (రిటైర్డ్), సంస్కృత కళాశాల, చిట్టి గూడూరు (కృష్ణా జిల్లా)

"వేదాంతోపవనే విహార రసికం తం నీలకంఠం భజే" - అని ఆది శంకరులు "శివానందలహరి"లో శివస్తుతి చేశారు. శివుడంతటి మహాదేవుడే, వేదాంతవనాన్ని తన స్వైరవిహారానికి స్థానంగా చేసుకున్నాడంటే, ఐహిక జీవనంలో అనేక విజయాలకోసం వెంపరలాడి విసిగి వేసారి విశ్రాంతికోసం ప్రపంచంలోని ఆయా స్థలాలను వెతుక్కుంటూ వెళ్ళడం వెఱ్ఱితనం కాక మరేమిటి? శివుడు, సంసారయాత్ర సాగిస్తూనే లోకసంరక్షణాది బాధ్యతలను నియతంగా నిర్వర్తిస్తూనే యోగిగా, తపస్విగా, వైరాగ్యసంపన్నుడుగా ఆదర్శ జీవితం సాగిస్తున్నట్లుగా మనమూ ప్రాపంచిక జీవితం సాగిస్తూనే ఆత్మాన్వేషకులమై, బ్రహ్మనిష్ఠులమై ఆనందానుభూతిని ఎందుకు జుఱ్ఱుకోలేము? మాయాప్రభావము వల్ల సత్యజీవనానికి ఎంతోదూరంగా జరిగిపోయి ఇంద్రియ ప్రలోభాలకు తల ఒగ్గి కర్మ బీజాలను మనజీవన క్షేత్రంలో విత్తుకుంటూ పునః పునః జన్మలెత్తుతూ ఎందుకూ ఎవ్వరికీ కొఱగాని వ్యర్థజీవన పరంపరా విషవలయాల్లో చిక్కుకొని విడుదల పొందలేక అఘోరిస్తూ ఉండిపోవలసినదేనా? అసలు బ్రతుకుకు అర్థం, పరమార్థం ఏమిటి?

ఇలా ప్రశ్నల రూపంలో పుట్టిన సందేహాలకు సమాధానాలను దిట్టతనంతో పట్టు వీడక వెదకి రాబట్టి వట్టి జీవనానికి స్వస్తి చెప్పి గట్టి జీవనానికి రెట్టించిన ఉత్సాహంతో మెట్టుమెట్టుగా ప్రయాణం చేస్తూ బ్రతుకు గుట్టును బట్టబయలు చేసుకునే తపననే తపస్సుగా మార్చుకొని తరించే ప్రయత్నానికి లక్ష్యంగా వెలసినది ఈ సుధామా శతకము.

దీన్ని రచించిన కవి 'అరుణాచల భారతం' అనే పేర అమెరికాలో ఆత్మాధ్యయనము సాగించుచున్న నా పుత్రరత్నమే అని ఈ పాటికే గ్రహించి ఉంటారు.

"యద్ గత్వా న నివర్తంతే, తద్ ధామ పరమం మమ" - అని గీతాచార్యుడన్న పరంధామమే ఈ కవి సాధించుకొనదలచినదీ, సాధించుకొమ్మని అన్యులకు

బోధించినదీను. అది అందుకొన్నవాడే సుధాముడు. నిజానికి సృష్టిలోని ప్రాణిజాతమంతా ఆ సుధామ తత్త్వమునుండే ఆవిర్భూతమైనది. చివరకు చేరుకొనునదీ ఆ తత్త్వంలోనికే! మేధావీ, మనస్వీ అయిన మానవునకు తన సహజస్థితిని గుర్తుచేయడం కోసమే సుధామా అనే సంబోధన చేస్తూ దానినే మకుటంగా శతకానికి అనుసంధించి ఈ కవి అందరికీ ఆత్మతత్త్వాన్ని అరటిపండొలిచి ఇచ్చినట్లుగా అందిస్తున్నాడు!

"తద్ విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ నమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" - అనే ఋషి సంప్రదాయం ఉన్నప్పటికీ, జిజ్ఞాసువులందరికీ అన్నిచోట్లా అన్నివేళలా సద్గురువు దొరకడం కష్టం కాబట్టి - అందులోనూ, అనుక్షణం బ్రతుకుబాటలో ఆటుపోటులను తట్టుకొని ఆటంకాలను అధిగమిస్తూ హడావిడి జీవితం గడిపే మనవంటి వారు సులభంగా జీవిత ప్రయోజనాలను సిద్ధింపజేసికొంటూ ప్రశాంతంగా ఆనందంగా జీవించే విధానాలను సూచించే ఇలాంటి గ్రంథాలు ఒక గురువువలే అయాచిత నిర్వ్యాజ బాంధవంతో ఆదుకుంటాయనడంలో సందేహం లేదు!

గ్రంథం లోపలికి వెళ్లి చూస్తే -

'ధామ' శబ్దానికి నానార్థములను 'నానార్థ రత్నమాల' అనే సంస్కృత నిఘంటువు ఇలా చెప్పింది - "ధామ జన్మ ప్రభా స్థాన ప్రభావ సుఖ సద్మసు" అని. 'అమర కోశం'లో "గృహ దేహ త్విట్ ప్రభావా ధామాని" అని అర్థాలు చెప్పబడ్డాయి. పై వానిలో స్థానము, కాంతి అనే అర్థాలు రెండూ ఈ శతకంలోని ధామ శబ్దానికి ముఖ్యార్థాలుగా వాడబడినట్లు తోస్తున్నది. దీన్నిబట్టి, అధ్యాత్మ తత్త్వమే, సుధామతత్త్వం అని తేలుతున్నది. గీతాశాస్త్రంలో "కిం తద్ బ్రహ్మ? కిం అధ్యాత్మం?" అని అర్జునుడు ప్రశ్నించడం, దానికి సమాధానంగా - "అక్షరం పరమం బ్రహ్మ, స్వభావో~ధ్యాత్మముచ్యతే" అని భగవంతుడు చెప్పడం జరిగింది - స్వభావమే (స్వరూపావస్థితి లేదా ఆత్మ సహజస్థితి) అధ్యాత్మము. దానినెఱిగి ప్రవర్తించువాడు ఆధ్యాత్మిక జీవనుడు. అతడే సుధాముడు - ఆ ఎఱుక లేనివాడు సామాన్యుడు - జీవాత్మ. ఈ జీవాత్మ, పరమాత్మలు ఒక్కటే తత్త్వం కాబట్టి, ఈ శతకంలోని సుధామా అనే సంబోధనం పై తత్త్వాన్ని ఎఱుగని వారికి, ఎఱిగిన వారికి కూడా అన్వయించే ఒక అపూర్వమైన సార్థక పదం.

సాధారణంగా, ఒక గ్రంథాన్ని అర్థంచేసికొని ఆస్వాదించడానికి షడ్విధ తాత్పర్యలింగాలను ఆశ్రయించే సంప్రదాయం ఉన్నది. అవి, 1.ఉపక్రమోపసంహారాలు 2.అభ్యాసము, 3.అపూర్వత, 4.ఫలం, 5.అర్థవాదం, 6.ఉపపత్తి. ("ఉపక్రమోపసంహారావభ్యాసో~పూర్వతా ఫలం। అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే॥")

సుధామ శతకాన్ని కూడా ఈ 6 లింగాల ద్వారా అన్వయించుకుని అర్థం చేసుకోవాలి.

1. ఉపక్రమంలో - సృష్టియంతటా వ్యాపించియున్న ఆనందదాయకమైన పరమాత్మ తత్త్వం ప్రస్తావించబడింది. (అది అనేక భ్రాంతులకు మూలమై యున్నదని కూడ చెప్పబడింది). దాన్ని అందరూ సాధన ద్వారా అవగాహనకు తెచ్చుకోవాలని చెప్పబడింది. మళ్ళీ చివరి పద్యంలో అదే పరమాత్మ తత్త్వం, భూమిపై తన 16 కళలను ప్రసరింప చేసి మళ్ళీ ఉపసంహరించు కొనే చంద్రుడువలె, ఒకసారి తనను తాను వెలయించుకొని వేఱొక సారి ఉపసంహరించుకుంటుంది అనే విషయం చెప్పబడింది. ఇలా పై ఉపక్రమానికి ఈ ఉపసంహారము ఐక్యస్ఫూర్తిని కలిగించింది.

2. అభ్యాసం అంటే ఒక విషయాన్ని మాటిమాటికి ప్రతిపాదిస్తూ పాఠకులను అవగాహన దశకు చేర్చడం. ఇది పునరుక్తి కాదు - విషయాన్ని దృఢీకరించడం [భవతు నిశ్చయ దార్ఢ్యాద్ ఊర్ధ్వం శాస్త్ర రక్షణం - నారద భక్తి సూత్రాలు (12)]. సుధామ తత్త్వాన్ని తెలుసుకోవాలంటే, మనసుకు పట్టిన మాయా మాలిన్యాన్ని వదిలించుకోవడం కోసం సాధన చేయాలి అనే విషయాన్ని ఈ కవి ఎన్నో సార్లు చెప్పాడు, ఒకతల్లి తప్పుడు దారిలో ప్రయాణించే తన బిడ్డని సరైన దారిలోకి మళ్ళించేందుకు పడే శ్రమ వంటిదే ఈ అభ్యాసలింగం!

3. అపూర్వత అంటే ఇంతకు ముందుగా ఎందరో చెప్పిన దానినే ఒక అపూర్వ విధానంలో చెప్పడం! ఈ కవి శతక ప్రక్రియలో ఆధ్యాత్మిక తత్త్వాన్ని విశదీకరించడమే ఒక అపూర్వ సంగతైతే - ఆ తత్త్వాన్ని తెలిసికోవడానికి మానవుడాచరించవలసిన పద్ధతులను వివిధ రీతులలో బోధించడం మరో అపూర్వత!

మచ్చుకు,

- సద్గురువు నాశ్రయించి బ్రహ్మతత్త్వాన్ని తెలిసికోవాలి అనే విషయాన్ని చెప్పడానికి ఈ కవి - పిల్లల పెంపకంలో గల కిటుకులను పిల్లలను కని పెంచిన తల్లి మాత్రమే చెప్పగలిగినట్లుగా పరమాత్మానుభూతి నెఱిగిన గురువు మాత్రమే శిష్యులకు దాన్ని తెలియజేయగలడు కానీ, సామాన్యునకు అది అసాధ్యమని చెప్పడం (32 వ పద్యం)
- గాలిలో స్వేచ్ఛగా ఎగిరే గాలిపటాన్ని, దాని దారాన్ని గట్టిగా పట్టుకొని తనకు స్వాధీనము చేసికొని సరియైన దిశకు మళ్ళించుకొనే బాలకుని లాగా - ఇచ్ఛ వచ్చినట్లు ప్రాపంచికంగా తిరిగే మనస్సుని మానవుడు తన అదుపులోనికి తెచ్చుకోవాలని చెప్పడం (97వ పద్యం)
- ఒక వ్యాపారి డబ్బుకోసం గంపల నిండా దుంపలు నింపుకొని అదేపనిగా మోసుకుంటూ వీధివీధులా తిరుగుతూ అమ్ముకుంటూ ఉంటే, ఆ దుంపలు కాస్తా కుళ్ళి కంపెత్తి, ఎందుకూ పనికిరాకుండా పోతాయని, మధ్య మధ్య గంపను దింపి చెడిపోయిన వాటిని పారవేసి క్రొత్త వాటిని నింపుకోవాలని, అలాగే, ఏవేవో కోరికలను మనస్సు నిండా నింపుకొని ఎన్నాళ్ళు ప్రయాణిస్తే ఏం ప్రయోజనం? మధ్యలో చెడు ఆలోచనలను ఏరి పారవేస్తూ ఉండాలి అని హితవు చెప్పడం (51వ పద్యం) ఈ అపూర్వత అనే దానిలోకే వస్తాయి.

ఇలాంటివే 11, 73, 87 మొదలైన పద్యాలన్నీ. అసలీ సుధామా శతకంలో ఉన్నదంతా ఈ అపూర్వతా పరిధిలోకి వచ్చే సరుకే!

4. ఫలం అనగా, గ్రంథరచనకు ఒక ప్రయోజనమంటూ ఉండడం! "*కావ్యం యశసే~ర్థకృతే ...* " ఇత్యాదిగా ఆలంకారికులు ఎన్నో కావ్య ప్రయోజనాలని చెప్పారు. ఈ సుధామా శతక ప్రయోజనం నా దృష్టిలో ఒకే ఒక్కటి - "పర నిర్వృతి". ఇది కవికా, పాఠకునికా? ఇద్దరికీను. ఇంత మంచి పని చేసి, పరమానందానుభవాన్ని ఆస్వాదించాను అనే తృప్తి కవికి తప్పక కలిగి ఉంటుంది. పాఠకులకు - నిజమే, ఈ కవి చెప్పిన రీతిగా మాయాంధకారములో మ్రగ్గిన మనం ఈ మంచి మాటల ద్వారా మోహాన్ని వదులుకొని

ఆలోచింపగా, అలోచింపగా బ్రహ్మానుభవం కొంచెంకొంచెంగా అర్థమవుతున్నది, దీన్ని పూర్తిగా అనుభవిద్దాం అనే ఆత్మవిశ్వాస పూర్వకమైన సాధనానందం కలుగుతుంది అనేది తథ్యం!

5. అర్థ వాదం - దీన్నే, "కావ్యధ్వని" అంటారు కవిసమ్రాట్ విశ్వనాథ. ఈ పని చేస్తే, ఇలాంటి లాభం ఉంటుంది, ఇలా చేస్తే వ్యతిరేక ఫలితం వస్తుందని హితోక్తి చెప్పడమే అర్థ వాదమంటే! సుధామా శతకంలో -

- మానవుడు తన మేధాశక్తిని వినియోగించుకొనక ప్రారబ్ధాన్నే నమ్ముకొని కూర్చుంటే, మూర్ఖుడనబడతాడని చెప్పడం (2వ పద్యం)
- వైకుంఠపాళిలోని పాము-నిచ్చెనలాట వంటిదే మానవుని జీవితమనీ, గెలుపు ఓటములు సమానంగా చూసుకునే సంస్కారాన్ని- ఉన్నచోటనే (తనలోనే) అలవర్చు కోవచ్చుననీ ధైర్యాన్ని గఱపి ప్రోత్సహించడం (98వ పద్యం)
- సృష్టిలో ఉన్న మేటి సొత్తు ఒక్క మోక్షము మాత్రమే అనీ, ఇంద్రియముల మాయలో చిక్కకుండా ఉండడమే దాన్ని అందుకోడానికి సులభోపాయమనీ విశ్వాసం కలిగించడం (71వ పద్యం)
- ఆకాశంలో ఎగురుతూ మధ్యలో వాన పడగా ఇతర పక్షులు భయపడి గూటిపట్టుకు చేర ప్రయత్నిస్తాయనీ, డేగ మాత్రం వానకు భయపడక దాన్ని దాటి పైకెగిరి తన దృఢ గమనాన్ని కొనసాగించునట్లుగా మానవుడు కష్టాలకు వెఱవక మనోద్రఢిమకు పూనుకోవాలని హితవు చెప్పడం (57వ పద్యం)
- నరునకేర్పడు కష్టదశ పరమాత్మ శోధనకు సాధనమనీ, భవజలధిని దాటడానికి నౌక అనీ నిర్భయత్వం నేర్పడం (58వ పద్యం)

అర్థవాదం అనే ఈ అంశానికి ఉదాహరణలవుతాయి. ఇలాంటివే, 36, 37, 62, 63, 89 మొదలైన పద్యాలు కూడ!

6. ఉపపత్తి - చెప్పదలచిన అంశాన్ని కార్య కారణ నిరూపణ ద్వారా సిద్ధాంతీకరించడం! - ఈ శతకంలో

- వినమ్రతతో శత్రువులను కూడా మనకు దాసులను చేసుకోవచ్చు, అంతశ్శతృవులను జయించినవాడే విశ్వవిజేత అనడం (3వ పద్యం)
- పక్షులు నిజశక్తినే నమ్ముకొని  చెట్టు కొమ్మలలో స్థిరంగా గూళ్ళు నిర్మించుకొన్నట్లే ఆత్మవిశ్వాసంతో బ్రహ్మానంద స్థితిలో స్థిరపడవచ్చుననడం (5వ పద్యం)
- ఒంటరిగా మానవుడేమీ చేయలేడని సంశయపడి ఎవరెవరినో ఆశ్రయించి, వారి మార్గాన్ని అనుసరించడం అందరికీ అన్నివేళలా ప్రయోజనవంతం కాదు, ముఖ్యంగా ఆధ్యాత్మికాభివృద్ధికి స్వీయనిర్ణయాలే పనిచేస్తాయనడం (6వ పద్యం)
- సాధనకు ముహూర్తాలు శాస్త్రాలు అంటూ మీనమేషాలు లెక్క పెట్టుకుంటూ కాలయాపనం చేస్తే మృత్యుకాలం చెప్పకుండా వచ్చి మీదపడుతుంది సుమా అని హెచ్చరించడం (7వ పద్యం)
- తెలివిని సదుపయోగ పఱచుకోలేక కోతి తన తోకకు నిప్పంటుకోగా కంగారుతో వనమంతా కాల్చినట్లుగా కాక, మానవుడు తన తెలివిని సరైన మార్గంలో పెట్టుకొని సాధనకు పూని సంసార బాధలను తొలగించుకోవాలి అనడం (13వ పద్యం).
- నదులెన్ని వచ్చిచేరినా, సముద్రము కలత పడక గంభీరతను వీడని విధంగా మానవుడు ఎన్ని విఘ్నాలు తన మార్గాన్ని అవరోధించినా నిశ్చలతను కోల్పోడు అనడం (47వ పద్యం)
- సౌరభం కోసం ఆశపడి తుమ్మెద ఒక పుష్పంమీద వ్రాలి ఆ పుష్పం రాత్రివేళ ముడుచుకొని పోగా అందే మృతి చెందే విధంగా సంసారంలోని క్షణిక భోగాలలో చిక్కుకొని జీవితాన్ని ముగించుకోవద్దు అనడం (52వ పద్యం).
- తైలం అడుగంటగానే దీపపు వెలుగులు అణగారునట్లు మాయాభ్రాంతులు తొలగగానే సాధకుడు సహజ బ్రహ్మమయత్వ స్థితిని పొందుతాడనడం (94వ పద్యం) ఇలాంటివన్నీ, ఉపపత్తి అనే తాత్పర్య లింగానికి ఒదిగే ఉదాహరణలు.

ఈ శతకంలో సగానికి పైగా సాక్షాత్కరించేవి ఇవే!

రచనావిషయంలో రెండుమాటలు. కందం సంస్కృత భాషలోని ఆర్యావృత్తానికి అనుసరణగా తెలుగు కవులు దిగుమతి చేసికొన్న పద్యం! అందానికి ఆలవాలం. పదాల పొందిక, అర్థాల అలంకరణ దీనిలో ప్రధానభాగం అవుతాయి. పెళ్ళిగంపలో కూర్చుండ బెట్టిన నవవధువులా కళాకాంతుల్ని కందళింప జేస్తాయి. అలా ఆకర్షించే పద్యాలు ఈ శతకంలో చాలానే వున్నాయి.

- పద్యం నాల్గవ గణంలో 'జ'గణాన్ని పొదిగి పద్యగమనాన్ని స్ఫూర్తి మంతం చేయడం అనే నన్నయగారి పోకడను అనుసరించడం. ఉదాహరణ -

1. మనమందలి శత్రువులను
వినమ్రతను గెలుచు వాఁడె విశ్వవిజయియౌ! (3వ పద్యం)

2. భ్రమఁగొన్న మనస్సు ననున
య మొందఁగ మఱల్పుఁ బరము; మవనీ జనులస్ (12వ పద్యం)

3. తడఁబడక మింట; దృఢగతిఁ
గడంకఁ జేకొన్న వాఁడె ఘనుఁడు సుధామా! (57వ పద్యం)

ఆ గణాన్ని అలా కూర్చడం వల్ల చెప్పదలచిన విషయానికి అర్థగౌరవం సిద్ధిస్తుంది. దీన్నే "శబ్దచిత్రణ" అంటారు ఆధునికులు!

- బిందుయుత ప్రాసముతో కూడిన పద్యాలు :

1. ఒంటిగ యానము సేయుట
మంటగుననుు తలఁపుఁ గొనుచు మడఁగకు మాయస్
జంట పనులు నొక్కొక తఱి
నంటించును జల్లఁబడని యగ్ని సుధామా! (6వ పద్యం)

2. నిండిన యానందంబును
దుండగముల దోఁచలేరు దొడఁగుచుఁ జోరుల్

మెండుగ ననుభూతు లటులె
గుండెల నింపఁగ మనుజులఁ గూర్పు సుధామా! (18వ పద్యం)

3.వింతను గను నుత్సాహం
బెంత నిలుచుఁ దిరిగి రాఁగ? హృత్సంస్థితమౌ
నంతర్యామినిఁ గనుగొను
సంతోషి పడునె ప్రయాస? జ్ఞాన సుధామా! (29వ పద్యం)

- ద్విత్వాక్షర ప్రాసము తో కూడిన పద్యాలు:

1. తక్కెడ సమగతిఁ గొనకే
నిక్కుచు నీల్గెదరు నరులు నియమము లెడలన్!
జిక్కకు మాయావృతికిల
ఱెక్కలు ముక్కలగును గను, లెమ్ము సుధామా! (19వ పద్యం)

2. నిస్సారపు సంసృతిఁబడి
యుస్సురనుచు నరుఁడు బాధలోర్వకయే; యం
తస్సత్త్వం బడుగంటఁగ
దుస్సంగతి బాట పట్టఁ దొడఁగు సుధామా! (27వ పద్యం)

3. నమ్ముచు నిజశక్తి, నన
న్యమ్మగు సామర్థ్యమొసఁగి, నమ్రతగొని, న్యా
యమ్మగు రీతిని వ్యవహా
రమ్ము జరుపఁ జేరనగుఁ బరమ్ము సుధామా! (39వ పద్యం)

- సంయుక్తాక్షర ప్రాసముతో కూడిన పద్యాలు:

1.నిస్తేజు సచ్చైతన్యుగ
విస్తర పఱపుచు వివేక వికసన మొదవన్
వ్యస్తంబవు మానసమును

బ్రస్తుతముగ మార్చి కూర్చుఁ బరము సుధామా! (93వ పద్యం)

2. నిద్రించుచు నరుఁడు తలఁచు
భద్రంబని మోహమాయ పట్టునఁ బడుచుస్
క్షుద్రాలోచన పరతా
ఛిద్రితుడై కూలి చితికిఁ జేరు సుధామా! (99వ పద్యం)

- శబ్దాలంకారములు : వృత్త్యనుప్రాస నిబంధన చాలా పద్యాలలో ఈ కవికి సులభంగా పట్టువడింది

1. తిట్టిన వట్టిగ గట్టిగఁ
గట్టకు మెట్టెటనో జట్టు; కట్టెదురుగ ను
న్నట్టి పరమాత్మ గుట్టును
పట్టిన నీకెట్టి రట్టుపట్టు? సుధామా! (15వ పద్యం)

2. "ఎవ్వఁడో యేభాషనో యిటు
లెవ్వగ నివ్విధి రచించె, నెవ్వఁడు వ్యాఖ్యస్
ఎవ్వివర మిచ్చె" ననుచును
నొవ్వక తెలిసికొని మదికి నుడువు సుధామా! (33వ పద్యం)

అలాగే, ఉపమ (42), రూపకం (36, 65), అర్థాంతర న్యాసం (41), దృష్టాంతం (34,46), కావ్యలింగం(57) - వంటి అర్థాలంకారాలు కూడా ఈ శతకంలో కావ్యాలలో లాగుననే తళుక్కుమంటున్నాయి.

తెలుగువారి నోట తఱచుగా వినబడే నుడికారాలు ఎన్నో ఆప్యాయంగా పలకరిస్తాయి. ఉదాహరణ, "మైమఱపించు, ఊఁతకుదురు (1వ పద్యం), తొణఁకెడు తలఁపులు (3వ పద్యం), పొడసూపు, వేయినోళ్ళ (4వ పద్యం), భరతము పట్టు (7వ పద్యం), వీఁగిపోవు, నిలువఱచు (9వ పద్యం), సమకూడు (14వ పద్యం), గూడుఁ బులుఁగులు (16వ పద్యం), వివరము తప్పు (26వ పద్యం), ఉస్సురను (27వ పద్యం), మొదలైనవి.

యతి-ప్రాసల కోసం, కొన్ని మాఋమూల పదాలను ప్రయోగించడం వలన, పద్యాలలో సారళ్యం సన్నగిల్లినట్లుగా సామాన్య పాఠకులకు అనిపించవచ్చు. కానీ, అవి విషయ గౌరవాన్ని బట్టి, అలవోకగా దొర్లిన గంభీర పదజాలంగా తీసుకోవడం సహృదయలక్షణం. ఉదా: అధోక్షజము (28వ పద్యం), బృందారకము (22వ పద్యం), నెంజిలి పఱచు (20వ పద్యం), కాకొనరించు (82వ పద్యం).

కవిత్వానికి హేతువులుగా ఆలంకారికులు ఈ క్రింది మూడులక్షణాలను చెప్పారు!

- శక్తి (ప్రతిభ)
- వ్యుత్పత్తి (లోక, శాస్త్ర, కావ్యావలోకనం),
- అభ్యాసము (రచన చేసే అలవాటు)

ఈ మూడింటిలో అరుణాచల భారతం కవికి మొదటిది పుష్కలం, రెండవది తగినంత, మూడవది అసమగ్రంగాను వున్నాయి. అనగా అనగా రాగం అతిశయిల్లుతుంది - కవి పరంగా! తినగా తినగా వేము తియ్యగా ఉంటుంది - పాఠకుని పరంగా!

ఇతోధిక శ్రద్ధ, ఆసక్తి కనబఱచి, పెక్కు గ్రంథాలు రచించి ప్రజల మన్ననలను పొంద గలగడం అచిర కాలంలోనే ఈ చిరంజీవికి కలగాలని తండ్రిగా, కవిగా, విమర్శకుడుగా, నా ఈ ఆశీశ్శుభాకాంక్షలను అందిస్తూ విరమిస్తాను.

అంతకుముందు - మీరంతా ఇతని కృషిని అభినందిస్తూ, చెప్పిన విషయానికి ఆనందిస్తూ అద్వైతానుభూతులను అందుకుంటారని ఆశిస్తాను.

ఇట్లు

భారతం శ్రీమన్నారాయణ

తాడేపల్లిగూడెం - జనవరి 28, 2015

Phone: 94416 87061

# స్వాగత సుధామమ్

"సాహితీ కళాభిజ్ఞ" డా||యేలూరిపాటి ఆంజనేయ శర్మ

విద్యాప్రవీణ, పీ.ఓ.ఎల్. ఎం. ఏ (సంస్కృతం), ఎం. ఏ(తెలుగు), ఎం. ఏ (రెలిజియస్ స్టడీస్), ఎం. ఏ (ఫిలాసఫీ), విద్యావారిధి, Ph.D

సుధామమునకు స్వాగతం. సుధామాశతక పాఠకులకు స్వాగతం ఈ పలుకులు. శ్రీకృష్ణపరమాత్మ అనుగ్రహంతో కుచేలుడు (చినిగిన బట్టలు కలిగినవాడు) సుధాముడు (మంచిస్థానం = ఇల్లు కలవాడు) అయ్యాడు. మంచి స్థానాన్ని పొందడంతో పాటు దాన్ని శాశ్వతం చేసుకోవడంకూడా చాలా ముఖ్యం. మంచిస్థానాన్ని శాశ్వతం చేసుకొనే ఉపాయం తరచు ఆ స్థానాన్ని, స్థాయిని గుర్తెరిగి ఉండటం, గుర్తుచేసుకుంటూ ఉండడమే. ఆ ఉపాయానికి ఒక ఉపకరణంగా ఈ పుస్తకాన్ని భావించవచ్చు.

ఆత్మజ్ఞానాకాంక్ష కలవారంతా సుధాములు కాలేకపోవచ్చు కాని, సుధాములకు అబ్బిన ఆత్మవిద్య శాశ్వతమవటం మాత్రం ఖాయం. అప్పటికే వారు 'సుధాములు' కనుక. రచయిత "సుధామా" అనే సంబోధనను మకుటంగా తీసుకొని తన ఉద్దేశిత పాఠకులను ఒక రకంగా నిర్దేశించుకొన్నాడు.

నిజమే సుధాములకే ఈ శతకం. సుధామాతత్వమంటూ కొద్దిపాటి వివరణను తన ముందుమాటల్లో ఇచ్చుకున్న రచయిత, అద్వైత పరిపుష్టిత ఆధ్యాత్మిక భావజాలానికి మరో మణిహారాన్ని జోడించాడు. లేదా అద్భుతాద్వైత భవనానికి మరొక ఇటుకను చేర్చి ఇంకొంచెం ఎత్తును పెంచాడు. సుధామాశతకం లోని అంతస్సూత్రత ఆధ్యాత్మిక దృక్పథంతో నిండిన నిరంతర సాధనా ప్రతిపాదితమే.

నామసాదృశ్యమో, క్షేత్రసందర్శన ప్రభావమో గాని, అరుణాచల గురుదేవులు శ్రీ రమణుల స్ఫూర్తి శతకవస్తువులో కనిపిస్తుంది. తండ్రిగారైన శ్రీమన్నారాయణగారి "పద్యమాత్ర రచనా ప్రతిజ్ఞ" తాలూకు ఆభిజాత్య వారసత్వం శతక శరీరమనిపిస్తుంది.

అధ్యయనాభ్యాసముల ద్వారా రచయితలైన వారే మనకు లోకంలో ఎక్కువగా తారసపడతారు. కాని, అరుణాచలశాస్త్రి ఆలోచన – పరిశీలన – అనుభవం – ఆధారాలుగా రచయిత అయ్యాడనిపిస్తుంది. పాండిత్య-వ్యుత్పన్నతల కంటే భావవ్యక్తీకరణావేశమే ఎక్కువగా కనబడుతుంది.

స్థాలీపులాకంగా పరిశీలిస్తే - ప్రారబ్ధ మిట్టిదనుచు (2) వగచే వారిని మూర్ఖులని నిరసిస్తూ, అంతశ్శత్రువులను జయించకుండా ప్రపంచాన్ని జయించాననుకొంటే (3) విలువే ముందంటూ, జయాపజయాలకు అతీతంగా సాధన సాగుతూనే (4) ఉండాలని, ఆత్మశక్తి నెరిగి (5) సర్వాంతరత్వాన్ని ఆకళింపు చేసుకోవాలనే 'సుధామా' తత్త్వపు పునాది మొదటి ఐదుపద్యాలలోనే అగుపిస్తుంది.

ఒంటరికి జంట పూరకమైతే, జంటలోని ఒంటరి సాధకుడు. కాని 6వ పద్యంలో జంటతనాన్ని నిరసింపనక్కర్లేదనిపించింది. అన్ని ఆశ్రమాలు, అన్ని వ్యవస్థలు, పద్ధతులు - ఆయా పరిస్థితులకు, అవసరాలు కనుకనే అన్నీ ఎల్లప్పుడూ ఉంటూనే ఉంటాయనే సార్వకాలీన, సార్వత్రిక, సమష్టి దృక్పథం 24 వ పద్యంలో కనిపిస్తుంది.

మధ్యలోని కొన్ని పద్యాలు నీతిపద్యాల్లా, కొన్ని సాధనను విడిచిపెట్టిన వారిపట్ల నిరసనపద్యాల్లా అనిపించినా, ఆలోచింపచేస్తాయి. కొన్ని శాస్త్రాలు ఆధ్యాత్మికసాధనకు అవరోధాలైనా ఆయా స్థాయిల్లో అవసరాలు కూడా. ఐతే, (7, 8) ముఖ్య విషయాన్ని నొక్కి చెప్పడమే రచయిత ఉద్దేశ్యమనుకుంటాను.

12వ పద్యంలో ప్రాయోగికజీవన సూచన బాగుంది. 30, 31, 32 పద్యాల్లో పరోపదేశపాండిత్య ప్రకర్షగల గురువులను ఎండగట్టిన నిర్మోహమాటం మెచ్చుకోదగినది. 33వ పద్యంలో "నొవ్వక" అనేది నవ్వుచు తేలికగా తీసుకోమనే అర్థంలో వాడి ఉండవచ్చు. మళ్ళీ 54వ పద్యంలో గురుబోధ గొప్పదని ఉండగా, 56వ పద్యంలో 'పెద్దల మాట' అని ఉండటాన్ని మరోమారు పరిశీలింప వలెను. 45, 46 మొదలైన పద్యాల్లో వాడిన అగ్ని, ఓడ చక్కని ఉపమలు. ఇంకా చాలా పద్యాల్లో నదులు, సముద్రం, పక్షులు మొ. అతికిన పోలికలు. ఇలా కొన్ని పద్యాలను మాత్రం స్పృశించడం నా కిష్టమైన పరిమితి – పరిధి.

చాలా పద్యాలు - అర్థతాత్పర్యాలు ఇచ్చి ఉండకపోతే, రచయిత భావవ్యక్తీకరణం అసంపూర్ణంగానే ఉండేది.

నలభై పద్యాల వరకు ఒకేసారి వ్రాసినవి కాక అప్పుడప్పుడు ఆయా భావోద్వేగాల్లో వ్రాసినట్లు – చాలా రోజుల తేడా ఉన్నట్లు అనిపిస్తాయి. ఆ తరువాతి పద్యాలు 'శతకం' అనే ఆలోచన వచ్చాక, కొద్దికాలంలో వ్రాసినవి అనిపిస్తాయి. చివరి పదిపద్యాలు మళ్ళీ స్థిమితంగా వ్రాసినవి అనిపిస్తాయి.

మొత్తమ్మీద రచయిత భావుకుడు, ఆలోచనాపరుడు. ప్రాచీనతపై మక్కువ కల ఆధునికుడు. సమర్థుడు. గతంలో నేనెక్కడో వ్రాసినట్లు "అరణ్యంలో ఉంటూ, విశ్వంతో మమైక మయ్యేవాడు ఋషి - జనారణ్యంలో ఉంటూ, ఏకాంతాన్ని అనుభవించేవాడు తపస్వి". అరుణాచలశాస్త్రి తపస్వి కావడానికి ప్రయత్నిస్తున్న సాధకుడు అనిపిస్తుంది ఈ శతకాన్ని బట్టి.

అనుభూతి ఏకాంతమైనా, అనుభవం జనారణ్యంలో అన్నది వాస్తవం. "*జానన్నపి చ మేధావీ, జడవల్లోకమాచారేత్*" – అన్నీ తెలిసినవాడైనప్పటికీ, మేధావి జడునివలె లోకంలో ప్రవర్తించాలి. ఓ మంచికొడుకుగా, ఓ మంచిభర్తగా, ఓ మంచితండ్రిగా, ఓ మంచి ఉద్యోగిగా, ఓ మంచిపౌరునిగా, ఓ మంచిమానవునిగా ఉంటూనే, ఎల్లప్పుడూ ఏకాంతంలో ఉండవచ్చు. అదే సాధన - అదే తపస్సు. దాని ఫలితం ఇహం లో "ఓ మంచి". ఇహపరాల్లో పరమానందం. పరమానంద స్థానం సుధామమే. మరొక్కసారి సుధామమునకు స్వాగతం – ఈ స్వాగత సుధామం.

డా||యేలూరిపాటి ఆంజనేయ శర్మ

బ్రిడ్జ్ వాటర్, న్యూజెర్సీ, ఉత్తర అమెరికా

ఫిబ్రవరి 01, 2015

908-758-5078

## సుధామా శతకము – సుపరిశీలనము

డా|| యేలూరిపాటి అపర్ణ

ఎం. ఏ. (తెలుగు), పి.హెచ్ డి.

తెలుగుసాహిత్యంలో మొదటితరానికి చెందిన కవుల నుంచి నేటికాలంలో రచనావ్యాసంగాన్ని చేపడుతున్న సాహితీ రచయితల వరకూ ఇంచుమించు చాలా మంది పండితులు తమ రచనాప్రక్రియలలో ఒకటిగా చేసుకున్నదీ, చదువు నేర్చిన పండితులనుంచీ, చదువు నేర్వని సామాన్యుల వరకూ సులభంగా అర్థం చేసుకోవడానికీ, కంఠస్థంచేయడానికీ, జ్ఞాపకముంచుకొని వివిధసందర్భాల్లో ఉట్టంకించడానికి ఉపయోగించుకొన్నదీ శతకసాహిత్యం అనడంలో సందేహం లేదు.

సాధారణంగా శతకంలోని మొదటి రెండుపాదాలు ఒక విషయాన్ని ప్రతిపాదిస్తే, తర్వాతి రెండుపాదాలు ఆ ప్రతిపాదనను సమర్థించేవిగా ఉండడం కద్దు. కొన్ని పద్యాలలో ముందు ఒక ఉదాహరణను చెప్పి, దాన్ని సమర్థిస్తూ మిగిలిన పద్యాన్ని రచించడం కూడా ఉంటుంది. శతకాలలో సందర్భాన్ని బట్టి ఎన్నో జాతీయాలు, పలుకుబడులు, లోకోక్తులు, సామెతలు ఆ ప్రతిపాదించిన విషయానికి ఉదాహరణలుగా చోటు చేసుకుంటాయి. శతకాలలోని కొన్ని పాదాలు (ఉదా. అనువుగాని చోట అధికులమనరాదు మొ. వాక్యాలు) కాలక్రమంలో సామెతలుగా స్థిరపడినవి కూడా ఉన్నాయి.

సాధారణంగా శతకసాహిత్యానికి ఒకే విషయానికి, వస్తువుకు (సబ్జెక్టు) కట్టుబడి ఉండకపోవడం అనే విషయంలో ఎంత స్వతంత్రత ఉన్నప్పటికీ, సంఖ్యానియమం, ఛందోనియమం, మకుటనియమం వంటి విషయాల్లో ఏకసూత్రత కూడా ఉంటుంది. చాలాసార్లు ఒకే వస్తువు మీద కూడా మొత్తం శతక రచన నడవవచ్చు. అందువల్లనే భర్తృహరి తన త్రిశతిలో భక్తి, నీతి, వైరాగ్యమనే మూడు వస్తువులను తీసుకొని మూడు శతకాలను రచించాడు. కాళహస్తీశ్వర శతకం, దాశరథీ శతకం వంటివి భక్తి ప్రధానమైనవి కాగా, సుమతి, వేమన, కుమార, కుమారీ శతకాల వంటివి నీతిశతకాలుగా పేరుపొంది,

సమాజంలోని అవలక్షణాలను ఎత్తిచూపుతూనే, ఎటువంటి నడత మంచిది, ఎలాంటి నడక కూడనిది అనే విషయాలను తెలియచేస్తాయి.

మన ప్రస్తుత '*సుధామాశతకం*' కూడా వస్తువు విషయంలో తన స్వతంత్రతను తెలియచేస్తూనే, 'సుధామా' అనే మకుటంతో రచించబడి మకుటనియమాన్నీ, జ్ఞాన వైరాగ్యాలను ముఖ్యంగా గురుభక్తిని విశదీకరించే పద్యాలతో వస్తునియమాన్నీ, నూటికి పైగా పద్యాలతో సంఖ్యానియమాన్నీ, కందపద్యాలతో ఛందోనియమాన్నీ స్వీకరించనట్టు కనబడుతున్నది.

రచయిత శ్రీ భారతం అరుణాచలశాస్త్రి పండితకుటుంబంలో జన్మించడం ద్వారా తనకు సహజంగా సంక్రమించిన పాండిత్య ప్రతిభను, తెలుగు సాహిత్యాధ్యయనం ద్వారా తాను సంపాదించుకున్న వ్యుత్పత్తిని, ఎన్నో పద్యాలను రచించడం ద్వారా అభ్యసించిన రచనా ధోరణిని ప్రతిపద్యంలోనూ ప్రతిబింబించారు.

తన ఈ శతకం వైరాగ్య ప్రతిపాదకమనీ, అనుభవైకవేద్యమైన సర్వాత్మతత్త్వాన్ని అభివ్యక్తీకరింప చేయగలిగినదనీ, వేదాంతాధ్యయనానుభవముతో బోధపడే పరమాత్మ తత్త్వమును ప్రస్ఫుటీకరించేదనీ రచయిత తన ముందుమాటలో చెప్పుకున్నారు. ప్రతిపద్యానికీ ప్రతిపదార్థ తాత్పర్యాలను ఇవ్వడం ద్వారా చదువరులకు సులభగ్రాహ్య మయ్యేలా చేశారు.

ఇంక, ఈ శతకంలోని పద్యాల గురించి చెప్పుకోవాలంటే -- జ్ఞానవైరాగ్యాలతో పాటు గురువు పథనిర్దేశకుడనీ, శిష్యులకు గురువు సక్రమమైన దారి చూపగలడనీ, గురుభక్తి కలిగినవారికి జ్ఞాన సముపార్జన సులభమనీ చాలా పద్యాలలో చెప్పారు ఈ కవి.

సౌరభ మాఘ్రాణింపఁగ
సారంగము చేరి పుష్ప సంగతిఁ జచ్చున్
వారించు గురునిఁ గాదని
ఘోరంబగు భ్రాంతి నరుఁడు కూలు సుధామా! ...52

గురువు పలుకులపై శ్రద్ధ లేనివారికి కోటి యుగాలకైనా నిష్కృతి లేదని కవి స్పష్టంగా నిరూపించారు ఈ క్రింది పద్యంలో. "*దైవేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే న కశ్చ న?*" (దేవుడికి ఆగ్రహం కలిగితే గురువు చేరదీసి కాపాడతాడు. మరి ఆ గురువుకే కోపం వస్తే ఎవరు కాపాడగలరు?) అనే గురుగీతలోని వాక్యాన్ని కవి ఈ పద్యంలో కనబరిచారు.

నూటికిఁ బదిమందైనను

బాటింపరు గురు పలుకులఁ - బట్టిన భ్రమలన్

గోటి యుగంబులు గడచిన

బూటకము లెడల్పలేరు భువిని సుధామా! ... (54)

వేమన '*సద్గోష్ఠి వలన నీచగుణాలు నిర్మూలమై పోతాయి*' అని చెప్పినట్టుగానే, సద్గురువు సేవ వలన ఏది సత్యమో, ఏది ఒప్పో, ఏది సక్రమమో తెలుసుకొనే అవకాశం ఉన్నదనీ, గురువు మంచి నడకనూ నడతనూ నేర్పుతాడని ఈ కవికూడా మనసా వాచా నమ్మినట్టు కనబడుతుంది ఈ క్రింది పద్యంలో.

ఎందుకు జీవింప వలెనో

కొందఱి కైనను దెలియును; గురువులు నియతిన్

అందఱ కెట్టులనో తెలిపి

కొందురు మన్ననలఁ - దెలిసి కొనుము సుధామా! ... (75)

అలాగే, కాలయాపన చేయడం ద్వారా నష్టమే ఎక్కువనీ, "మనోజయంతు మాన్దవ్యః" అన్నట్టుగా మనకు సంకల్పం వచ్చినప్పుడే మంచిపనికి పూనుకోవాలనీ, మీనమేషాలు లెక్కిస్తూ వాయిదా వెయ్యకూడదనీ చెపుతూ ఇలా అంటారు.

సంకల్పించుచు మనుజుం

డుంకింపఁగ జీవఫలము నొందుట కొఱకై

శంకింపక, జాగొందక

యంకించును సఫలతలఁ బరాత్మ సుధామా! ... (76)

అలాగే, లోకరీతులను, మూఢనమ్మకాలను ఎత్తి చూపుతూ, అవన్నీ మాయామోహితులైనవారు చేసేవే అంటారు.

పనికొక ముహూర్త మంచును,
శని 'భరతముపట్టు' ననుచు, శాస్త్రంబనుచున్
గొని తెచ్చికొనకు మాయను
సునిశిత బుద్ధినిఁ బరాత్మఁ జూడు సుధామా! ... (7)

మన మనస్సులోని అంతశ్శత్రువులను ముందుగా గెలవగలిగితే విజయం సులభసాధ్యమని మరొక పద్యం లో ప్రబోధించారు.

మనమందలి శత్రువులను
వినమ్రతను గెలుచు వాఁడె విశ్వవిజయియౌ!
[1]తొణఁకెడు తలఁపుల తోడుత
వినుమెన్ని జయములఁ గొన్న విలువ? సుధామా! ... (3)

వేమన "తనువులోని యాత్మతత్త్వ మెఱుంగక వేర కలఁడటంచు వెదుక నేల? భానుఁడుండ దివ్వె పట్టుక వెదుకుటా?" అని అన్నట్టుగా, ఈయన కూడా మానవులు ఈ సంసారభ్రమల్లో చిక్కుకొని పరమాత్మతత్త్వమును మరచి, సంపదల కోసం తిప్పలు పడుతూ, అప్పులు చేస్తూ బాధలుపడుతూ ఉంటారనీ, సర్వధా, సర్వదా ముక్తులైనవారికి, ఇతరవిషయాలపై దృష్టి నశించిన వారికి కోరుకొనేది మరేదీ ఉండదు కనుక, మాయను తొలగించుకొని పరమోత్కృష్టమయిన స్థితిని ప్రతివారూ చేరుకోవాలని చెపుతూ --

త్రిప్పటల బారి మానిసి
యప్పుల పాలఁబడును, సకలైశ్వర్యములన్
గుప్పు పరమాత్మ మదిలో
రప్పింపక తిరుగనేల భ్రమల సుధామా! ... (43) లో అంటారు.

కాళిదాసు “పురాణమిత్యేవ న సాధు సర్వమ్” అనే శ్లోకంలో—‘పెద్దలు చెప్పారు కాబట్టి అదే మంచిదని భావించి  కొత్తవన్నీ పనికిమాలినవని వదిలి వేయరాదనీ మంచిచెడ్డలు పాతలోనూ కొత్తలోనూ కూడా ఉండవచ్చుననీ’ చెప్పినట్టుగా, ‘నలుగురూ నడచిన మార్గమే గొప్పదని అదే మార్గాన్ని అనుసరిస్తే, కొన్నిసార్లు మనం కోరుకున్న ఫలితాన్ని పొందలేకపోవడం కూడా జరుగుతుందని’ అంటారు ఈ కవి, క్రింది ఉదాహరణలో  --

నలుగురు నడచిన పథమున
సులభంబుగఁ నేఁగఁ గలము - శోధింపంగన్
ఫల సహిత వృక్ష మొకటియు
నలవినిఁ గనుగొనగఁ జాలమచట – సుధామా!  ...(73)

శ్రీ శాస్త్రిగారు కొన్ని పద్యాల్లో చక్కని అలంకారాలను ప్రయోగించారు.

- కనకపు నాడెము నెఱుఁగఁగఁ
  జెనకింపమె గీటుఱాతి జేగురు పలకన్? (దృ ష్టాంతాలంకారము ) (59)

- మంగల మందెగిరి పడు టె
  ఱుంగు చణక మెటుల వ్రయ్యలు పఱపు దానిన్? (ఉత్ప్రేక్ష)  (87)

నేయి తగ్గిన జ్యోతి యొక్క వెలుగు అణగారినట్లుగా, మాయ తొలగిన మానవుడు పరమాత్వతత్త్వాన్ని తెలుసుకోగలుగుతాడనే విషయాన్ని క్రింది పద్యం తెలుపుతుంది.

నేతులడుగంటఁ బ్రమిదల
జ్యోతి వెలుగు టెట్లు జరుగదో యటులె మహిన్
జేతమున భ్రాంతి యణఁగఁగ
నూత మొసగు నాత్మఁ జేరనూను సుధామా!  ...(94)

మౌనానికి చాలా గొప్ప శక్తి ఉందని ఎన్నో సందర్భాల్లో ఎందఱో కవులు, పెద్దలు  చెప్పారు. శ్రీ ఆదిశంకరాచార్యులవారు దక్షిణామూర్తిస్తోత్రంలో “*చిత్రం వటతరోర్మూలే, వృద్ధాః శిష్యాః గురుర్యువా, గురోస్తు మౌనం వ్యాఖ్యానం, శిష్యాః ఛిన్న సంశయాః*” అంటారు. శ్రీ భారతం శ్రీమన్నారాయణగారు కూడా తన ‘వివేకభారతం’లో రామకృష్ణ పరమహంస,

'రమణాయణం'లో రమణమహర్షులు కూడా ఎన్నో సందర్భాలలో మౌనంతో తమ శిష్యులకు సందేహ నివృత్తి చేసినట్లు వర్ణించారు. అలాగే శాస్త్రిగారు కూడా మౌనాన్ని గురించి ఇలా చెప్పారు.

మౌనము వహించు జ్ఞానుల
మానసమును బోలవలయు మనుజుని తలఁపుల్
లీనంబయి పరమానం
దానుభవమ్మున మునుంగు మభవ సుధామా! ...(95)

జ్ఞానులు వాఙ్మౌనము, అక్షమౌనము, కాష్ఠమౌనము అనే మూడు మౌనవిధానాలను పాటించి చిత్తాన్ని పరమాత్మలో నిలుపగలుగుతారు. అటువంటి దృఢచిత్తాన్ని పొందడమే మానవజన్మ ముఖ్యోద్దేశ్యమంటారు కవి.

మనసులోని మాయను ప్రయత్నంతో తొలగించుకున్నప్పుడే జ్ఞానసందర్శనం చేయ గలుగుతామనే గంభీరమైన విషయాన్ని గాలిపటం, పాము-నిచ్చెనల ఆట వంటి చిన్న చిన్న ఉదాహరణలతో కరతలామలకం చేశారు రచయిత.

పాముల-నిచ్చెన లాటలఁ
బ్రామాణిక తత్త్వమెఱిఁగి బ్రహ్మాన్వేషుల్
దామున్న చోటె పరము సు
ధామమని గ్రహింతు రాత్మతత్త్వ సుధామా! ...(98)

ఇటువంటి గొప్ప ఉదాహరణలను చూపిన ఈ శతకం ప్రస్తుతతరానికే కాక భావితరాలకు కూడా మార్గదర్శిని అవుతుందనడంలో ఏమీ సందేహం లేదు.

డా|| యేలూరిపాటి అపర్ణ
బ్రిడ్జ్ వాటర్, న్యూజెర్సీ, ఉత్తర అమెరికా
ఫిబ్రవరి 01, 2015
908-758-5078

## అరుణ కిరణం

"మధురకవి, సాహితీ కళాభిజ్ఞ"

రసరాజు (రంగినీని సత్యనారాయణ రాజు)

ఏ కథ అయినా అర్థమవుతుందేమో కానీ, తాత్త్వికత అంత సులభంగా బుర్ర కెక్కదు. మాయలోంచి మడమ త్రిప్పాలి. లోయలోంచి రోదసికి ఎగరాలి. ఇదే తాత్త్వి'కథ' చెప్పే సారాంశం. అందుకే దీన్ని అధిక సంఖ్యాకులు, 'మనకెందుకులే', అని వదిలేస్తూ ఉంటారు. అదిగో అటువంటి వాళ్ళ అరచేతిలో ఒలిచిన అరటిపండే ఈ శతకం. ఆ అరచేతిని ఏమాత్రం నోటిదగ్గర పెట్టుకోడానికి ప్రయత్నించినా చాలు -- కవిగారితో కలచాలనం చేసినట్లే!

అసలీ శతకానికి, ముందుమాటలు వెనుక మాటలు అవసరమా? అక్కర్లేదు. అన్నీ ఆ వైపునుండి ఈ వైపు వరకు కవిగారే కరతలామలకంగా పూస గుచ్చినట్లుగా పాఠకుల ముందుంచేశారు. ఒకరకంగా చెప్పలంటే కిటికీలు తనే తెరచి అరుణోదయం చూపించేశారు. ఇక సాధకుడు అందుకోవడమే తరువాయి. మధ్య మధ్య అలంకారాలు, వ్యాకరణాంశాలను కూడా ప్రస్తావించారు.

శతకాలు పండ్రెండవ శతాబ్ది నుండి వర్ధిల్లుతూనే వున్నాయి. సంబోధనతో కూడిన మకుటం తప్ప, మరొకటి ఈ ప్రక్రియలో పనికి రాదు. కవిగారు దానినే పాటించారు. తెలుగులో శతకాలు చంపకోత్పలాలతో మొగ్గతొడిగినా ఆ తరువాత అనేక రకాల పద్యాలు ఈ ప్రక్రియను ఆశ్రయించాయి. అందులో కందం కూడ ఒకటి. ఇది స్కంద శబ్దభవం! శివ సంబంధమైనది. అందుకే కందాలను మొదట శివకవులే ప్రచారంలోకి తీసుకొచ్చారు.

ఇప్పుడీ శతకము కూడ కందంలోనే నడిచింది. "సుధామా!" అంటూ మకుటమెత్తుకొని సాగే ఈ శతకం స్వధామాన్ని గుర్తుచేస్తుంది. తన నివాసాన్ని మర్చిపోయి అద్దెయింట్లో కాలం వెళ్ళబుచ్చుతున్న ఒకానొక వైఖరిని తూర్పార బడుతూ ఇందులోని ప్రతిపద్యం నిద్రలోంచి మేల్కొలుపుతుంది.

ఈ శతకానికి కృతికర్త - భారతం అరుణాచల శాస్త్రిగారు. అమెరికాలో డల్లాస్ లో ఉంటున్న జంధ్యాల శ్రీనాథ్ (కరుణశ్రీ గారి పౌత్రులు) గారి యింట్లో మొదటిసారిగా (2013) వీరితో నాకు పరిచయం ఏర్పడింది. అప్పుడు వారి బాహ్యరూపమే నేను గమనించాను. "ఒకటికి ఒకటి కలిపితే రెండు" అనే లెక్కల మనిషిగానే నాకగుపించారు. కాని ఇప్పుడీశతకంలో "ఒకటికి ఒకటి కలిపినా ఒకటే!" అంటున్న లెక్కలలో మనీషిగా కనిపిస్తున్నారు. ఆనాడు పైనున్న ఆకుల్ని చూశానే తప్ప ఈనాడు భూమిలో వేళ్లకున్న పల్లీలను (వేరుశనగ కాయలను) కూడ చూస్తున్నాను.

శాస్త్రిగారు "పండితుడైన పుత్రుడు" అనిపించు కున్నారు. వీరి తండ్రిగారు భారతం శ్రీమన్నారాయణ గారు "వివేక భారతం" వ్రాసి తెలుగు విశ్వవిద్యాలయం వారి నుండి 'ఉత్తమ పద్యగ్రంథ పురస్కారం' పొందిన మహనీయులు. పద్యాన్ని పల్లకి ఎక్కించినవారు.

నిజంగానే ఇది, పై స్థాయిలో అరుణాచలం నుండి ప్రభాత దీప్తిని పంచిన ఆధ్యాత్మిక శతకం.

శతకంలో అంతస్సూత్రంగా "మాయ - సాధన - పరమాత్మ" ఇవే ద్యోతితమౌతాయి. "సాధనమున పనులు సమకూరు ..." అంటూ వేమన్న ఎప్పుడో ప్రబోధించిన విషయం మనకు తెలిసిందే! దాన్నలా ఉంచితే – రేఖామాత్రంగా ఇందులోని కొన్ని పద్యాలను గురించి మాట్లాడు కొందాం!

పల్టీకొట్టిన ప్రతి విషయానికి పరితపిస్తూ "ఇది ప్రారబ్ధం" అనుకొనే వాళ్ళను మనం చూస్తూనే వున్నాం! చెడు అలవాట్లకు బానిసై చేసేదేదీ లేక చతికిల పడ్డప్పుడు "ప్రారబ్ధం" అనుకోవడం దేనికి? వాహనాన్ని వేగంగా పోనిచ్చి ఆసుపత్రి పాలయాక "ప్రారబ్ధం" అంటూ నిట్టూర్చడం ఎంతవరకు విజ్ఞత? జాగ్రత్త అనేది ముందే ఉండాలి. మానవజన్మ మహత్తర మైనది. ఇది మంచి, ఇది చెడు అనే విచక్షణ మానవునికి మాత్రమే ఉంటుంది! కళ్ళు తెరిచింది మొదలు మాయలోపడిపోయి సత్యాన్ని తెలిసికో లేక పోయానని ముగింపు దశలో పశ్చాత్తాపానికి గురికావడం తెలివి తక్కువ పని.

ప్రారబ్ధ మిట్టిదనుచును

ధీరత నణఁగింపఁ జేయు తీరున్న, భ్రమస్
మీఱు ఘనశక్తిఁ గలిగియు
నారంభింపకయె మూర్ఖుఁడార్చు సుధామా!

అనే పద్యంలో ఈ హితబోధ అంతా ఆవిష్కరింప బడింది. ఈ సందేశాన్ని చెవులు కాదు - హృదయం వినాలి.

దీని తరువాతి పద్యంలో - ఏది విజయం అనే దిశగా కవి తన కలాన్ని నడిపించారు. అలగ్జాండర్ ప్రపంచ విజేత అయితే మాత్రం లాభమేమిటి? ఆధ్యాత్మికంగా ఓడిపోయాడు. ఆర్గురు శత్రువులున్నారు లోపల. అనుక్షణం ఆ గ్రీకువీరుని వాళ్ళే జయిస్తూ వచ్చారు. ఇక విజయం ఎక్కడ? మాయను మట్టుపెట్టిన వాడే మహావిజేత! అదే –

మనమందలి శత్రువులను
వినమ్రతను గెలుచు వాఁడె విశ్వవిజయియౌ!
తొణఁకెడు తలఁపుల తోడుత
వినుమెన్ని జయములఁ గొన్న విలువ? సుధామా!

అనే పద్యంలో వివరిస్తారు శాస్త్రిగారు. జీవితంలో ఏది గెలుపో ఇక్కడ తేటతెల్లమయింది.

ఈ పంక్తుల్ని గమనించడి --

వింతను గను నుత్సాహం
బెంత నిలుచుఁ దిరిగి రాఁగ? హృత్సంస్థితమౌ
నంతర్యామినిఁ గనుగొను
సంతోషి పడునె ప్రయాస? జ్ఞాన సుధామా!

అసలు సిసలైన ఉత్సాహం ఎక్కడుందో ఈ పద్యం ఉల్లేఖించింది. చర్మ చక్షువులకు కలిగే ఆనందం అశాశ్వతం - అంతర్నేత్రాలనుభవించే ఆనందం ఆచంద్రతారార్కం. తీర్థయాత్రలు చేసి ఇంటికొస్తాం. వచ్చాక షరా-మామూలే! ఎవరి చిత్తవృత్తులు వాళ్ళవి. ఆనందమనేది తీర్థయాత్రల లోనే జారిపోయింది. అయితే, జారిపోని ఆనందాన్ని పొందటమెలా? దీనికి

సమాధానం - 'హృదయస్థుడైన అంతర్యామిని దర్శించటమే'. ఖర్చులేని సత్కర్మమంటూ ఉంటే అదొక్కటే!

తామరాకును చూస్తుంటాం! కాని దాని నుంచి మనమేమీ నేర్చుకోలేక పోతున్నాం! దేనితోనూ పోల్చలేని విశ్వవిద్యాలయం ఈ సృష్టిలోనే ఉంది. చీకటిలో కాంతి పతాకల నెత్తికొని సంచరించే మిణుగురు ఒక గురువు. యోగ సమాధిలో లీనమై సీతాకోకచిలుకగా మారే గొంగళి మరొక గురువు. చూడాలేకాని, గురుస్థానం మనకు దగ్గరలోనే ఉంది. తామరాకు కూడా అటువంటి గురువే! ఎలా?

అదెక్కడ పుట్టింది? బురదలో. బురదలో పుట్టినా ఆ తామరాకు మలిన రహితమై భోజనాది కార్యాలకు ఎంతగా ఉపయోగ పడుతున్నది! అలాగే, పద్మమెంతగొప్పది? శ్రీ మహావిష్ణుని నాభి స్థానాన్నే ఆశ్రయించి పైకి చూసింది. బ్రహ్మ దేవునకే జన్మస్థానం అయ్యింది. ఎంత వైతాళికత్వం ఇక్కడ గోచరించింది! మరి మట్టిలో పుట్టిన మనిషి మాటేమిటి? మాయకే పరిమితమౌతున్నాడు తప్ప మాధవుణ్ణి జేరుకోలేక పోతున్నాడు. తామరాకులోని ఈ తత్త్వాన్ని ఆకళింపు చేసికోమంటున్నాడు కవి ఈ పద్యంలో -

పంకజ నళినీదళ మక
ళంకితమగు నట్టులె తరళంబగు ధరణిన్
సంకటముల బారిఁ బడియు
నుంకింపకు మాయఁ దలఁపు నూన్ప సుధామా!

సమస్యలెప్పుడూ ఉంటాయి. అవరోధాలెప్పుడూ - "అక్కడాగు" అంటూ శాసిస్తూనే ఉంటాయి. కాని, మన శ్వాసను పరమాత్ముని భాషగా మార్చుకోవాలి ఊర్ధ్వదృష్టిని అలవరచుకోవాలి. ఈ పద్యాన్ని అవలోకించండి --

జడిఁబడి జడిసి విహంగము
లెడనెడఁ గొను గూటిపట్టు; నెగురును డేగల్
తడఁబడక మింట; దృఢగతిఁ
గడంకఁ జేకొన్న వాఁడె ఘనుఁడు సుధామా!

వర్షానికి భయపడి పిట్టలన్నీ - చెట్టునో, గూటినో ఆశ్రయిస్తూ ఉంటాయి. కాని, డేగల స్థాయి అందుకు భిన్నంగా ఉంటుంది. మబ్బుల్ని తమ కాళ్ళ క్రింద పెట్టుకుంటాయి. మేఘాల తలలు తన్ని పైకెగిరి అక్కడ నిశ్చలానంద స్థితిలో విహరిస్తుంటాయి. ఇక వానికి వర్ష బాధ ఎక్కడిది? చీకట్లు క్రమ్ముకొన్నప్పుడు మనిషి కూడ అలాగే స్థిర చిత్తంతో పై కెగరాలి, అప్పుడే సాధనా మార్గంలో గమ్యం అల్లంత దూరంలో కనిపిస్తుంటుంది. ఎంతో గొప్ప సందేశం ఇక్కడ రెక్కవిప్పి వియత్తలానికి ఎగిరిందో మనం అర్థం చేసికోవచ్చు.

అలౌకిక జగత్తులో కొంత లౌకిక వాదాన్ని ప్రవేశ పెట్టారు కవిగారు ఈ క్రింది పద్యంలో! అదికూడ లోక హితార్థమే సుమా!

వేదప్రామాణికతను
వాదమ్ముల నిల్పలేము; ఫలితము గలుగన్
భేదించు వారికైనను
నాదరణను మనసు మార్పనగును సుధామా!

రోగం తగ్గాలి. కానీ, మందు చేదుగా ఉంది. దానికి కొంచెం తీపిపూత తగిలిస్తే, ఫలితం పలకరిస్తుంది. అలాగే, వేదాల గురించి ప్రవచించే సమయంలో అవతల వాళ్ళకు అది కొరుకుడు పడకపోవచ్చు. అటువంటి సందర్భంలో వాదనలకు దిగకూడదు. ఆదరణకు తగినంత ప్రాతినిధ్యం కల్పించాలి. ఓర్పుతో, ప్రేమతో చెప్పాలి. అనురాగాన్ని మేళవించాలి. మనస్సును తాకేలా మధురిమను రంగరించాలి. కొంత 'టెక్నిక్' ఉపయోగించాలి. దానితో చెప్పేవాని ఆశయమూ సిద్ధిస్తుంది, విన్నవానికి మేలూ జరుగుతుంది. చందమామను చూపిస్తూ పిల్లాడికి గోరుముద్ద తినిపించడమే అది.

అడుగులు వేస్తున్న కొద్దీ, ఇలా ఎన్నో సోపానాలు ఈ "సుధామం" లో దర్శన మిస్తూనే ఉంటాయి. పాఠకులకు ఇవి సంక్షిప్త పరిచయం మాత్రమే! "అరుణ కిరణాల్లో ఒక కిరణాన్ని" ఇదిగో అని చూపించే ప్రయత్నం మాత్రమే ఇది! శతకంలో ఉన్న పూర్ణబింబ సారాన్ని, ఆస్వాదించే అవకాశం ఇక పాఠక మిత్రులదే! --

## పద్య బ్రహ్మవిద్య

భాషాప్రవీణ డా॥ చిఱ్ఱావూరి శివరామకృష్ణ శర్మ

M.A.(సంస్కృతము) M.A. (తెలుగు), Ph.D.

సుధామా శతకం రచించిన కవి ఒక ప్రముఖ కవి కుమారుడు, ఒక ప్రసిద్ధ పండితుని మనుమడు. తల్లి కూడ విద్వాంసురాలు. ఇలా వారసత్వంగా వచ్చిన కవిత్వ విద్యా సంపదల వల్ల వ్యర్థ పదంలేకుండా ఉద్దేశించిన భావాన్ని బాగా వెల్లడించ గలిగిన నైపుణ్య అలవడిందీ కవికి. తెలుగు కందంపై పట్టు సిద్ధించింది.

భారతీయ దర్శనాల్లో అద్వైతం ప్రముఖమైనది. విచిత్రమేమంటే, అద్వైత వేదాంతం, ఉపనిషత్తులు చదవ కుండానే, రమణ మహర్షి అద్వైతానుభావాన్ని పొందారు. దీనికి, వారి దివ్య చరిత్ర సాక్ష్యమిస్తుంది! దానిని కవి తండ్రి, శ్రీ భారతం శ్రీమన్నారాయణ గారు రమణీయ కావ్యంగా సంతరించారు. ఇలా ఈ కవి అద్వైత వేదాంత శతకం రచించారు.

మనకు తెలుగులో పూర్వం వేదాంత శతకాలు చాలా వున్నాయి. కాని ఆధునిక కాలంలో అద్వైత వేదాంత శతకం వ్రాయడం బాగా అభినందింప దగిన విషయం. అద్వైతానికి ప్రపంచ మతాలను సమన్వయం చేయగలిగిన మహాశక్తి ఉంది. సుందోపసుంద న్యాయముచేత ఒక మతాన్ని అంగీకరిస్తే మరొకటి తప్పు అనవలసి వస్తుంది. అద్వైత వేదాంతంలో ఒకే సచ్చిదానంద పరబ్రహ్మ జగత్తంతా వ్యాపించి ఉన్నందువల్ల ఎవరేవిధంగా దేనిని ఆరాధించినా, ఆ పరమాత్మ నారాధించినట్లే అవుతుంది. దీనివల్లనే, భారతదేశంలో భిన్నత్వంలో ఏకత్వం వ్యాపించింది. పరమత సహనం అలవడింది. కవికి శ్రీ శంకర భగవత్పాదుల వారి వివేక చూడామణి, దక్షిణామూర్తి స్తోత్రం మొదలైన పలు గ్రంథాలపై పట్టు ఉందని దీనిలోని పద్యాలు వెల్లడిస్తున్నాయి.

సమాజం పద్యానికి దూరంగా జరిగినందువల్ల, ప్రతిపదార్థ తాత్పర్యాలు వ్రాసి, తన సందేశం పలువురికి చేరడానికి కవి దోహదం చేశారు.

వేదాంతంలో శ్రవణం, మననం, నిదిధ్యాసనం ఉన్నాయి. ఈ గ్రంథ పఠనం మనన రూపం. దీనిలో తాత్పర్యం వ్యాఖాన రూపం కాబట్టి పద్యార్థం తెలియడం కోసమే కాక, విశేషాల కోసంకూడ తాత్పర్యం చదవాలి.

ప్రతిభావంతుడు క్రొత్తగా ఆలోచిస్తాడు, చెబుతాడు. ఒక పద్యంలో సూర్య తేజాన్ని మాయతో పోల్చారు. సంప్రదాయంలో సూర్యుని పరమాత్మగా ఉపాసిస్తారు. ఆధునికులు సూర్యుని ఒక గోళంగా భావిస్తారు. "జేష్ఠ" (నక్షత్రం) సూర్యుని కంటే చాలా రెట్లు పెద్దదైన గోళం. ఇలాంటి ఆలోచనతో కవి, సూర్య తేజాన్ని మాయతో పోల్చారు. అంటే, వైజ్ఞానికుల ఆలోచన ప్రభావమన్నమాట! దీనిలో, సైంటిష్టులు జ్ఞానులే అనే ప్రశంస ఉంది. ఇది సమన్వయ దృష్టి.

సహనానికి బ్రహ్మవిద్య ఒక మార్గమని "తిట్టిన వట్టిగ గట్టిగ ..." అనే పద్యం చెబుతుంది.

ఈ కవి మాటలలో కొన్ని మంత్రార్థాలు తొంగి చూస్తాయి. ఆ విషయం కవియే సూచించారు (17వ పద్యం).

ఇపుడు అంతర్జాతీయంగా బ్రహ్మవిద్యా ప్రచారం స్వామి దయానంద సరస్వతుల వారి శిష్యులు చేస్తున్నారు. ఇంకా జరగాలని కవి కోరుతున్నారు (18వ పద్యం). దానిలో భాగం ఈ శతక రచన కావచ్చు.

కవి వేదాంతాన్ని విశ్వసించినా 'నరకం'ను నమ్మడం లేదని (21వ పద్యం). ఉపనిషత్తులలో నరక ప్రస్తావన ఉంది. అది కవి నమ్మకము కావచ్చు.

కవి ఆధ్యాత్మిక సాధనవల్ల కలిగిన ధైర్యంతో ప్రబోధిస్తున్నారు (24వ పద్యం).

మలిమాటలో ముద్రాలంకారము ప్రయోగించి అలంకారాలపై తనకు కల పట్టును వెల్లడించారు. ఈ కాలంలో ఇలాంటి శతకం వ్రాసిన కవి అభినందనీయుడే!

డా॥ చిర్రావూరి శివరామకృష్ణ శర్మ
P.R.Nagar Park ఎదుట, (పాండురంగ నగర్), Hyderabad-18
ఫిబ్రవరి 21, 2015

## పరితోషం

ఆచార్య సార్వభౌమ ప్రొఫెసర్ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి
M.A. Ph.D. (Telugu), M.A. Ph.D (Sanskrit)
Retired Professor and former head of the department of Telugu
Andhra University, VishakhapatnaM

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ చి॥భారతం అరుణాచల శాస్త్రి గారు, విద్వద్వంశ సంజాతులు. మాతామహులు శ్రీ ఆకెళ్ళ అరుణాచల శాస్త్రిగారు, విజయనగర సంస్కృత కళాశాలలో ఆంధ్ర పండితులు. పితృపాదులు శ్రీ భారతం శ్రీమన్నారాయణ గారు, విశ్రాంత సంస్కృత కళాశాలాధ్యక్ష్యులు. పుట్టుకతో లభించిన సంస్కార విశేషముతో శ్రీ అరుణాచల శాస్త్రిగారు, లక్షణ బద్ధంగా 'సుధామా' అనే మకుటంతో శతకం రచించడం పరమ హర్షదాయకం!

తెలుగులోని పెక్కు శతకాలు సామాన్యంగా లోకపు తీరుతెన్నులని సమీక్షిస్తూ నీత్యుపదేశకంగా, భక్తిభావ బంధురంగా రచింపబడతాయి. ఈ శతకం ఆత్మతత్త్వ ప్రబోధాత్మకంగా రచింప బడడంవిశేషం! "ఆత్మావా~రే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అనే ఉపనిషద్వాక్యానికి వివరణ అనదగ్గది. ఆత్మ దర్శనానికి ప్రతిబంధకమైనది మాయ లేదా అవిద్య! దాన్ని తొలగించుకొని ఆత్మానుభూతి పొందదగ్గదని అడుగడుగునను ఈ శతకం ఉపదేశిస్తోంది.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" అని వేదాంతోక్తి. మనస్సు భ్రాంతియుత మైనప్పుడు శాంతి కలగదు, దుఃఖము ప్రాప్తిస్తుంది, భేదభావం పెల్లుబుకుతుంది. పరతత్త్వం ఆ మనస్సుని అనునయ మొనరిస్తూ సంసారము నుండి దాన్ని నివర్తింప జేస్తుంది, ఆ విధంగా మనస్సుని జయించి సర్వ సమత్వాన్ని దర్శించడానికి ఉపనిషద్వాక్యాలు ప్రమాణంగా గ్రహించు" - అని రచయిత "భ్రమగొన్న మనస్సు ..." (12) అనే పద్యంలో ఉపదేశించారు. అదే పద్యంలో, "అవనీ జనులస్

సమతా దృష్టినిఁ జూచెడు ... " అనే వాక్యం "పండితాస్సమదర్శినః" అనే వాక్య సారమే అవుతుంది.

మనస్సుని పరమాత్మ యందు లయం చేయగలిగితే అజ్ఞానం ఎంత విస్తరించినప్పటికీ ఏమీ చేయలేదని చెబుతూ - కవి, "నదములలోని నీరంతా సముద్రంలో కలిసినా అది నిశ్చలంగానే ఉంటుం"దని దృష్టాంత పూర్వకంగా "నదముల నీరంతయు..." (47) అనే పద్యంలో నిరూపించినారు. అజ్ఞానం నదుల నీటి ప్రవాహంవలే ఆక్రమిస్తుంది. మనస్సు ఆత్మయందు లయమైనప్పుడు అది అణగి యుంటుందని తాత్పర్యం! ఇట్టి స్థితి ఎవరికైనా లభిస్తుందా? అని ప్రశ్నించే వారికి సమాధానంగా "సందేహింపకు మెందటొ ..." (49) అని పేర్కొనినారు.

మనిషిలోని కోరికలు ఉప్పెనవలె ఉప్పొంగుతూ ఉంటాయి. 'అవి ఎప్పటికైనా నెరవేరుతాయా?' అని అతడు ఆరాటపడుతూ ఉంటాడు. దానివల్ల మనస్సుని ఆత్మయందు నిలుపుకోలేక అతడు కుప్పకూలుతాడు. ఈ మానవ సహజ స్థితిని కవి సహజ సుందరంగా "ఉప్పెన బోలు ..." (77) అని వివరించారు. ఆత్మ దర్శనానికి కామన గొప్ప ప్రతిబంధకమని భావం!

మనస్సుని మల రహితం చేసుకుంటూ ఆత్మకు సంబంధించిన వాదోపవాదాలని పూర్తిగా నిరాకరిస్తూ ఉండగలిగితే, ఆ ఆత్మ విశ్వరూపాన్ని దర్శింప జేస్తుంది, ఆహ్లాదాన్నీ కలిగిస్తుంది అని అనుభవ సిద్ధమైన సత్యాన్ని, "ఆదర్శ స్వచ్ఛత ..." (81) అనే పద్యంలో ఆవిష్క రించారు.

మనిషియొక్క పతనానికి అహంకారము ప్రబల హేతువు. నేను అనే ఆలోచన మనస్సులో ఘోర గర్వం అనే మాలిన్యాన్ని అద్దుతుంది. క్రమంగా అతడు దైన్యంతో మాత్సర్యం పొంది పతనమౌతాడు అని కవిగారు "నేనను తలంపు ..." (102) అనే పద్యంలో చక్కగా హెచ్చరించారు.

"ఆత్మ జ్ఞానంపై జిజ్ఞాస కలవారికే అది ప్రాప్తిస్తుంది - అజ్ఞానం గాఢంగా అలముకొన్న వానికి ఆత్మతత్త్వాన్ని ఉపదేశించడం, శ్రమ సాధ్యం అవుతుంది" అని కవి గారు "అజ్ఞత ముదిరిన ..." (100) అనేపద్యంలో యిచ్చిన తీర్పు శిరసావహింప వలసిందే.

ఆధ్యాత్మిక రంగంలో, గురువుకి ఎంతో ప్రాధాన్యం ఉన్నది. వివిధ విషయాలపై ఆసక్త మైన మనస్సుని క్రమశిక్షణతో గమ్యం చేర్చేవారు గురువులు. వివిధ మనస్తత్వాలు కల వారికందరికీ తగిన రీతిని జీవిత స్వభావాన్ని, నియమ నిష్ఠలతో నేర్పి మన్ననలు పొందేవారు గురువులు అంటూ రచయిత "భ్రమఁ గొలుపు తలఁపుఁ దొలఁచుచు ... " (53). "ఎందుకు జీవింప వలెనొ ... " (75) అనే పద్యాలలో గురు ప్రశస్తిని ప్రశంసించారు.

"న హి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవ వేదానాం" అని ప్రసిద్ధి. దీన్ని మార్చి కవిగారు పిల్లల్ని పెంచడంలోని కిటుకులను తల్లి తెలుపుతుంది, గొడ్రాలు తెల్లము చేయలేదు కదా అని "పిల్లల పెంపకపుఁ గిటుకులు ... " (32) అని చమత్కరించారు. ఈ కల్పన 'అనిదంపూర్వ' మైనది.

భాగవతంలో కుంతీ దేవి కృష్ణుణ్ణి "విపదస్సంతు న శ్శశ్వత్ ..." అని కోరుతుంది. దీని సారాన్ని కవిగారు. "నరునకుఁ గష్ట దశయే..." (58) అని పద్యబద్ధం చేశారు.

ఈ శతకంలో శ్రీ శాస్త్రిగారు 'ఊతకుదురు', 'మిడుఁగక', 'నలుగుడు వడుచున్', 'ఆత్రము', 'అలందురక', 'ఉంకించక', 'గబ్బు', 'ఊతము', 'ఏఁకట పడుచున్' మున్నగు అచ్చతెలుగు పదాల నెన్నింటినో అందంగా ప్రయోగించినారు. నేటి పద్య కావ్యాలలో ఇట్టి పదాలు బహుమృగ్యాలు.

రచయిత "తిట్టిన వట్టిగ గట్టిగ... " (15) అనే పద్యంలో "ట్ట" కారావృత్తిని, "జడిఁబడి జడిసి ..." (57) అనే పద్యంలో "డ" కారావృత్తిని చేకూర్చి తమ శబ్దాలంకార ప్రయోగ ప్రియత్వాన్ని ప్రదర్శించేరు. అర్థాలంకారములు కూడ పెక్కు స్థలములందు ప్రయోగింపబడి, రచనకి సొగసుని చేకూరుస్తున్నాయి.

ఈ శతకానికి, రచయితయే స్వయంగా వ్యాఖ్య కూడా రచించడం ఒక విశేషం! వివరణ లేకపోతే, సామాన్యులకి ఈ రచన దురవగాహంగా ఉండేది. "వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిః" అనే వాక్యానికి ఈ వ్యాఖ్య సార్థక్యం చేకూరుస్తోంది. "అసమ ప్రతిభను .." (78) పద్య వ్యాఖ్యలో "ప్రతిభాం షడ్విధాం విదుః" అని పేర్కొని వాటిని రచయిత వివరించారు. అలాగే, "యా మా సా మాయా" (107) పద్య వ్యాఖ్యలో "మా" అనే శబ్దానికి గల "లక్ష్మి" (సంపద) అనే అర్థాంతరాన్ని స్వీకరించి, ఎచట ధన సంపత్తి వున్నదో అది మాయ అని కావించిన వివరణ పరమ రమణీయం, పరమాహ్లాదకరం, రచయిత యొక్క ప్రతిభకు 'నికషోపలం'.

ఖండాంతరంలో ఉంటున్నప్పటికీ , తెలుగు భాషపై పట్టుని పెంచుకుంటూ తత్త్వోపదేశ ప్రధానంగా 'సుధామా' శతకాన్ని, రచించిన వర్ధిష్ణువు శ్రీ భారతం అరుణాచల శాస్త్రి గారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. పాఠకులు ఈ మధుర కృతిని ఆస్వాదించి తరింతురు గాక!

"శుభం భూయాత్"

విద్వజ్జన విధేయుడు

వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి

"శారదా పీఠం" Door No.46-15-35,

దొండపర్తి, విశాఖపట్నం-16

Phone: (0891) 2541003, Mobile: 9490084217

11-ఫిబ్రవరి-2015

## అరుణ సవనం

"ప్రవచన రాజహంస", "అభినవ వాల్మీకి", "అభినవ మల్లినాథ", "పద్యకళా తపస్వి"

అష్టావధాని డా॥ధూళిపాళ మహాదేవమణి

ధామం బియ్యది వేదశాస్త్రవరవిద్యాగంధశబ్దాలికిన్
స్థేమం బియ్యది కర్మజాలఘనతంత్రీచ్ఛేదఖడ్గాలికిన్
శ్రీమంతం బిది యాత్మశోధనకళాశ్రీపూర్ణచిత్తాలికిన్
ధీమంతంబు సుధామశాణ మిది బుద్ధిస్వర్ణబోధం బిదే!

ఇది ఈ కాలంలో వచ్చే శతకాలకి అక్షర దీపం. వివేక సౌగంధ్యాన్ని శబ్దాల పాత్రల్లో పోసి ప్రసాదంగా పంచిపెట్టే భావాల అక్షయ పాత్ర ఇది. కర్మల పరంపరని ఇది వివేకంతో నిశ్శేషం చేయించగలిగే వేదాంత బోధిని. ఎవరికి వారు ప్రత్యగాత్ములై - "*కో~హం?*" ప్రశ్నని సంధించుకొని విచారణ చేసికోడానికి శ్రీకార ప్రాకారం ఇది. బుద్ధి అనే బంగారం బాగా స్వచ్ఛంగా పండిందా లేదా అని వ్యక్తం చేసే సంఘర్షణ వర్ణశాణోత్తేజం ఇది. శతకాల చరిత్రలో కందాలతో ధీమకరందాన్ని అందంగా, ఆజ్యధారలుగా అద్భుతంగా హవనం చేసిన గొప్ప యాగం ఇది. వెరసి 'సుధామ'గ మకుటాయ మానమయ్యింది!

శతకకర్త చి॥ అరుణాచల శాస్త్రి మహోన్నత ప్రాచీన విద్యాపారంగతులు, వైయాకరణ ప్రాభాకరీ తేజ:పుంజాన్ని సూక్ష్మదేహంగా మనోవికాసంగా తీర్చి దిద్దుకొన్న మా మిత్రులు మాన్యశ్రీ భారతం శ్రీమన్నారాయణగారి పుత్రులు. అహోబల పండితీయానికి అద్వితీయంగా వ్యాఖ్య సంతరించిన యశఃకాయులు శ్రీ ఆకెళ్ళ అరుణాచల శాస్త్రిగారి దౌహిత్రులు. ఉభయ వంశాల పాండిత్య చంద్రమఃకాంతులతో మేధాకౌముదిని శరజ్జ్యోత్స్నాలహరిగా వృద్ధి పొందించుకొని మానస సరసిలో ఉత్ఫుల్ల ఉత్పలాల పద్య విక్రాంతిని పంటగా పండించుకొన్న సుఫలుడు, సఫలుడు అయిన ధన్యజీవి. ఈయన కవితా ఖద్యోత కాంతుల్ని ఆవిష్కరిస్తున్న మరో అరుణాచలమే! చేసే వృత్తికి, అనుసరించే ప్రవృత్తికి ఏమాత్రం సంబంధం లేదు. అలా అని, సంబంధం ఉన్న వారంతా 'కవితా

పుష్పాల్ని పండిస్తున్నారా?' అంటే -- లేనే లేదు. కనుక, వృత్తికి, ప్రవృత్తికి సంబంధం లేనివారే, గొప్ప చరిత్ర సృష్టిస్తున్నారు. అందులో శ్రీ ఆరుణాచల శాస్త్రి ఒకరు.

తెలుగునాట, సాధారణంగా భక్తి శతకాలే అగ్రస్థానం వహించాయి. చిన్నప్పటి నుండి మతిని తీర్చిదిద్దే సుమతీ శతకాలు, లోకవ్యవహార విజ్ఞానాన్ని నీత్యుపదేశాల్ని దృష్టాంతాలతో సహా చిత్రీకరించిన ప్రబోధనాత్మక శతకాలు చాలా వచ్చి రెండవ స్థానాన్ని అలంకరించాయి. ఇంక వేదాంత వైరాగ్య మోక్ష మార్గదిశా నిర్దేశంలో వచ్చిన శతకాలు చాలా తక్కువే అని చెప్పాలి. అవి వ్రాయడానికి కవికి ఔపనిషదిక జ్ఞానచంద్రికలు, జీవన అనుభవసార మర్మాలు, వ్యక్తీకరణ సామర్థ్యము, సాహసము దండిగా ఉండాలి. అందుకని ఎవరూ ముందుకు రారు, రాలేరు. ఆమధ్య 5,6 సంవత్సరాల క్రితం అనుకొంటా - 'కవి గాండీవి' బిరుదాంకితుడు వ్రాసిన ఒక శతకానికి ముందుమాట వ్రాశాను. మళ్ళీ, ఇన్నాళ్ళకి మంచి స్థాయిలో వచ్చిన శతకాన్ని ఆస్వాదించ గలిగాను.

ఈ శతకం మరో మహోన్నతిని సంతరించుకొంది. అర్థతాత్పర్యాలతో సమన్వయ సారస్వతంతో ఈ శతకం వికాసిస్తోంది. ఇందులో ఈ సుధామమే అగ్రగణ్యం. అనన్యం, నాన్యతో దర్శనీయం కూడా! నిజంగా ఇటువంటి మహార్థగంభీర సమన్వితమైన ఈ శతకానికి అర్థ నిర్దేశం చాలా అవసరం. చాలా మందికి హాయిగా అర్థం చేసే సౌకర్యం ఇది.

నాకుకూడ చాలా చోట్ల ఈ అర్థ సమన్వయాలు అవసరం అయ్యాయని నిజాయితీగా చెబుతున్నాను. కృతికర్తని బహుధా ప్రశంసిస్తూ, అర్థ తాత్పర్య ప్రదాతకు శిరసా నమస్కరిస్తున్నాను.

ఇందులో ప్రతి పద్యమూ మేధకి పరీక్షా, మనస్సుకి సంతోష కారకమూ అయినా, కొన్ని పద్యాలు నన్ను బాగా ఆకర్షించాయి. కొన్నిటికి నేను, వివశమూ అయ్యాను. ఈ విషయంలో పీఠికలోని "అంగఁగొనరు కోటీశ్వరులు ..." అనే పద్యంలో

"ఇంగితముగ నీకృతియం
దంగంబులఁజేకొనుఁ డని హార్దికవినతుల్!"

అన్న భావం, ఆ ధైర్యం, ఆ నైపుణ్యం, నాకు బాగా నచ్చాయి.

సాధారణంగా కావ్యం, శ్రీకారంతో ప్రారంభించడం, తెలుగు కవుల సంప్రదాయం! కానీ, ఈ కవి, "స్థిరమై, యణువణువున (1)" నిత్య శుద్ధ చైతన్యం యొక్క ఆనంద స్థితి అచంచలంగా సర్వ వ్యాప్తంగా ఉంటుందని ప్రారంభించడం పరమాత్మనే ఆదినిర్దేశం చెయ్యడం అద్భుతం!

'మంచి స్థానం కలవాడా', 'మహోన్నత స్థానం కల అద్భుత తత్త్వమా!' అన్న అర్థాల్లో 'సుధామా' అని సొంతం ఈ శతకంలో సంబోధించడం, ప్రతి వ్యక్తినీ ఆ స్థానం చేరుకోవాలని చెప్పడమే ఇందులో అంతర్నిర్దేశంగా భావించాలి. మనస్థానం (ఆత్మస్థితి) చంచలంగా కాకుండా, అనేక జన్మల ప్రవాహంలో కొట్టుకు పోకుండా, ఎప్పుడూ కదలకుండా స్థిరంగా ఉండగలిగే మోక్షానందాన్ని చేరుకొన్నప్పుడేకదా సుధామం అవుతుంది? అదే కదా పరమ గమ్యం! అంతటి భావౌన్నత్యమే ఈ శతకానికి మకుటమై మకుటాయమానం అవుతోంది!

కొమ్మను వ్రాలెడు పక్షులు
నమ్మును దమ ఱెక్క శక్తి నడునడుఁగకయే;
యిమ్ముగ నాత్మ నెఱుంగుచుఁ
గొమ్మిఁక సర్వాంతరత్వగుణము సుధామా! ... (5)

ఇది గొప్ప దృష్టాంతం. నిజానికి ఇక్కడ "పక్షశక్తి" అన్నా సరిపోతుంది. కానీ, ఱెక్కని వికృతిని చెయ్యడం - అంతా మాయే, యథార్థం కాదు సుమా, ఆ మాయతో జీవుడున్నా మాయాచ్ఛేదాన్ని చేసుకొని యథార్థాన్ని గుర్తించాలి - అన్నది ధ్వని. ప్రకృతి నుండి వికృతి గా మారిన మనం, తిరిగి ప్రకృతిని పొంద గలగడమే కదా సాధన!

'మృతినొందిన జీవుఁడుఁ గడు
వెతలొందు నరకమున'నను విశ్వాసముతోన్
మతిచెడు చింతలఁ జేయక
బ్రతుకఁగ - నే కొదువలు గనరావు సుధామా! .... (21)

ఇది కర్మమీమాంస, జ్ఞానమీమాంసల యొక్క ప్రసంగం. నిజానికి ఈ వయసులో ఇలా వ్రాయడం సాహసమే! దీనికి క్రింది సమన్వయ వివరణ లేక పోతే, సామాన్య పాఠకుడు భ్రమలో పడి నిత్యజీవన కర్మ సిద్ధాంతం పట్ల మతిభ్రమణ పొందడం ఖాయం! "*తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే*" అన్న గీతాచార్యుని ఉపదేశం అపార్థం అయిపోయే ప్రమాదం వస్తుంది. నిష్కామ కర్మ యోగం ఎప్పుడూ మహోన్నతమే! ఎప్పుడూ మన ఆలోచనలు మతిని నిలబెట్టుకొనేవి కావాలి కానీ, మతిని చెడగొట్టుకొనేవి కాకూడదు సుమా అని చెప్పడమే, పై పద్యం యొక్క పరమార్థంగా గుర్తించాలి. స్వర్గనరకాలు ఉన్నాయన్న విశ్వాసం తప్పుకాదు కానీ, మనం ఆ ఆలోచనల్లోనే కూరుకు పోకుండా పరమాత్మలో మన ఆలోచనలు లయం చెయ్యాలని చెప్పడమే ఇందలి మహోపదేశం!

ఇందులో, "వయసునఁ బెద్దని...." (30) అన్న పద్యం, ఈ వేళ సమాజంలోని పోకడల్ని తూర్పార బడుతోంది. నిజంగా చాలామంది ఆ మార్గంలోనే పయనిస్తునారు. ఒకరి అనుభవాలు చూసైనా జాగృతి వహించడంలేదు మరొకరు. నిత్యానందం అనుభవించే మార్గంలో ప్రయాణించాలి కానీ, అదిస్తామని పేరుపెట్టుకున్నవారి మాయలో పడకూడదు. ఆనందం ఎప్పుడూ ఒకరు ఇచ్చేది కాదు. మనంత మనమే సాధించాలి. అందుకే, "స్వీయాత్మను లయమొనరింపుము" అని అమోఘంగా చెప్పడం జరిగింది. 49వ పద్యంకూడా పరమాత్మానందాన్నే చెబుతోంది.

కొండని అద్దంలో చూపించడమెలాగో అనంత పరమాత్మ తత్త్వాన్ని కందాల్లో ఇమిడ్చడమూ అంతే! ఏ అణువూ అక్కడ తగ్గదు. ఏ పరమాణువూ ఇక్కడ తగ్గ కూడదు. కేవలం పదహారు గణాల్లో నడిచే కందంలో వేదాంత బోధ చెయ్యడం మాటలు కాదు! "*అల్పాక్షరమసందిగ్ధం...*" అన్న సూత్ర లక్షణాలవలే సారం అంతా ఈ కందాల్లో పదాల్లోనూ, అక్షరాల్లోనూ కూరడం జరిగింది. మట్టిగింజలో మట్టిచెట్టు తిరోధానంగా వున్నట్లే, ఈ కందాల్లోనూ "*మహతో మహీయాన్*" అనిపించే తత్త్వం దాగి ఉంది. దాన్ని అర్థతాత్పర్యాలు చాలావరకు చూపించ గలిగినా, ఇంకా ఇంకా సాధనతో మహత్తత్త్వాన్ని మరింత పైకి తీసుకు రాగలిగినంత సాంద్రసారం ఈ చిన్ని పద్యాల్లో నిబిడీకృతం అయ్యింది.

అద్దమునకంటు దుమ్మును

రుద్దుచు వస్తువుల఼ గనమె ప్రోజ్జ్వలితముగన్?

దద్దరముగ఼ గ్రమ్మెడు కడు

గద్దరి తెర లెడల నాత్మ఼ గనుదు సుధామా! ... (55)

ఆత్మతత్త్వాన్ని పొందడానికి గొప్ప సాధన ఇందులో చెప్పబడింది. మనం దృష్టి దోషంవల్ల కంటికి కళ్ళజోడు పెట్టుకొని వస్తువుల్ని చూస్తాం! కళ్ళద్దాలు స్వచ్ఛంగా ఉన్నంత వరకు, బయట ప్రపంచం స్వచ్ఛంగా కనబడుతుంది. కానీ, ఏ మాత్రం దుమ్ము అంటుకొన్నా, ప్రపంచం మసకగా కనబడుతుంది. విజ్ఞులు ఆ దుమ్మును తొలగించి కార్యసాధన చేసుకొంటారు. ఇక్కడ అప్పుడూ, ఇప్పుడూ ఒకలాగే చూస్తాం కానీ, దుమ్ము అనే మాయ మనకి యథార్థాన్ని కప్పిపుచుతోంది. అలాగే, మనని కూడా 'అనాత్మ' అనే మాయ క్రమ్మి ఆత్మతత్త్వాన్ని సరిగా చూడలేక పోతున్నాం! బయట కనిపించే ప్రపంచం అంతా అనాత్మే. మాయే. మిధ్యే. కాని, అదే సత్యమన్న భ్రమలో పడుతున్నాం! కానీ, సత్యం బయట లేదు. మనలోనే ఉంది. ఇక్కడ ఉంది కనుకనే అక్కడ కనబడుతోంది. అంతే తప్ప, అక్కడ కనబడుతోంది కనక ఇక్కడ ఉంది అనుకోడం తప్పు! శంకరులు "*విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం...*" అని తేగేసి చెప్పారు. బయట ప్రపంచం అంతా అద్దంలో ప్రతిబింబమే అన్నారు. దాన్ని సాధనతో మాత్రమే యోగి తెలిసికో గలుగుతాడు. ఈ కవీ అదే భావాన్ని అంత గూఢంగానూ పై పద్యంలో చెప్పాడు! మాయ అనే దుమ్ము దులుపుకోండి సాధకులారా అని వేదాంత డిండిమాన్ని మ్రోగిస్తున్నాడు (107) ఇలా పదా, పరకా, మొత్తం 108 పద్యాలూ అంత గాఢంగానూ నడిచాయి.

ఈ శతకం వ్రాయడం ఒక మహా యజ్ఞం అయితే అది చదివి ముందు మాట వ్రాయడమూ మరో యజ్ఞమే! నాకు ఈ విధంగా యజ్ఞఫల భాగస్వామ్యాన్ని ఇచ్చిన పండిత మిత్రులు శ్రీ భారతం శ్రీమన్నారాయణ గారికి ''*భూయో భూయో నమామ్యహం*'.

ఈ శతకాన్ని శ్రద్ధగా నిష్ఠగా జాగృతితో చదవండి. అప్పుడు ఆత్మవిద్యాఫలమనే పతకం వరించిన వారవుతారు. ఈ రచయిత చిరంజీవి అరుణాచల శాస్త్రిగారికి పదే పదే అభినందనలతో, ఆశీస్సులందిస్తున్నాను.

పస కలవానికిఁ జెల్లును
రసమయ మగుకవిత చెప్ప బ్రహ్మపద మిలన్
వస వోసినంత వచ్చునె?
నస పెట్టెడి కవితతప్ప, నలుగుడు తప్పన్!

అరుణుని తమోఘ్న దీధితి
అరుణాచలశాస్త్రి! నీకు నమరెన్ - దానన్
పరఁగె ననాత్మవివేకము
వరమై - "అరుణాచలాఖ్య" వరలెన్ గాదా!

ధూళిపాళ మహాదేవ మణి
Venkateswara Apartments, A-Block 2nd Floor, Flat-3,
Krishna Nagar, Rajahmundry 533104
Phone: 0883-2473926 Mobile: 9494002247
mahadevududhulipala@gmail.com

## సోదర సుధామం

"అవధాని శేఖర", "అవధాన భారతి", "ఉత్తమ అధ్యాపక అవార్డు గ్రహీత",

"మహాకామేశ్వరి పురస్కార గ్రహీత", "సూర్య సదన ఆస్థాన పండితులు"

భాషాప్రవీణ డా॥ కట్టమూరి చంద్ర శేఖరమ్

M.A. (Telugu), M.A. (Sanskrit) M.Phil, Ph.D.

Principal Government junior College, A.P.

మా మాతామహుల పేరు శ్రీ ఆకెళ్ళ అరుణాచల శాస్త్రి. వారికి ముగ్గురు కుమార్తెలు. గృహనామాన్ని ప్రక్కన పెడితే, మిగిలిన పేరును మూడు ముక్కలు చేసి ముగ్గురూ తమ సంతానంలో ఒకరికి ఆ పేరును తగిలించారు.

మూడవ ఆమె (సత్యవతి) కూతురు అరుణ, పెద్దామె (సుబ్బలక్ష్మి - మా అమ్మగారు) కొడుకు చలం, రెండవ ఆమె (కమలాంబ) కొడుకు శాస్త్రి. అందరి సంతానాల్లో, మిగిలిన వారి కంటే, వీరి ముగ్గురు పిల్లలు విశేష ప్రజ్ఞా పాటవాలు కలవారు, అదృష్ట వంతులు కూడ!

మా తాతగారి ముగ్గురు కుమార్తెలు తెలుగు పండితులే! వారి భర్తలు సంస్కృతాంధ్ర పండితులు. అందులో, రెండవ అల్లుడు గారు భారతం శ్రీమన్నారాయణ. వారు సంస్కృత కళాశాల ప్రాచార్యులుగా చేసినవారు. సంప్రదాయ కవిత్వంలో అందెవేసిన చేయి వంటివారు. పాంచాలి, శ్రీ రమణాయనం, వివేక భారతం వంటి ఉద్గ్రంథాలు వ్రాసిన వారు. సంస్కృతాంధ్ర భాషావ్యాకరణాలలో మంచి పట్టుకలవారు.

ఇంతటి నేపథ్యంలో పుట్టిన వాడు మా సోదరుడు అరుణాచల భారతం - సుధామా శతకకర్త. ఆయన చదివింది బి.టెక్. సాఫ్ట్ వేర్ ఉద్యోగి. ప్రవాస భారతీయుడు (అమెరికాలో ఉద్యోగం). వ్రాసింది శుద్ధ గ్రాంథిక భాష, ఛందో బద్ధ కవిత్వం. ఒకదానికొకటి పొంతన లేని విశేషాలు. ఎన్ని ధనాలున్నా, వంశ పారంపర్య ధనానికి తిరుగు లేదని నిరూపించాడు.

కదంబ వృక్షానికి కాకరకాయలు పుట్టవు కదా! తండ్రిగారి బాణీలో, తన వాణిని వినిపించడానికి ఈ శతకాన్ని వ్రాశాడు.

ఈ శతకానికి "సుధామా" అనే పేరు పెట్టడమే విశేషం. సాధారణంగా శతకాలు భక్తి, నీతి, వైరాగ్య భావాలను బోధిస్తాయి. ఈ శతకం చదివేటప్పుడు అధ్యాత్మ భావాలు తప్పని సరిగా ఉండాలి. దానిద్వారా, వేదాంతాధ్యయనానుభవమున పరమాత్మ తత్త్వం బోధపడుతుందంటాడు కవి.

ఆ భావాన్నే, శతక మంతటా చూపిస్తాడు. అందులో నుండి కొన్ని ఉదాహరణలను స్థాలీపులాకంగా ఇక్కడ అందిస్తాను.

ఈ ప్రపంచంలో ప్రతి జీవిలో పరమాత్మ ఉన్నాడు -- ఈ విషయాన్ని గ్రహిస్తే, ఏ గొడవా ఉండదు. అహింసావాదంలో అసలు రహస్యము అదే కదా! శరీరంలో అరిషడ్వర్గాలు ఉన్నాయి (కామ, క్రోధాదులు). వాటిని జయించడానికి ప్రయత్నం చెయ్యాలి. అది మాని, విశ్వవిజేతలు కావడానికి ప్రయత్నం చేయడం తప్పు అంటాడు కవి. (2వ పద్యం).

అన్ని బలాల్లోకి ఆత్మబలం గొప్పది. ఆత్మబలం ఉంటే, ఎలాంటి కార్యాన్నయినా ఇట్టే సాధించ వచ్చు. ఈ ఆత్మబలం మాత్రం పరమాత్మ తత్త్వాన్ని అర్థంచేసుకున్న వాడికే దొరుకుతుందట (5వ పద్యం).

"పీత కష్టాలు పీతవి, సీత కష్టాలు సీతవి" అన్నట్లు అందరికీ సమస్యలు ఉంటూనే ఉంటాయి. ప్రపంచంలో సమస్యలు లేనివారు ఉండరు. ఈతిబాధలు మానవుని తరుముతూ ఉంటాయి. కాని జ్ఞాని అయినవాడు అందులో పడి కొట్టుకోకుండా మోక్ష సాధనకై ప్రయత్నించాలి అంటాడు కవి (16వ పద్యం).

ఈ జన్మలో ఇంతే సంపాదించాను (పుణ్యం), మిగిలింది మరుజన్మలో సంపాదించుకోవచ్చు అనే తృప్తిని పొందకూడదు, అసలు మరుజన్మ ఉందో లేదో, ఎవరికీ తెలుసు? ఈ జన్మలోనే సంపాదించాల్సిన పుణ్యం సంపాదించుకోవాలి. (88వ పద్యం).

"మన ఏవ మనుష్యాణాం, కారణం బంధమోక్షయోః" - బంధాలలో చిక్కుకోవడానికైనా మోక్షాన్ని పొందడానికైనా మనమనస్సే కారణం అని పెద్దలవాక్కు. అందుకే, ఆ మనస్సును చెడు వ్యసనాల పైకి కాకుండా మోక్షమార్గంవైపు మరలించ మంటాడు కవి (78వ పద్యం).

పుస్తకాలు చదివినంతలో, ఎవరో ఏదో చెబితే చేసినంతలో పరమాత్మ దర్శనం సాధ్యం కాదు. పరమాత్మ దర్శనానికి నిరంతర సాధన ఉండాలి. కర్మఫల పాశాలు విడిపోవడానికి ఈ సాధన తోడుపడుతుంది. అప్పుడే పరమాత్మ దర్శనం అవుతుంది (65వ పద్యం).

వాన పడేసమయంలో పక్షులు ఒక నివాసం వెతుక్కుంటూ పై కప్పుల క్రిందకో, గోపురాల క్రిందకో చేరుతాయి. డేగలు మాత్రం వానమబ్బులు దాటి వాటికంటే పైకి వెళ్లి తమను తాము కాపాడు కుంటాయి. అదే విధంగా, మానవులు కష్టాలు వచ్చినప్పుడు తప్పించుకోడానికి ప్రయత్నించడం కాక, లక్ష్యాన్ని చేరుకోడానికి ప్రయత్నించాలి అంటాడు (57వ పద్యం).

ఇలా చెప్పుకుంటూ పోతే, ఆ గ్రంథం కన్నా ఇదే పెద్దదవుతుంది కాబట్టి, మా సోదరుని పద్యాలలో నుండి  కొన్నిటిని ఇక్కడ ఉదాహరించాను. మిగిలినవి పాఠకులకోసం....

ఈ విధంగా గ్రంథమంతా ఆధ్యాత్మిక భావనతో వ్రాయడం నిజంగా పూర్వజన్మ వాసనా విశేషమే కాని ఇతరం కాదు. ఐదుపదుల వయస్సు దాటనివాడు, ఆంగ్ల భాషా పారీణుడు, సాఫ్ట్ వేర్ ఉద్యోగి ఇలాంటి శతకం వ్రాసి నందుకు ఎంతో అభినందిస్తున్నాను. ఇంకా ఇంకా కృషి చేసి, మరెన్నో గ్రంథాలు వ్రాయాలని ఆశీర్వదిస్తున్నాను.

సోదరుడు

చంద్ర శేఖరమ్

విజయనగరం - మార్చ్ 08, 2015

Phone: 94417 13528

## Social Wake-up call

**An ardent devotee and disciple of Sri Sri Sri Visvyogi Viswamji Maharaj and contemporary Sadhaka - Sri Balakrishna Panuganti**

**Sri Gurubhyo namaha**

**"Sudhama Satakam" composed by Bharatam Arunachala Sastry reflects upon his profound thought process. It is a deep dive into self-introspection of the human life. The poet has conducted a "*yoga sadhana"* either on self or with the help of realized souls.**

**The poet "Arunachala" has truly reached the pinnacle of "Arunachalam" through his composition. Each and every one of the 108 poems, bring to the reader a moment of self-evaluation.**

**These are no ordinary poems written for pleasure reading or to pass time. They carry in-depth meaning which could become guide posts in the spiritual progress of a literary seeker.**

**"Sastriji" (as I always address him) and I have been classmates and friends for over 30 years. He has shown interest in literary works and fine arts apart from the routine field of studies and work. It humbles me to be able to even review such fine composition and makes me feel proud of being his friend.**

**The poems cover aspects of meditation, determination, exploration and even ignorance that come in way of realizing self. The poet even expounded the blind beliefs which all hinder the process of realizing the ultimate truth.**

The poet hinted true aspirants to let go off their ego and not to worry about the many difficulties one may face in the spiritual paths. The definition of these paths is CLEAR and to follow the path the perils one may have to face are well described in beautiful small poems. Even the aspect of people making deals with “absolute” in the process of realization has been touched.

Self-realization of the power that exists within each and every human being comes to light in the poems. The expression of gaining control on the senses and conquering "Maya" by overcoming obstacles becomes vivid in the poet’s work.

One observation that sets the poet on a different scale is the thought of providing the meanings along with a summary for each and every poem so as to enable even a normal reader to understand.

Several of the poems expound the real need of a Sadguru to provide the right guidance in the process of realization. They also caution the seeker to be careful of traps and taking any help from wrong people. He also cautioned the seekers to get first hand interpretation on any scriptures of knowledge.

The comparison of mother to GOD falls in line with the teachings of all the realized souls and Sadgurus. Comparison of foreign land relocation to the seeking of GOD shows the poet’s efforts of simplifying the self-realization process.

Some of the poems echo a social wakeup call to those running behind acquiring more wealth. They even caution the readers to not give up any undertaking as the goal could never be reached by doing so.

The "Sanatana Dharma" principles, which has been the true dharma of Bharat (India) before all the various paths of faith have formed, resounds through many of the poems as well as the poet's heartbeat.

To summarize my review at a high level, "*self-realization, determination, meditation, uninfluenced by external disturbances, gaining control over the sense organs, Sadguru's grace, overcoming delusion, getting the true knowledge and getting rid of ignorance, yoga sadhanam, exploring within self, overcoming ego, self-control, self-reformation, self-satisfaction"* are a few words / sentences that would describe the poet's feelings within these beautiful composition. These 108 gems of poems would truly help the readers to start introspecting within.

Wish the poet "Sastriji" all the best in this wonderful rendition and wish him success in all his future endeavors.

Lokah Samasthah Sukhino Bhavantu

Om Shantihi Shantihi Shantihi

బాలకృష్ణ పానుగంటి, April 05, 2015

చికాగో, ఇల్లినోయిస్ స్టేట్, ఉ.అమెరికా

## కృతజ్ఞతాభివందనములు

పెద్దల ఆశీఃఫలాన్ని కొద్దిగా అందుకుచ్చుకొని, తోచిన విధంగా పద్యాల కూర్పుతో ఈ శతక నిర్మాణాన్ని కావించిన నాకు, గొప్ప విద్వాంసులు, పండితులు, పద్యాలను ఆశువుగా చెప్పగలవారు, విమర్శకులు, గేయధారల మధురిమలను పంచగల సత్తాగాలవారు, అవధాన చమత్కృతులతో రసజ్ఞులను తన్మయులను చేయగల ప్రజ్ఞా ధురంధరులు తమ తమ అభిప్రాయాల ద్వారా ఆశీస్సుమాలను అందజేయడం అదృష్టంగా భావిస్తున్నాను.

తమ శుభాశీస్సులతో, పరిచయ సుగంధాలను వెలువరించిన శ్రీ కట్టమూరి లక్ష్మీనారాయణ కొండలరావు పెదనాన్నగారికి, షడ్విధ తాత్పర్యలింగాలతో సుధామా శతకాన్ని పాఠకలోకానికి పరిచయం చేస్తూ విమర్శనాత్మకంగా తన పుత్రోత్సాహాన్ని తెలియ చేసిన మా తండ్రి శ్రీ శ్రీమన్నారాయణ భారతం గారికి, వైద్యుడు నాడిని పట్టి రోగనిర్ధారణ చేసిన విధంగా ఈ సుధామా శతకపు అంతర్వాహినిని, దాని పూర్వాపరాలను చర్చిస్తూ ఈ కావ్యాన్ని స్వాగతించిన మా బావగారు శ్రీ యేలూరిపాటి ఆంజనేయ శర్మగారికి, ఈ కావ్యాన్ని సుపరిశీలనా బృంహణావలోకనము గావించిన మా సోదరీమణి శ్రీమతి యేలూరిపాటి అపర్ణ గారికి, ఈ శతకంలోని పద్యాలను అహస్కరుని ఉదయారుణ కిరణాలతో పోలుస్తూ మధురంగా, రసమయంగా అభిప్రాయాన్ని తెల్పి ఆశీస్సులిడిన శ్రీ రసరాజు గారికి, ఈ శతకాన్ని 'బ్రహ్మవిద్య' తో పోల్చి తన అభినందనాశీస్సులను గుప్పించిన శ్రీ చిట్టావూరి శివరామకృష్ణ శర్మ గారికి, ఈ శతకాన్ని తత్త్వోపదేశము అంటూ తన పరితోషాశీర్వచనాన్ని పలికిన 'ఆచార్య సార్వభౌమ' ప్రొఫెసర్ శ్రీ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి, సుధామా శతకమునొక క్రతువుగా, పద్యాలను ఆజ్యధారలుగా పోల్చి ఆత్మవిద్యాఫలమనే ప్రశంసను ప్రసాదించిన అవధాన రాజహంస శ్రీ ధూళిపాళ మహాదేవమణి గారికి, శతాధిక అవధానాలు చేసి ప్రాచ్యవిద్యా పారంగతులై, శిరోధార్యాశీఃకుసుమాలను వెదజల్లిన సోదరులు శ్రీ కట్టమూరి చంద్రశేఖమ్ గారికి, శ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్ గారి ప్రబోధాశ్రయమున విశ్వతత్త్వ సాధనను జరపుచూ ఈ శతకమును "అజ్ఞానమును పారద్రోలు సామాజిక మేల్కొలుపు" గా (ఆంగ్లమున)

అభివర్ణించిన తృప్తాంతరంగులు శ్రీ పానుగంటి బాలకృష్ణ గారికి నమస్సుమాంజలులను అందజేస్తూ, ఈ శతకమును మీ ముందుంచుచున్నాను.

*మత్తకోకిల:*

జొత్తుతామరతేనెఁ గ్రోలిన చొప్పునన్ బ్రతిపద్యమున్
జిత్తగించుచు సారధారల సేకరింపుగ వ్యాఖ్యలన్
పొత్తిగుడ్డల బిడ్డమాదిరి ముద్దులొల్కెడి పల్కులన్
గ్రొత్త కావ్యపు గుట్టువిప్పిన గొప్ప విజ్ఞుల కంజలుల్!

ఇట్లు

అరుణాచల భారతం

## సుధామా శతకము

1. స్థిరమై, యణువణువున ని
 ర్భరమై, యానంద తత్త్వ వర్ధనమై, మై
 మఱపించు భ్రమల కూతకు
 దుర్గై పరఁగు పరము నెఱుఁగఁ దొడఁగు సుధామా!

స్థిరము + ఐ = అచలమై, కదలనిదై, నిలకడగా నుండునట్టి; అణువణువునస్ నిర్భరము + ఐ = ప్రతి అణువు నందునూ పెల్లుగా నుండి; ఆనంద తత్త్వ వర్ధనము + ఐ = తనను చేరగోరు వారికి అమందానందానుభూతిని కలుగ జేయు పరతత్త్వమే అగుచూ; మై మరపించు = పరవశులుగా చేయు; భ్రమలకుస్ + ఊతకుదురు + ఐ = మాయ, భ్రాంతి, భ్రమ, అజ్ఞానము మొదలైన వానికి ఆధారభూతమై (బలమైన ఆధారమై); పరగు పరముస్ = వ్యాపించునట్టి పరమాత్మను; ఎఱుగస్ + తొడగు ('ము' వర్ణ లోపము వికల్పము) = తెలిసికొన ప్రారంభింపుము.

ఓ సుధామా! కదలిక అనునదిలేక స్థిరముగా నుండు నట్టిదియును, ప్రతి అణువందున నిండియుండి ఆనందమే తత్త్వముగా కలిగియుండి, అజ్ఞానమునూ, పరవశతనూ కలిగించు మాయకు ఆధారభూతమైనట్టి పరమాత్మను గూర్చి తెలిసికొన వలసి యున్నది -- కావున, 'తెలిసికొనుట' అను వివేచన కార్యమునకు పూనుకొనుము!

2. ప్రారబ్ధ మిట్టిదనుచును

ధీరత నణఁగింపఁ జేయు తీరున్న, భ్రమస్

మీఱు ఘనశక్తిఁ గలిఁగియు

నారంభింపకయె మూర్ఖుఁడార్చు సుధామా!

ప్రారబ్ధము = కర్మ యొక్క విశ్లేషణ మాయ; ఇట్టిది + అనుచున్ = ఈవిధముగా నున్నది అను తలచుచూ; ధీరతన్ + అణగింపన్+చేయు = దైర్యముతో నశింప చేయు; తీరు + ఉన్నన్ = అవకాశమును కలిగి యున్నను; భ్రమస్ = మాయను; మీఱు ఘన శక్తి కలిగియున్ = దాటగలుగు (నశింప జేయు) శక్తియుక్తులు కలిగి యున్నప్పటికినీ; ఆరంభింపకయె = (అట్టి కార్యమునకు) శ్రీ కారము చుట్టకయే; మూర్ఖుడు = మొండివాడు, అవివేకి, తెలిసి తెలియనివాడు; ఆర్చున్ = ఘోషించును, అరపులు, బొబ్బలు పెట్టును.

ఓ సుధామా! అజ్ఞానాన్ని అంతమొందించుకొను శక్తిని కలిగి ఉన్నప్పటికీ, అస్థిర సంసార మాయలో పడి, “మా ప్రారబ్ధము / కర్మ ఇటులనే కాలినది” అను మిథ్యాతత్త్వ వాదనల మూర్ఖత్వముతో మానవులు రోదనలు చేయుదురు కానీ, అటుల ఆ మాయను అంతమొనరించు దిశగా అడుగులు వేయలేక పోవుచున్నారకటా!

3. మనమందలి శత్రువులను

వినమ్రతను గెలుచు వాఁడె విశ్వవిజయియౌ!

[1]తొణఁకెడు తలఁపుల తోడుత

వినుమెన్ని జయములఁ గొన్న విలువ? సుధామా!

[1] పై పద్యమున "న-ణ ప్రాస" ప్రయోగింపబడినది.

మనము + అందలి = మనస్సులోని; శత్రువులను = కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను ఆరు శత్రువులను; వినమ్రతను = వినయముతో, విధేయతతో; గెలుచు వాడె = నెగ్గ గలిగిన వాడు మాత్రమే; విశ్వవిజయి + ఔన్ = విశ్వమును జయించిన వాడగును; వినుము = (ఈ సూక్తిని) సావధానముగా వినుము; తొణకెడు తలపుల తోడుతన్ = తొట్రుపాటు కలిగించు ఆలోచనలను (స్థిరత్వము లేని ఆలోచనలను) కలిగి ఉండి; ఎన్ని జయములన్ = బాహ్య సంసారమున ఎన్ని విజయాలను; కొన్నన్ విలువ? = పొందినప్పటికీ, ఏమి ప్రయోజనము?

ఓ సుధామా! విశ్వ విజేతలుగా పేరొందాలని, ఈ భూమండలము నంతనూ శాసించాలని అలెగ్జాండర్ (ఈయనకే పర్షియన్ భాషలో 'సికందర్' అని పేరు ఉన్నట్లుగనూ కనిపించును), చంగేజ్ ఖాన్ వంటి యోధులు ప్రయత్నించి విఫలులైనట్లు చరిత్ర చెప్పుచున్నది! వారీ సంసారములో అగుపించు మాయా విశ్వమును జయించ తలచినవారు. కనుకనే, మాయచే ఓడింపబడి నశించినారు.

కానీ, "కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యములు" అనబడు అసలు శత్రువులను జయించిన వారే నిజమైన విశ్వవిజేతలు అగుదురు. ఎందువల్ల ననగా, ఆ ఆరు శత్రువులను జయించినచో మాయ జయింపబడును. మాయను జయించి భ్రాంతిని తొలగించుకొనిన వారికి పరమాత్మ తత్త్వమలవడి వారే పరమాత్మకు ప్రతిరూపులగుదురు. అట్లు కానిచో, పైన ఉదహరించిన యోధుల వలెనే నశింపక తప్పదు సుమా!

4. వ్యతిరేకత పొడసూపిన
మితి కొలఁదిగఁ బ్రగతి యున్న మిడుఁకక సాఁగన్
మతినంటిన భ్రమ తొలఁగును;
నుతియింతురు జనులు వేయినోళ్ళ సుధామా!

వ్యతిరేకత పొడసూపినన్ = అనుకూల స్థితి ఏర్పడక పోయినను; ప్రగతి మితి కొలదిగన్ ఉన్నన్ = అతి స్వల్పమైన పురోగతి కనిపించినను; మిడుకక సాగన్ = (వెనుదిరుగక) సాధనను ఆపకుండా ముందుకు సాగినచో; మతిన్ + అంటిన = మనస్సుకు పట్టిన; భ్రమ తొలగును = భ్రాంతి తొలగి పోవును; జనులు = ప్రజలు; వేయినోళ్ళన్ = మిక్కిలిగా, ఎక్కువగా; నుతియింతురు = పొగడ్తలతో గౌరవింతురు

ఓ సుధామా! భక్తి, ప్రపత్తి మార్గములే శరణ్యమని విశ్వసించియో లేక పూజాది కార్యక్రమములు నిర్వర్తించనిచో భగవంతుడు శిక్షించునను భయము వలననో, లేక సంప్రదాయ పరంపరగా వచ్చుచున్న క్రియలను, కర్మలను చేయక పోవుట, క్రొత్తపుంతలు త్రొక్కుట అనునవి దైవనింద, దైవాపరాధములు అని నమ్ముచునో లేక మరొక ఏదేని కారణము చేతనైననూ ముక్తి సాధకులను అనాదరించు వారు ఉండవచ్చును.

అట్టి సమయములలో జ్ఞాన సాధనకు వ్యతిరేకత పొడసూపినట్లు అగుపించ వచ్చును. లేక, జ్ఞాన సాధకుడవైన నీకే సహనము నశించి ఈ మార్గమున ప్రగతి అతి తక్కువగా ఉన్నది అని అనిపించనూ వచ్చును. అయిననూ, సాధనను విడువక ముందుకు సాగినచో, మనస్సుకు కలిగిన మాయ పొరలు, భ్రమలు తొలగి పోవును. చక్కని స్థానమును పొందిన వానిగా ప్రజలచే కొనియాడ బడెదవు. అనగా, వ్యతిరేకత కల్పించిన వారే, తిరిగి నీ సమక్షములో నీ సాధన యొక్క పర్యవసానమును, అభివృద్ధిని గౌరవింతురు. కనుక, పరిస్థితి ఎటులున్నను, సాధన నాపవలదని భావము!

## 5. కొమ్మను వ్రాలెడు పక్షులు

నమ్మను దమఱెక్క శక్తి నడునడుఁగకయే;
యిమ్మున నాత్మనెఱుంగుచుఁ
గొమ్మిఁక సర్వాంతరత్వ గుణము సుధామా!

కొమ్మను వ్రాలెడు పక్షులు = ఎక్కడెక్కడో ఎగిరి కొమ్మల మీద వ్రాలుచున్న పక్షులు; నడునడుగక = చలింపక (భయపడక); తమ రెక్క శక్తిన్ నమ్మను = తమ రెక్కలకున్న శక్తిని నమ్మను; ఇమ్మునన్ = అనుకూలముగా, అందముగా; ఆత్మన్ + ఎరుంగుచున్ = పరతత్త్వము యొక్క స్వభావమును గ్రహించుచూ; సర్వాంతరత్వ గుణమున్ = సర్వాంతర్యామి లక్షణమును; ఇకన్ = ఆలస్యము చేయక; కొమ్ము = అందుకొనుము;

ఓ సుధామా! కొమ్మమీద వ్రాలునప్పుడు పక్షికి, ఆ కొమ్మ విరుగునేమో నను చంచలత్వము, ఆలోచన, భయము, భీతి, కంపము కలుగవట - ఎందువలననన్న, ఆ పక్షి తనరెక్కల బలమును నమ్మను కనుక. అదే విధముగా, పరమాత్మ తత్త్వమును ఒంటపట్టించు కొనిన మానవులకు, 'ఆత్మబలము' చేకూరగా, చంచలత్వమును కలిగించు మాయ దరిజేరదు సుమా!

*పరమాత్మ నిజమునకు 'నిర్గుణ' తత్త్వము. అయిననూ, పై పద్యమున "అన్నిటియందును నిలిచి యుండుట (సర్వాంతరత్వము)" అను తత్త్వమును పరమాత్మ యొక్క గుణముగా కల్పితమై చమత్కరింప బడినది!*

## 6. ఒంటిగ యానము సేయుట

మంటగునను తలఁపుఁ గొనుచు మడఁగకు మాయస్
జంట పనులు నొక్కొక తఱి
నంటించును జల్లఁబడని యగ్ని సుధామా!

ఒంటిగన్ = ఒంటరియై; యానము చేయుట = మోక్ష మార్గమున ప్రయాణించుట; మంట + అగున్ + అను = తాపమును కలిగించును అను; తలపున్ + కొనుచున్ = ఆలోచన చేయుచూ; మాయన్ మడగకు = మాయవలన క్రుంగిపోవలదు; ఒక్కొక తఱిన్ = ఒక్కొక్క సారి; జంట పనులును = జంటగా చేయు పనులునూ; చల్ల బడని అగ్నిన్ + అంటించును = ఆర్పరాని మంటలను వ్యాపింప చేయును

ఓ సుధామా! సంఘములోని అసమానతలను రూపుమాపుట కొఱకో, లేక సంఘ సంరక్షణ కొఱకో మనువు మొదలైన పెద్దలు బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, సన్యాసము మొదలైన వివిధ ఆశ్రమములను ఆయా ధర్మములను ఆయా నియమ సూత్రములలో పొందుపరచుట జరిగినది. ఒక ఆశ్రమము రెండవ దానికంటెనూ గొప్పదని చెప్ప జాలము!

ఒక్కడుగా వ్యక్తిచేయు సాంఘిక వ్యాపారమును 'ఒంటరి పోకడ'గ ముద్ర వేయలేము. అటులనే, జంటగ (వేరొకరితో కలిసి) చేయు వ్యాపారము ఫలదాయకమని ఘంటాపథముగ చెప్ప జాలము! ఎవరికి వారు, వారి ఆనంద మార్గమును ఎంపిక చేసికొన వలసినదే!

"*ఉద్ధరేత్ ఆత్మనా ఆత్మానం మగ్నం సంసార వారిధౌ*" (సంసార సాగరమున మునిగిన వాడు తనను తానే ఉద్ధరించుకొనవలెను) - వివేక చూడామణి

*Single does not always mean 'lonely'. Relationship does not always mean 'happy'!*

7. పనికొక ముహూర్త మంచును,

శని 'భరతముపట్టు' ననుచు, శాస్త్రంబనుచున్

గొని తెచ్చికొనకు మాయను

సునిశిత బుద్ధిని, బరాత్మ, జూడు సుధామా!

భరతముపట్టుట = శిక్షించుట, ఏడ్పించుట, పగ తీర్చుకొనుట (*నుడికారము, నానుడి*); పనికిన్ ఒక ముహూర్తము + అంచునున్ = ఒక్కొక్క పని ప్రారంభించుటకు ఒక్కొక్క ముహూర్తమున్నది; శని భరతము పట్టున్ అనుచున్ = (లేనిచో) శని గ్రహము పట్టి పీడించును అను తలచుచూ; శాస్త్రంబు + అనుచున్ = శాస్త్రములలో ఈ విధముగా చేయుమని వ్రాయబడి యున్నది అని తలచుచూ; మాయను కొని తెచ్చుకొనకు = నీకు నీవుగా వెళ్లి మాయాజాలములో చిక్కుకుపో వలదు; సునిశిత బుద్ధిన్ = వాడియైన, పదునెక్కిన, తీక్ష్ణ బుద్ధితో; పరాత్మన్ చూడు ('ము' వర్ణలోపము) = పరమాత్మ తత్త్వమును చేరుకొనుము;.

ఓ సుధామా! కాలము ఒక ప్రవాహముగా కాక ఒక "చక్రముగా" మానవుల మనస్సులలో ముద్రితమయి యున్నది. దానికి మానవులు తాము చూచిన, అనుభవించిన శీతోష్ణ స్థితులే కారణముగా తోచుచున్నది. మానవులు, కాలనిర్ణయమనే జ్యోతిషానుమాన శాస్త్రమును పరిమిత భావి ప్రయోజనార్థమై వినియోగించుకొను మాయకు బానిసలై భ్రాంతమనస్కులై యుందురు. కానీ, అట్టి మాయా ప్రభావమునకు లోనుకాక సునిశిత బుద్ధితో మానవులు పరమాత్మ తత్త్వమును గ్రహించుటకు ప్రయత్నింప వలసి యున్నది సుమా!

## 8. తరుణమునకు ద్వంద్వఫలము

నరు లొసఁగిరి మాయ చేత నలుగుడు పడుచున్

వరువాత, నిసి గణింపక

గురు వాక్కులఁ గొని పరాత్మఁ గూడు సుధామా!

తరుణమునకున్ = సమయమునకు (అనగా, ప్రతి క్షణమునకూ); ద్వంద్వఫలమున్ = (మంచి సమయము, చెడుపు కాలము) అను ద్వంద్వ స్వభావమును; మాయ చేతన్ = మాయ వలన; నలుగుడు పడుచున్ = బాధపడుచూ, సంకట పడుచూ, అలమటించుచూ; నరులు + ఒసగిరి = మానవులు ఏర్పరచుకొనిరి; వరువాత = ప్రభాతము (అనగా, దినము అని భావం). నిసి = చీకటి (అనగా, రాత్రి అని భావం); గణింపక = లెక్కింపక; గురువాక్కులన్ కొని = పరమాచార్యుని పలుకులను గ్రహించి; పరాత్మన్ కూడు = పరమాత్మ యందు లయించుము

"*మీన - మేషాలు లెక్కించుట*" అను నానుడి వింటిమి కదా! "దిన యామినులు" అని కూడ వినికిడిలో కలదు. అట్టి కోవకు చెందినదే, "వరువాత, నిసి గణింపులు".

ఓ సుధామా! తమకు మేలు జరగాలి అను తలపులతో మానవులు జ్యోతిషవేత్తల సాహాయ్యముతో ముహూర్తములను నమ్ముచూ, దానికి మంచి సమయమునకై వేచి చూచుచుందురు. అట్టి కాలమాయకు గురికాక, సద్గురువులను సందర్శించి వారు చూపిన మార్గములో స్వానుభవముతో పరమాత్మ తత్త్వమును గ్రహించి గొప్ప ఆనందమును పొందెదమని ఆకాంక్ష!

9. ములుకులఁ గ్రుచ్చ్చఁగ[1] మానస

మలపెఱుఁగక, వీఁగిపోక, యాత్రము వడకే

వెలుపలికిఁ బాఱు తలఁపుల

నిలువఱచెడు పరమ స్రష్ట నీవ సుధామా!

[1]గ్రుచ్చ్చగ - అనునది వ్యాకరణ బద్ధము కాదు. 'గ్రువ్వగస్' అని ఉండవలెను. అయిననూ పెక్కురు కవుల ప్రయోగమును బట్టి గ్రుచ్చగ అను పదమునే వాడితిని.

మానసము = మానవుల మనస్సు; ములుకులస్ + క్రుచ్చగస్ = సూదులచే గ్రుచ్చినట్లుగా బాధను కలిగింపగా; వీగిపోక = ఓటమి పాల బడక, ఓడిపోక ; అలుపు + ఎరుగక = అలసట నొందక; ఆత్రము+పడక = ఆపదలో చిక్కుకొనక; వెలుపలికిస్ పాఱు = బాహ్యములో తిరుగాడు; తలపులస్ = ఆలోచనలను; నిలువరచెడు = కట్టి ఆపగల; పరమ స్రష్ట = విధాత, పరబ్రహ్మ; నీవ = నీవే

ఓ సుధామా! మానవులకు వారి మనస్సే బద్ధ శత్రువుగా తోచుచున్నది! ఎందుకనగా, ఏవేవో కష్టాలను, తాపాలను, నష్టాలను వారి జ్ఞప్తికి కలుగ చేసి, వారిని ముల్లు గ్రుచ్చినట్లుగా బాధించుచూ ఉండును. మనస్సు యొక్క ఈ ప్రవృత్తిని గ్రహించి కుదుట బరచుకొని, ఆపదల బారినుండి తప్పించుకొని, ఈ మనస్సునకు కళ్ళెము వేసి ఆ ఆలోచనా ప్రవాహమును కట్టడి చేయగలిగిన శక్తి కలిగిన జీవుడా, నీవే నీ జీవిత శిల్పివి, మార్గ దర్శకుడవు, భవిష్యత్తును నిర్దేశించుకొన గలుగు బ్రహ్మవు నీవే సుమా!

**10. అవధు లెఱుంగని మాయను**

**భవమం దవలీలఁ ద్రోచి పరమాత్మ నటన్**

**నవరక్తిమ నవధూతలు**

**వివరంబుగ నిలుపుచుంద్రు వేగ సుధామా!**

అవధులు + ఎరుంగని మాయను = ఎల్లలు, అవసానము అనునవి తెలియనట్టి భ్రాంతిని; అవలీలన్ + త్రోచి = సులభముగా ప్రక్కకు నెట్టి; అవధూతలు = జ్ఞాని పుంగవులు, యోగీశ్వరులు; అటన్ = అచ్చట; పరమాత్మన్ = పరమాత్మ తత్త్వమును; నవరక్తిమన్ = క్రొత్త వన్నెలతో; వివరంబుగన్ = వ్యాఖలు, ఉదాహరణలతో వివరించి బోధించుచూ; వేగన్ = వేగముగా, త్వరితముగా; నిలుపుచున్ + ఉంద్రు = స్థిరపడునట్లు చేయుదురు, ప్రతిష్ఠింతురు

ఓ సుధామా! ద్వంద్వములో పడిన మానవులకు మాయను గ్రహించుటయూ, జయించుటయూ కష్టతరమగును. కావున వారు అవధూతలైన గురువుల సమక్షములో సాధన పద్ధతులను తెలిసికొని సాధన చేయగా, వారికినీ వారి యొక్క నిజతత్త్వము బోధపడగలదు. అవధూతలు - అజ్ఞానాన్ని పారద్రోలు శక్తి కలిగినవారై, వివిధ రీతుల వివరించి, ఉపదేశించి, బోధించి, మానవులను ఆయత్త పరచి వారికి పరమమును సిద్ధింప చేయుదురు.

## 11. దిన మార్తాండుని తేజం

అనయంబును గప్పివేయ నగపడక - నిసిఁ
గనఁబడుఁ దారలు; ప్రజ్ఞ
న్గొని యల్పజ్ఞత విదల్చి కూల్చు సుధామా!

గమనిక: సాధారణముగా, సూర్యుని జ్ఞాన ప్రకాశునిగా పోల్చి చెప్పుట జరుగును. కానీ, పై పద్యమున వ్యతిరేకముగా మాయతో పోలిక చెప్పబడినది. అది అసమంజసమని కొందరికి అనిపించవచ్చును. అటుల అనిపించుటయూ మాయాతిమిరమే అగును.

దిన మార్తాండుని తేజము = సూర్యుని యొక్క పగటి వెలుతురు; అనయము = అత్యంతము (మిక్కిలి, ఎక్కువగా), సతతము (ఎల్లప్పుడూ); కప్పివేయన్ = ఆచ్ఛాదన పరుపగా, క్రమ్మివేయగా; అగపడక = గోచరము కాక; తారలు నిసిన్ + కనపడున్ = నక్షత్రములు రాత్రి సమయములలో మాత్రమే కనిపించును; ప్రజ్ఞన్ + కొని = ప్రజ్ఞను చేకొని, అందుకొని; అల్పజ్ఞతన్ = అజ్ఞాన కారకములను (అజ్ఞానమును కలిగించు తెరలను); విదల్చి కూల్చు ('ము'వర్ణ లోపము వికల్పము) = తొలగించుకొనుము

"*ప్రజ్ఞానం బ్రహ్మ*". ప్రజ్ఞానం అనగా, "*ప్రకృష్టం జ్ఞానం, ప్రజ్ఞాయతే అనేన ఇతి చ ప్రజ్ఞానం. జ్ఞా అవబోధనే*" అని 'అమర కోశం' తెలియ జేయుచున్నది. ప్రకృష్టమైన జ్ఞానము దీని చేత చక్కగా తెలియును, కనుక ప్రజ్ఞానం. ప్రజ్ఞానమును అర్థము చేసికొనినచో "బ్రహ్మ"ను అర్థము చేసికొని నట్లే!

ఓ సుధామా! సూర్యుని యొక్క పగటి వెలుతురు ఎల్లప్పుడూ మిక్కిలిగా క్రమ్మి వేయగా గోచరము కాక, నక్షత్రములు రాత్రి సమయములలో మాత్రమే కనిపించును. అటులనే, ప్రజ్ఞను చేకొని, అజ్ఞాన కారకములను (అనగా, అజ్ఞానమును కలిగించు తెరలను) విదల్చి కొనినచో పరమాత్మ ప్రకాశము కన్పట్టగలదు సుమా!

12. భ్రమఁగొన్న మనస్సు నసున
యమొందఁగ మఱల్చుఁ బరమ; మవనీ జనులన్
సమతా దృష్టినిఁ జూచెడు
ప్రమాణమున జేతవగుచుఁ బరఁగు సుధామా!

భ్రమన్ + కొన్న మనస్సును = మాయతో భ్రమలో పడిన మనస్సును; అనునయము + ఒందగన్ = ఊరట (ప్రశ్రయము, ఆశ్వాసము) కలుగునట్లుగా; పరమము మరల్చున్ = పరతత్త్వము (హృదయమునకు) మరల్చును; జేతవు + అగుచున్ = మనస్సుపై గెలిచిన వాడుగా అగుచూ; అవనీ జనులన్ = నీతోడి మానవులనందరనూ; సమతా దృష్టినిన్ చూచెడు = ఒక్కవిధముగనే (అందరూ సమానమే అను దృష్టితో) చూడగలుగు; ప్రమాణమునన్ + పరగు = వేదాదులచే నుపలబ్ధమైన జ్ఞానహేతువుచే వర్ధిల్లుము.

ఓ సుధామా! మాయతో భ్రమలో పడిన మనస్సుకు ఆశ్వాసము కలుగునట్లుగా పరతత్త్వము (ఆలోచనలను) హృదయమునకు మరల్చును. మనస్సుపై గెలిచిన, పట్టు సాధించిన వాడవుగా అయి, మానవుల నందరనూ ఒక్కవిధముగనే (అందరూ సమానమే అను దృష్టితో) చూడగలిగి, వేదాదులచే నుపలబ్ధమైన జ్ఞానహేతువు నందుకొని వర్ధిల్లుము. జ్ఞానివై ముక్తిమార్గమున చరియించి సర్వ ముక్తుడవై సర్వాత్ముడవు కమ్ము.

13. తన తోఁకకు నిప్పంటఁగ

వనమంతయుఁ గాల్చుఁ గ్రోతి; ప్రజ్ఞాన గతిస్

దనువును లెక్కింపకయే

కనుగొనెదవు సదుపయోగ ఘనత సుధామా!

సుధామా = ఓ జ్ఞానీ; క్రోతి = కోతి = వానరము (తెలివి ఉండియూ ఆ తెలివిని సదుపయోగము చేసికొన లేని అజ్ఞాని యైన కోతి); తన తోకకుస్ = తనయొక్క తోకకు; నిప్పు + అంటగస్ = మంట అంటుకొనినచో; వనము + అంతయుస్ = మొత్తము అడవి అంతటినీ; కాల్చుస్ = దహించును; ప్రజ్ఞాన గతిస్ తనువును లెక్కింపకయే = ప్రతిభతో శరీరమునకు కలుగు బాధలను, కష్టములను గణింపకయే; సత్ + ఉపయోగ ఘనతస్ = మంచి సదుపాయమును కలిగించు గొప్ప పద్ధతిని; కనుగొనెదవు = నీ పరిశోధనల ద్వారా తెలిసికొనగలవు (గమనించి ప్రజల మంచికై పంచుతావు).

ఓ సుధామా! తెలివి ఉండియూ ఆ తెలివిని సదుపయోగము చేసికొన లేని కోతులు తమ తోకకు నిప్పు (మంట) అంటుకొనినచో చిందులు వేయుచు తమకు నివాసమును కలిగించు అరణ్యము కాలిబూడిద అగుటకు కారణ భూతమగును, కానీ, సుధాముడవై, ఆత్మనిగ్రహ ప్రజ్ఞానము కలిగిన నీవు, శరీర బాధలను లెక్కింపవు - ఉపయోగ కరమైన పద్ధతులను కనుగొని ప్రజలకు పంచుతావు.

అనగా, ప్రజోపయోగము కొరకై, మానవాళికి సదుపాయములను సౌకర్యములను అందించుట కొరకై అహోరాత్రములు కృషి చేయుచూ తమ (శరీర) యోగక్షేమములను పట్టించుకొనని పరిశోధకులు ప్రజ్ఞను పొందిన జ్ఞానులే అగుదురు సుమా!

**14. యుక్తిగ నాలోచనలకు**

**శక్తినిఁ జేకూర్చి కనుము సమకూడఁ బనుల్**

**ముక్తిపథముఁ గొన భవమున**

**రక్తి తొలఁగి మనము వీడు భ్రమల సుధామా!**

***Plan + Action = Work Neatly Done***; పనుల్ సమకూడన్ = కార్యములు సిద్ధించుటకై; యుక్తిగన్ = చక్కగా ఒప్పునట్లుగా; ఆలోచనలకున్ = తలపులకు; శక్తినిన్ + చేకూర్చి = తగిన శక్తిని అందించి; భవమునన్ = ఈ మాయా ప్రపంచములో; ముక్తిపథమున్ + కొనన్ = మోక్షమార్గమును అనుసరించగా; రక్తి తొలగి = అనురాగము, అనురక్తి, ఇష్టత తొలగి; మనము = మనస్సు; భ్రమలన్ = త్రిప్పటలను కలిగించు భ్రమలను; వీడున్ = వదిలి వేయును

ఓ సుధామా! వేసికొనిన ప్రణాళికలకు శక్తిని చేకూర్చగా పనులు ఒబ్బిడిగా సమకూడినట్లే, వస్తువులపై, వ్యక్తులపై అనురాగము, అనురక్తి వంటి మాయాభ్రమలు తొలగి పోవలెనన్న, సుగమ్యమైన ముక్తి మార్గమును అనుసరించ వలసినదే సుమా!

**15. తిట్టిన వట్టిగ గట్టిగఁ**
**గట్టకు మెట్టెటనొ జట్టు; కట్టెదురుగ ను**
**న్నట్టి పరమాత్మ గుట్టును**
**పట్టిన నీకెట్టి రట్టుపట్టు? సుధామా!**

వట్టిగన్ = ఏ అపరాధమూ లేకుండగనే; గట్టిగన్ = దృఢముగా, బిగ్గరగా; తిట్టినన్ =ఎవరైనా తిట్టినప్పటికీ, నిందలు మోపినప్పటికీ, అపరాధములను నెత్తిన రుద్దినప్పటికీ; ఎట్టు + ఎటనొ =ఎక్కడో (ఎవరితోనో), ఏ విధముగానో; జట్టున్ కట్టకుము = సంఘటితము కాబోకు; కడు + ఎదురుగన్ = (కట్టెదురుగన్) అందుబాటులోనే, అతి సమీపంలోనే; పరమాత్మ గుట్టును = గుహ్యమైన పరమాత్మను; పట్టిన నీకున్ = పట్టుకొనిన నీకు; ఎట్టి రట్టు పట్టున్ = నిందలు ఏ విధముగా బాధింప గలవు? [బాధింప జాలవని భావం.]

ఓ సుధామా! ఈ మాయా ప్రపంచములో నీవు నీ ముక్తి మార్గములో సాధన చేయుచూ కాలము గడుపుచున్నప్పటికీ, నీపై అపరాధములూ, నిందలూ మోపి నిన్ను తిట్టుచూ బాధింప దలచు మాయామోహులు ఉండవచ్చు గాక! అట్టి నిందలను, అపవాదములను పట్టించు కొనవద్దు సుమా! అతిసమీపములోనే (అనగా, పిలుపుకు అందునంత దూరములోనే) ఉండి నీకు ఆసరాను ఇచ్చు పరమాత్మ తత్త్వము ఉండగా వేరే ఎవరి అండనూ, ఆశ్రయమునూ కోర పనిలేదు. అట్టి పరమాత్మను ఆశ్రయించి గొప్ప ఉన్నత స్థానమును పొందిన నిన్ను ఈ నిందలు ఏమియునూ చేయ జాలవు.

***Whenever anyone has offended me, I try to raise my soul so high that the offense cannot reach it ~~ French philosopher:::René Descartes***

## 16. పీడలు సమస్యలనునవి

తాడించును, దఱుము, నుండఁ దావులు నెమకున్

గూడుఁ బులుగులటు మనమున;

వీడి చెడకు సాధనను వివేకి! సుధామా!

వివేకి! సుధామా! = వివేకముతో గొప్పవాడవైన మహనీయుడా!; పీడలు, సమస్యలు అనునవి = ఈతిబాధలు; తాడించును = కాలితో తన్నును; తఱుమున్ = నిన్ను పరుగులు పెట్టించును; ఉండన్ = నివసించుట కొరకై; తావుల్ నెమకున్ = స్థలమును (గూడు) వెదకికొనును; పులుగులు + అటు = పక్షుల వలె; మనమునన్ = మనస్సు నందు; కూడున్ = గుమిగూడును; సాధనను వీడి చెడకు = కనుక, జ్ఞాన సాధనను (మనస్సులో కట్టుకొనిన ఈ ఆలోచనల వలన) విడిచి పెట్టి అజ్ఞానివి కావద్దు

ఓ సుధామా! గూడును కట్టుటకు ఒకచోట చేరిన పక్షులు శబ్దములతో, తరచుగా కొమ్మలపైకి ఎగురుచూ, క్రిందకు పోవుచూ ఆ గూటికి తగిన సామగ్రిని సమకూర్చు కొనుటకు ఏవిధముగా తంటాలు, కష్టములు పడుచు నుండునో, అదే విధముగా మానవుల మనస్సు ఎల్లప్పుడూ బాధల ననుభవించుచు బాహ్యముఖముగా ప్రసరించుచు నుండును. అటుల స్థిరముగ నుండనీక పరుగులు పెట్టించు ఈతిబాధలకు లోబడి జ్ఞాన సాధనను విడిచి పెట్టి అజ్ఞానివి కాబోకుము.

17. వెల్లివిరియు సచ్ఛీలత
నుల్లసిలుచు స్వాంత మలరి యుత్సహన మిడన్
గల్ల మనంబును వీడఁగఁ
బెల్లుగఁ బ్రేరణ మొసఁగఁగఁ బేర్చు సుధామా! ***

***గాయత్రి మంత్రార్థమే ఇట విశదీకరింప బడినది

వెల్లివిరియు = వికసించు; సత్ + శీలతన్ = నిజాయితీగల నడవడికతో; స్వాంతము = హృదయాంత రంగము; ఉల్లసిలుచున్ అలరి = ప్రహ్లాదమును పొంది; ఉత్సహనము+ఇడన్ = మిక్కిలి ఓరిమిని ప్రదర్శించునట్లుగా; కల్ల వీడగన్ = అసత్తు (మాయ) మనస్సునుండి వీడిపోవు నట్లుగా; పెల్లుగన్ ప్రేరణము + ఒసగగన్ = అధికముగా, అతిశయముగా ఉత్తేజము/ ప్రేరణ కలుగజేయు నట్లుగా; మనంబును పేర్చు = మనస్సుకు ఒబ్బిడిని కూర్చుము

ఓ సుధామా! నిజాయితీగల నడవడికతో నా హృదయాంతరంగము సదా సంతసిల్లుచూ మిక్కిలి ఓర్మిని (ఓపికను, సహనమును) ప్రదర్శించునట్లుగా, అసత్యమైన మాయా దృక్పథము వీడునట్లుగా, పరమాత్మానుభవమైన చిదానందము నాకు కలుగు నట్లుగా ప్రేరేపించుము.

18. నిండిన యానందంబును

దుండగముల దోఁచలేరు దొడఁగుచుఁ జోరుల్

మెండుగ ననుభూతు లటులె

గుండెల నింపఁగ మనుజులఁ గూర్పు సుధామా!

నిండిన + ఆనందంబునుస్ = చక్కని సంతృప్తితో మనస్సులో కలిగిన ఆనందానుభవమును; చోరుల్ = దొంగలు; దుండగములస్ తొడగుచుస్ = దోపిడీల వంటి దుష్టకార్యములు చేయుచూ; దోచస్ లేరు = దోచుకు పోలేరు కదా! అటులె = ఆవిధమైన; అనుభూతులస్ = ఆత్మానందానుభవములను; మెండుగస్ = మిక్కిలిగా, ఎక్కువగా; గుండెలస్ నింపగస్ = తమ హృదయాలలో నింపుకొను నట్లుగా; మనుజులస్ = మానవులను; కూర్పు ('ము' వర్ణమునకు లోపము వికల్పము) = అనుసంధింపుము, సంసృష్టి చేయుము.

ఓ సుధామా! చక్కని సంతృప్తితో మనస్సులో కలిగిన ఆనందానుభవమును దోపిడీల వంటి దుష్టకార్యముల చేయు దొంగలు తస్కరింప జాలరు కదా! అట్టి వేరుపరప జాలని ఆత్మానందానుభవములను విరివిగా మానవులు తమ హృదయాలలో నింపుకొను నట్లుగా సంసృష్టి చేయుము!

19. తక్కెడ సమగతిఁ గొనకే

నిక్కుచు నీల్గెదరు నరులు నియమము లెడలన్!

జిక్కకు మాయావృతికిల

ఱెక్కలు ముక్కలగును గను, లెమ్ము సుధామా!

నియమములు + ఎడలన్= కట్టుబాటులు చెడిపోగా; తక్కెడ సమగతిన్ + కొనకే = సమముగా సరితూగు తక్కెడ సిబ్బెల నడవడిని పొందకయే; నిక్కుచున్ నీల్గెదరు = గర్వముతో విఱ్ఱవీగెదరు; మాయావృతికిన్ + ఇలన్ చిక్కకు = అట్టి ప్రాపంచిక మాయాజాలమునకు చిక్కు పడిపోవలదు; రెక్కలు ముక్కలు + అగును = నీకు రక్షణగా నిలుచు నీ భుజములు ఖండింప బడగలవు (అనగా, గొప్ప కష్టమును అనుభవింప వలసి వచ్చును); కను ('ము' వర్ణమునకు లోపము వికల్పము), లెమ్ము = చూడుము, ఉద్యమింపుము.

ఓ సుధామా! జ్ఞాన స్వరూపులైనను, మానవులు మాయా ప్రభావము వలన సదా మారుచున్న పరిస్థితులపై పట్టు సాధింపలేక, గర్వాంధులై సమస్థితిని పొందలేక సతమతమగుచుందురు. మారుచున్న దేశ, ప్రాంత, కాల పరిస్థితుల ననుసరించి తమను తాము మార్చుకొనెడి యవసరము మాయా ప్రభావమే సుమా! అట్టి మాయా జాలమునకు చిక్కువడిన మానవులు గొప్ప కష్టములను అనుభవింతురు, కనుక ఈ అసత్య మాయాంధతలను వీడి పరమాత్మాశ్వాసమును పొందుటకు ఉద్యమింపుము.

20. కూడుచుఁ గష్టములన్నియు

నీడగ వెంటాడి మదిని నెంజిలి పఱుపన్

ఏడువక సాధనఁ గొనుచు

నోడించును బరమతత్త్వ యోగి సుధామా!

పరమ తత్త్వ యోగి = జ్ఞాని, పండితుడు; కష్టములు + అన్నియున్ = సకల దుఃఖములు, సమస్త బాధలు; కూడుచున్ = ఒకచోట చేరుచూ; నీడగన్ = నీడవలే; వెంటాడి = వెంబడించుచు; మదిని = మనస్సును; నెంజిలి పరుపన్ = వ్యథ కలిగించగా; ఏడువక = దుఃఖించుచూ (కూర్చొని) ఉండిపోక; సాధనన్ కొనుచున్ = జ్ఞాన సాధన ద్వారా; ఓడించును = ఆ ముసిరిన బాధలను ఓడించును (అనగా, వాని తీవ్రతను తగ్గించు కొనును).

ఓ సుధామా! కష్టములు, బాధలు కలుగును లేక కలిగినవి అను తలపులు మానవులను స్థిరముగా నుండనీయక మనోవ్యథకు గురి చేయును. అది మనస్సునకు తోచిన అసత్యమే కానీ నిజము కాదు. దీనిని గ్రహించి, క్రుంగిపోక యోగులు జ్ఞాన సాధన పద్ధతి ద్వారా మాయను ఓడించి పరమానందాన్ని పొందెదరు సుమా!

21. 'మృతినొందిన జీవుఁడుఁ గడు

వెతలొందు నరకమున'నను విశ్వాసముతోన్

మతిచెడు చింతలఁ జేయక

బ్రతుకఁగ - నే కొదువలు గనరావు సుధామా!

మృతిన్ + ఒందిన = మరణించిన (అనంతరము); జీవుడు = జీవాత్మ; నరకమునన్ = నరకమునందు; కడున్ + వెతలు + ఒందున్ = మిక్కిలి కష్టములను పొందును; అను విశ్వాసముతోన్ = అని నమ్ముచూ; మతిచెడు = మతిభ్రమణము కలిగించు; చింతలన్ + చేయక = (అసంగతములయిన, పొసఁగని, కూడని, సంబంధము లేని) ఆలోచనలను తలపులలో గణింపక; బ్రతుకగన్ = జీవనము సాగించగా; ఏ కొదువలు = ఎట్టి విధమైన లోటు పాటులు; కనరావు = ఉండవు

ఓ సుధామా! ఇది పాపము. ఇట్లు చేయు వానికి నరక ప్రాప్తి కలుగును. ఈ పనులు చేయు వారిని నరకమున మరుగుచున్న నూనెలో వేయించెదరు, ఇట్లు చేయుట పుణ్యము, ఈ పనులు చేయువారు స్వర్గమున సుఖింతురు అను సంఘమున వ్యాప్తిచెందిన మాయకు చిక్కుకొనిపోయి, మతిభ్రమణమును కలిగించు ఆలోచనలు చేయుటకంటె, సంపూర్ణమైన, శాశ్వతమైన పరమాత్మ తత్త్వమునందు చిత్తమును నిలిపి ఎట్టి లోటుపాటులు లేని జీవితమును సాగించుట ఎంతయో సుఖదాయకము సుమా!

22. శోధకు బోధల కందక

వేధించెడు భావవీచి బృందారకమై

మేధకుఁ దట్టునుఁ దృటిలో

సాధనఁ జేయఁగ వివేక శక్తి సుధామా!

శోధకు బోధలకుస్ + అందక = పరిశోధన చేయువాని యొక్క ఆలోచనలకు లొంగక; వేధించెడు భావవీచి = వేదనకు గురి చేయు భావజాలము; సాధనస్ + చేయగస్ = జ్ఞాన సాధన చేయగా ; వివేక శక్తిస్ = వివేకమనబడు శక్తి / విచక్షణ జ్ఞానము చేత; తృటిలో బృందారకము + ఐ= క్షణములో మనోజ్ఞమైన విధముగా; మేధకుస్ + తట్టును= మానవుని మేధస్సుకు తోచును.

ఓ సుధామా! పరిశోధన చేయువాని యొక్క ఆలోచనలకు అంతుచిక్కక వేదనకు గురిచేయు భావజాలము, వివేకమనబడు శక్తితో / విచక్షణ జ్ఞానముతో జ్ఞాన సాధన చేయగా, క్షణములో మనోజ్ఞమైన విధముగా మానవుని మేధస్సుకు తోచును. అనగా, సంకటము, దుస్థితి, ఆపద మనస్సుకు తోచినంతనే, జ్ఞాన సాధన పద్ధతి ద్వారా వివేక వంతులమై ఆ ఆపదల నుండి బయటపడ గలమని భావము!

23. బుద్ధికి శక్తినొసఁగి - యు

దుబ్ధ్బుద్ధంబగురీతి నాత్మ తోఁపింపంగన్

శ్రద్ధగ సాధనఁ జేసి ప్ర

వృద్ధిఁగొనుట సిద్ధి వడయు విధము సుధామా!

బుద్ధికిన్ శక్తినిన్ + ఒసగి = మేధకు తగినంత బలాన్ని చేకూర్చి; ఉద్బుద్ధంబు + ఆగు రీతిన్ = వికసించునట్లుగా; ఆత్మ = పరమాత్మ తత్త్వము; తోపింపంగన్ = తన తత్త్వమును కనబఱచగా; శ్రద్ధగన్ సాధనన్ చేసి = ఆసక్తితో, మనోనైర్మల్యముతో కలిగెడి అనుభవముపై ధ్యానము చేసి; ప్రవృద్ధిన్ + కొనుట = గొప్ప అభివృద్ధిని పొందుట; సిద్ధిన్ పడయు విధము = జ్ఞాన సిద్ధిని పొందు పద్ధతి

ఓ సుధామా! మేధ వికసించునట్లుగా తగినంత బలాన్ని చేకూర్చి పరమాత్మ తత్త్వము తనను తాను కనబఱచగా - ఆసక్తితో, మనోనైర్మల్యముతో కలిగెడి అనుభవముపై ధ్యానము చేసి గొప్ప అభివృద్ధిని పొందుటయే జ్ఞాన సిద్ధిని పొందు పద్ధతి సుమా!

*'మెడిటేషన్' (ధ్యానము) అనగా నేమి*? అని ప్రశ్నించగా, పలువురు -- 'నామ జపము' అనియు, 'ఉచ్ఛ్వాస, నిశ్వాసలపై పట్టు సాధించుట' అనియు, 'హఠ యోగ పద్ధతులచే, లేక సూర్య నమస్కారములచే తనువుపై పట్టు సాధించుట' అనియు లేక 'వ్రత విధానములచే, ఉపవాసాదులచే, తపము చేయుట' అనియు, ఇంకను ఎవరికి తోచిన విధముగా వారు సమాధాన మిత్తురు! అగుగాక.

*'జ్ఞాన ధ్యాన' మనగా మాత్రము* -- "తమ తలపులలో కలుగు అనుభవములను గుర్తించి, వానిని సంపూర్ణముగా అనుభవించుచు, ఆ అనుభవము లెవరికి కలుగుచున్నవి అని ప్రశ్నించుకొని, వచ్చు సమాధానము నకు 'కర్త, భర్త' ఎవ్వరో ఆ పరమాత్మ తత్త్వమున నిమగ్న మగుటయే" -- అనగా, "*ఏనెవ్వడనను తత్త్వ, జ్ఞానోద్ధతితోడఁ జీల్చి ఘాతకి మాయన్, తానెవ్వడొ తెలిసి కొనును, మానసమానందమొంద మానిసి దీక్షన్*".

24. క్షణమున నగపడి పరమం
    బణఁగించును దాపమెల్ల; నాపక శ్రద్ధన్
    తొణఁకు బెణఁకులకుఁ గలఁగక
    గణుతింపక నెపము లాత్మఁగనుము సుధామా!

తొణకు బెణకులకున్ = అవరోధములకు (మనశ్చాంచల్యములకు); కలగక = కలత చెందక; నెపములన్ = మిషలు, సాకులు, వంకలు వంటి వానిని; గణుతింపక = అన్వేషింపక, వెదుకక; శ్రద్ధన్ = శ్రద్ధతో; ఆపక = తలపెట్టిన కార్యమును నడుమలోనే ఆపివేయక; ఆత్మన్ కనుము = పరమాత్మ తత్త్వమును కనుగొను ప్రయత్నము చేయుము; క్షణమునన్ అగపడి = ఆవిధముగా చేయగా క్షణములో గోచరించి (మనస్సునకు తోచి); పరమంబు = పరతత్త్వము; తాపంబున్ = మానవులు (ఆధి భౌతికము, ఆధి ఆత్మికము, ఆధి దైవతము) అను మూడు తాపములను (తాపత్రయమును); అణగించును = నశింప చేయును

ఓ సుధామా! సాధన యొక్క పర్యవసానము ఆత్మ సందర్శనమే! మరి ఆ సందర్శనము ఎప్పటికి జరుగుగలదో ఎవరు చెప్పగలరు? సాధన ద్వారా మనకు కలిగిన అనుభూతులే దానికి నిదర్శనము. కానీ, మరొక్క క్షణములో ఆ అనుభూతి కలుగ బోవుచున్నదనగా, సాధనను నిలిపి వేసి మాయాప్రపంచములో పడినచో, ఏ అనుభవమూ కలుగదు సరికదా, మాయను వదిలించుకొనుటకై మరల మరల అధికమైన శ్రమతో కూడిన విశ్వ ప్రయత్నములను చేయవలసి రావచ్చును!

కనుక, ఓ సాధకుడా! తొణకెడు (ఊగిసలాడు) మనస్సుతో ఏవేవో నెప్పులు, బాధలు, కష్టాలు అను సాకులను, ఎవరివల్లనో లేక నీవల్లనే జరిగినట్లు కనిపించు తప్పులు, నెపములు, అపరాధముల వంటివానిని పట్టించు కొనకు. ఆత్మ సాక్షాత్కారము త్వరలోనే జరుగ బోవుచున్నది. సాధనను ఆపక ముందుకు సాగుము. ఆత్మ సాక్షాత్కారానుభవము నీ తాపములన్నింటినీ దూరము చేయును సుమా!

25. నడుమనె నిలుపుచు సాధనఁ

బడెదరు మాయావృతులిలఁ బతనపు బాటన్

దొడఁగక లజ్జను గోల్పడి

బెడిదము లాడెదరు - జ్ఞానవేద్య సుధామా!

జ్ఞానవేద్య సుధామా = జ్ఞానముచేత తెలియబడు ఓ పరమాత్మా; మాయావృతులు ఇలన్ = (పిరికివారై) మాయలో పడినవారైన మానవులు; సాధనన్ నడుమనె నిలుపుచున్ = జ్ఞానమార్గ సాధనను మధ్యలోనే నిలిపి; పతనపు బాటన్ పడెదరు = పతనావస్థను, దీనావస్థను పొందెదరు; తొడగక = అసలు ప్రయత్నమే చేయక; లజ్జను కోల్పడి = సిగ్గు, బిడియము, అభిమానము అనునవి వదలి; బెడిదములు + ఆడెదరు = పరుష వచనములు పలికెదరు (సాధకులపై నిందారోపణలు చేయుదురు).

జ్ఞానముచేత తెలియబడు ఓ మహనీయ పరమాత్మ తత్త్వమా! ఓ సుధామా! భీరువులై, పిరికివారై, మాయలో పడినవారైన మానవులు జ్ఞానసాధనను మధ్యలోనే నిలిపి దీనావస్థను పొందెదరు. అట్టివారు మరల ప్రయత్నమే చేయక - సిగ్గు, బిడియము, అభిమానము అనునవి వదలి పరుష వచనములు పలుకుచు, నిందారోపణలు చేయుదురు సుమా!

జ్ఞాన సాధకులు మాటలాడక, మౌన వ్రతమును పాటించు చుందురు. అనగా, జ్ఞాన సాధన చేయుచుంటిని అని చెప్పువారిని కానీ, చాలకాలము జ్ఞానసాధన చేసితిమి అని చెప్పువారిని కానీ నమ్మి చెడకు. జ్ఞాన సాధనలో లేని ఏ వ్యక్తి అయిననూ నీ సాధనకు భంగము కలిగింప వచ్చు, జాగ్రత సుమా!

26. వలసిన మార్గముఁ గొని యతి
యలందురక పొంద జ్ఞాన మవిరళ కృషిచేస్
సులువుగ లభ్యంబగునని
తలఁతురు మూర్ఖులు వివరము దప్పి సుధామా!

యతి = జ్ఞానియైన వాడు; వలసిన మార్గమున్ + కొని = యుక్తమైన (జ్ఞాన/ముక్తి) మార్గమును అనుసరించి; అవిరళ కృషిచేస్ = దట్టమైన, దిటవైన, సాంద్రమైన ప్రయత్నముచేత (సాధన చేత); అలందురక = కలతనొందక (దుఃఖింపక); జ్ఞానము పొందస్ = జ్ఞానాన్ని పొందగా; మూర్ఖులు వివరమున్ తప్పి = తప్పైన వివరణలచేత అవివేకులు; సులువుగన్ లభ్యంబు + అగున్ + అని = అప్రయత్నముగా ప్రాప్తించునని; తలతురు = భావింతురు

ఓ సుధామా! యుక్తమైన (జ్ఞాన/ముక్తి) మార్గమును అనుసరించి గొప్ప సాధన చేసి దుఃఖాన్ని తొలగించుకొని మహనీయులు జ్ఞానాన్ని పొందగా, సులభ గ్రాహ్యమే 'ఈ ముక్తి మార్గము', ప్రస్తుతమున ఈ భోగభాగ్యములను, సిరిసంపదలను అనుభవించి తదుపరి జీవితమున అలవరచుకొనెదము' అని తలచు మాయామోహులు కూడ ఈ జగత్తున ఉందురు సుమా!

ఇదే విషయమును "మాయాతత్త్వ వివేచనము"న కవి ఈ విధముగా తెలిపెను:: *గారడీ – కట్టినఁ, ద్రాటిని, పాఱాడఁగఁ జూచి తలలు పంకించు జనుల్, మీఱిన కఠోర శ్రమపై, సారింపరు వారి దృష్టి సమ్మోహితులై!*

27. నిస్సారపు సంసృతిఁబడి

యుస్సురనుచు నరుఁడు బాధలోర్వకయే; యం

తస్సత్త్వం బడుగంటఁగ

దుస్సంగతి బాట పట్టఁ దొడఁగు సుధామా!

నిః + సారము + సంసృతిన్ + పడి = నిరర్థకమైన ఈ మాయా సంసారమున చిక్కుకొని; ఉస్సురు + అనుచున్ = అధికముగా తాపమును పొందినవారై; (ఉస్సురు అనునది ధ్వన్యనుకరణ); బాధలు + ఓర్వకయే = దుఃఖమును తట్టుకొన లేక పోవుచూ ; అంతః + సత్త్వంబు = ఆత్మబలము, లోనిశక్తి; అడుగు + అంటగన్ (శబ్దపల్లవము) = ఇంకిపోగా; దుః+సంగతి బాటన్ = చెడు సావాసముల మార్గమును; పట్టన్ + తొడగున్ = పట్టుకొన జొచ్చును

ఓ సుధామా! నిరర్థకమైన ఈ మాయా సంసారమున అధికముగా బాధలను పొందినవారై, ఆ తాపములకు తట్టుకొన జాలక నిట్టూర్పులు విడుచుచూ జీవనము సాగించు వారు క్రమముగా ఆత్మ బలము క్షీణించుటచే, దురలవాట్లకు బానిసలై, దుష్ట సాంగత్యముతో సమసి పోతారు తప్ప, సత్యమును గ్రహింప లేక పోవుచున్నారకటా!

28. అక్షర పరాత్మఁ గొనకే

లక్షించుచు లక్ష్మి మడియు [1]భ్రాంతిని మనుజుం;

డక్షయ నిక్షేపంబు ల

ధోక్షజమును గనఁబఱప వతులిత సుధామా!

[1] లక్షించు లోని 'ల' కు, 'భ్రాంతి' లో ని 'ర' కారమునకు యతి మైత్రి

అక్షర పరాత్మన్ = నాశనము లేని పరమాత్మ తత్త్వమును; కొనకే = పొందక పోవుచూ; లక్ష్మిన్ లక్షించుచున్ = ధనములను (సంపాదించుటయే) లక్ష్యముగా ఉంచుకొనుచూ; మనుజుండు భ్రాంతినిన్ మడియున్ = నరుడు భ్రాంతిలో పడి నశించును; అక్షయ నిక్షేపంబులు= తరుగని నిధులు (అయినప్పటికీ); అధోక్షజమును = *(అధరమ్ ఇంద్రియ జ్ఞానం అస్య అధోక్షజం)* -- దేనిని తెలిసికొనుటకు ఇంద్రియములు అసమర్థమగునో; అనగా, ఇంద్రియములచే తెలియ బడనట్టి పరమాత్మ తత్త్వమును; కనన్ + పరుపవు = కనిపింప చేయ జాలవు; అతులిత సుధామా = సరిపోల్చబడని ధామమును గొనినవాడా!

ఓ సుధామా! ఇంద్రియముల ద్వారా ఆకళింపునకు రాని పరమాత్మ యొక్క తత్త్వమును, ఎంత తరగని నిధులను, ధనములను కూడబెట్టిననూ గ్రహింపలేము కదా! అనగా, పరమాత్మ తత్త్వమును గ్రహించుటయే మానవుల లక్ష్యము కావలెను కానీ, ధన సంపాదన కారాదు. భ్రాంతులైన మానవులీ విషయమును తెలిసికొన జాలకున్నా రకటా!

29. వింతను గను నుత్సాహం
బెంత నిలుచుఁ దిరిగి రాఁగ? హృత్సంస్థితమౌ
నంతర్యామినిఁ గనుగొను
సంతోషి పడునె ప్రయాస? జ్ఞాన సుధామా!

వింతనుస్ + కను = వింతలు విశేషాలను చూచు; ఉత్సాహంబు = ఆసక్తి, ఇష్టత; తిరిగి రాగస్ = ఆ యా వింతలను చూచి స్వస్థానమునకు తిరిగి చేరుకొనగా; ఎంత నిలుచుస్ = ఎంతకాలము నిలిచి యుండును? హృత్ + సంస్థితము + ఔ = హృదయమునందు నివసించు; అంతర్యామినిస్ = ఇంద్రియములను తమతమ పనులయందు నియమించు నియంత యయిన పరమాత్మ తత్త్వమును; కనుగొను సంతోషి = కనుగొనిన సంతృప్తుడు; ప్రయాసస్ పడునె = శ్రమము, కష్టము పడునా?

జ్ఞానమనెడు గొప్ప ధామమును పొందిన వాడా -- ఓ జ్ఞానీ! ఓ సుధామా! ప్రాపంచికమైన వింతలను చూచుటకు వ్యయప్రయాసలకోర్చి యాత్రలు చేసినప్పటికీ, ఆ యాత్రలను ముగించుకొని ఆ యా వ్యక్తులు తమతమ నెలవులకు తిరిగి రావలసినదే కదా! అనగా, ఆ వింతలను చూచిన ఆనందము అతి స్వల్పకాలముపాటు గుర్తుగానుండు ఒక అశాశ్వత స్మృతిచిహ్నము మాత్రమే! కానీ, హృదయములోనే ఉన్నట్టి పరమాత్మ దర్శనము ఎట్టి వ్యయప్రయాసలూ లేకుండగనే శాశ్వతమైన ఆనందానుభూతిని కలిగించును సుమా!

30. వయసునఁ బెద్దని తలఁచుచుఁ

బయనింపకు కుమతి దెసకుఁ - బడెదవు మాయన్

భయమెంచక స్వీయాత్మను

లయమొనరుపుము రయమునఁ బరమున సుధామా!

వయసునన్ + పెద్ద + అని తలచుచున్ = వయస్సులో పెద్దవాడు అని భావించి; కుమతి దెసకున్ పయనింపకు = దుర్మార్గుని దిశగా ప్రయాణము చేయవలదు; మాయన్ పడెదవు = మాయా భ్రాంతి యందు పడిపోయెదవు; భయము + ఎంచక = భయమును పొందక; రయమునన్ = వేగముగా; స్వీయ + ఆత్మను = అంతరాత్మను, మనస్సును; పరమునన్ = పరమాత్మ యందు; లయము + ఒనరుపుము = లయము చేయుము;

ఓ సుధామా! వయస్సులో పెద్ద, అనుభవజ్ఞుడు అని సద్గురువు కాని ఒకానొక మానవుని సమీపించి సందేహ నివారణ చేసికొనదలచినచో, ఆ వ్యక్తి తన మాయా భ్రాంతపు వాసనలను అంటించును తప్ప, మనకు ఏ విధముగనూ ఉపయోగ పడడు! ఎట్టి అపోహలకూ, భయభ్రాంతులకూ లోనుకాకుండా కేవలమూ హృదయస్థ పరమాత్మతో ఎంతవేగముగా కుదిరితే అంత వేగముగా లయము చెందినచో మాయపట్టునుండి బయటపడ గలము సుమా!

31. అడుగకు మెవ్వని నెప్పుడు
నడుగడుగునఁ గలఁచు సంశయంబులు దీర్పన్
అడిగిన నిశ్చయ మగునని
పడఁబోకుము మాయ కొలుపు భ్రాంతి సుధామా!

అడుగు + అడుగునన్ కలచు = మనము వేయు ప్రతి అడుగునందునూ మన మనస్సులో చేరి కలత పరచు; సంశయములు + తీర్పన్ = సందేహములను తీర్చుమని; ఎవ్వనిన్ + ఎప్పుడు + అడుగకుము = ఎవ్వరినీ ఎప్పటికీ ప్రశ్నింపకుము; అడిగినన్ నిశ్చయము + అగున్ + అని = ప్రశ్నించినచో సంశయములు తీరునని; మాయ కొలుపు భ్రాంతిన్ పడబోకుము = మాయ వలన కలుగు భ్రాంతి యందు పడవలదు.

ఓ సుధామా! మాయా సంసారములో ఏవో ఆలోచనలు, ఏవేవో సంఘర్షణలు మానవుల మనస్సులలో కలుగుచునుండును. అట్టి సందర్భములలో, (ఇతరులకు సమాధానములు తెలియునని భ్రమించి) తమకెదుటబడు వానినుండి సందేహ నివృత్తిని జరుప దలచెదరీ మానవులు. కానీ, ఆ వ్యక్తికిని సమాధానము తెలియక పోయినచో, తెలియదని చెప్పుట అవమానముగనో, చిన్నతనముగనో భావించి ఏవేవో కట్టుకథలు కల్పించి చెప్పినచో, అడిగిన వాని గతేమి?

**దీనినే శ్రీ శంకరులు -- "శబ్దజాలం మహారణ్యం - చిత్తభ్రమణ కారణం" [శబ్దజాలము, అరణ్యమువలే దురవగాహము (అవగాహన చేసికొనుటకు శక్యము కానిది), చిత్త భ్రమణమును కలిగించును] అనియు, "వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్ర వ్యాఖ్యాన కౌశలమ్ - వైదుష్యం విదుషాం తద్వద్ భుక్తయే న తు ముక్తయే" [వాగుడుకాయ తనము, శబ్ద పరిచయము, శాస్త్రములను తమకు తోచినట్లు వ్యాఖ్యానించెడి నేర్పు, పాండిత్యము ఇత్యాదులు జీవించుటకు భుక్తిని సమకూర్చ గలుగును, కానీ, ముక్తికి దోహదము చేయవు] అనియు వివేక చూడామణి యందు తెలిపిరి.

## 32. పిల్లల పెంపకపుఁ గిటుకు

లెల్లఁ దెలుపుఁ దల్లి; చాల రిల [1]నిస్సంతుల్;

తెల్లము సేయునె తత్త్వము

నుల్లమునఁ బరాత్మఁ గనని యొజ్జ సుధామా!

పిల్లల పెంపకము + కిటుకులు + ఎల్లన్ = పిల్లలను పెంచుటలోని సులువు బరువులన్నింటినీ; తల్లి తెలుపున్ = తాను తల్లి అయిన స్త్రీ తెలియ చేయ గలుగును; నిస్సంతుల్ + చాలరు + ఇలన్ = ఈ ప్రపంచములోని గొడ్రాలైన స్త్రీలు (స్వానుభవము లేని కారణమున) ఆ కిటుకులను తెలియ చేయ జాలరు; ఉల్లమునన్ = మనస్సునందు; పరాత్మన్ + కనని + ఒజ్జ = పరమాత్మను చూడని గురుడు [ఉపాధ్యాయుడు (ప్రకృతి) - ఒజ్జ (వికృతి)]; తత్త్వమున్ = పరమాత్మ తత్త్వమును; తెల్లము సేయునె (శబ్దపల్లవము)= స్పష్టము చేయ గలుగునా?

[1]నిస్సంతు = నిస్సంతు = నిః + సంతు = సంతానము లేని స్త్రీ (గొడ్రాలు); [ఈ పదమున సంస్కృత పదము "నిః" కు తెలుగు పదము "సంతు" నకు సంధి కూర్చబడుటచే, ఇది "వైరి సమాసము" అగును -- కావున కావ్యములలో అంగీకరింప బడదు!] అయిననూ, "రూఢిః యోగాత్ బలీయసీ" = సామాసికముగా సంస్కృత పదమునకు తెలుగు పదమునకు సంధి, సమాసము కుదరక పోయిననూ రూఢ (ప్రసిద్ధి గాంచిన) పదము కావున ఒప్పిదమే.

ఓ సుధామా! పిల్లల పెంపకములోని మర్మములను (కిటుకులను) పిల్లలను కన్నతల్లి చెప్పగా ఏవిధముగా ఆకళింపు చేసికొనగలమో, అదే విధముగా పరమాత్మా నుభవము యొక్క గుట్టుమట్టులను తెలిసి కొనగలుగుటకు, ఆ అనుభవాన్ని చవిచూచిన వాని నుండి అయినచో సత్వరము గ్రహింపగలము కాని, అట్టి అనుభవము కలుగని వాని నుండి గ్రహింపజాలము కదా! (అనగా, గొడ్రాలు పిల్లల పెంపకములోని ఆనుపానులను తెలియజేయ అసమర్థురాలు అయినట్లుగా, పరమాత్మను దర్శింపని గురుడు ఇతరులకు పరమానందానుభవమును పొందు మార్గమును చూపలేడని భావము!)

33. "ఎవ్వఁడొ యేభాషనొ యిటు
లెవ్వగ నివ్విధి రచించె, నెవ్వఁడు వ్యాఖ్యన్
ఎవ్వివర మిచ్చె" ననుచును
నొవ్వక తెలిసికొని మదికి నుడువు సుధామా!

ఎవ్వడొ ఏ భాషనొ ఇటుల = ఎవరో, ఏభాషలోనో ఈ విధముగా; ఏ+ వగన్ = ఏ బాధవలననో; ఈ + విధిన్ = ఈ విధి విధానమును; రచించెన్ = వ్రాయుట జరిగినదొ? ఎవ్వడు వ్యాఖ్యన్ = ఆ మూలమునకు ఎవరు వ్యాఖ్యానమును; ఏ + వివరము = ఏవిధమైన భావజాలము ననుసరించి వివరించెనో? నొవ్వక తెలిసికొని = సంకోచింపక విచారణ చేసి; మదికిన్ నుడువుము = మనస్సుకు పట్టించుకొనుము

ఓ సుధామా! వేదాల్లోనో, లేక ఉపనిషత్తులలోనో లేక భవద్గీతాదులలోనో మంచి విశేషాలు చెప్పబడ్డాయని ఆ మాటలను ఎవరో అనువదించగా నిజమేనని నమ్మి, అట్టి విషయములను గ్రుడ్డిగా అనుసరింపక - చదివిన దానిపై వివేకబుద్ధితో విచారణచేసి మనస్సునకు పట్టించుకొనవలెను లేనిచో, చదివిన, వినిన వ్యాఖ్యానముల వెనుక నున్నట్టి అనవసరపు వాసనలు చుట్టుకొనుట తథ్యము సుమా!

34. పరదేశపు విడిదిఁగొనఁగ

నొరవగు మనవీడు[1] వీడు టుపజీవికకై!

పరమపద పథము గొనఁ బలు

తిరుగుడులిడు చదువు విడుట తెఱఁగు[2] సుధామా!

1 తెలుగున 'వీడు' అను నామవాచకమునకు పట్టణము, శిబిరము, సమూహము, ఇల్లు అను అర్థములుండగా, వర్తమాన 'తమిళ' భాషలో 'ఇల్లు' అను అర్థమే ఎక్కువగా ప్రాచుర్యములో నున్నది.

2 వర్తమాన 'తమిళ' భాషలో 'తెఱు' (వీధి, దారి, మార్గము) అను భావమే - తెలుగున ప్రయోగింప బడు 'తెఱగు', 'తెఱవు' పదముల భావమని అర్థమగుచున్నది

పరదేశము + విడిది కొనగన్ = క్రొత్త ప్రదేశమున నివాస ముండుటకు; ఉపజీవికకున్ + ఐ = జీవనోపాధి కొఱకు; మనవీడు వీడుట = ప్రస్తుతము నివాసమున్న నగరమును విడచుట; ఒరవు + అగున్ = తప్పనిసరి యగును; పరమపద పథము గొనన్ = పరమోత్కృష్టమైన స్థానమునకు చేర్చు (జ్ఞాన/మోక్ష) మార్గమును పొందుటకు; పలు = పెక్కు; తిరుగుడులు + ఇడు = మతి భ్రమణమును కలిగించు; చదువు విడుట = పూర్వము నేర్చుకొనిన విద్యలను విడచుటకు వెనుకాడ కుండుట; తెఱగు = విధము;

ఓ సుధామా! క్రొత్త ప్రదేశములలో నివాసము ఉండవలెనను కోరినచో ప్రస్తుత ప్రదేశములోని వృత్తిని వదలి క్రొత్త ప్రదేశములో జీవనోపాధిని వెదకు కొనవలసి యుండును. అట్లే, పరమాత్మను కనుగొన వలెనన్నచో ముందుగా నేర్చుకొనిన మాయా భ్రాంతిని గొలుపు విద్యలను మరువలెను.

అనగా, ఏవిధముగా అయితే, మానవులు రెండు వేర్వేరు ప్రదేశాలలో ఒకేసారి ఉండలేరో, అదే విధముగా, మాయతత్త్వము లోనూ, జ్ఞాన తత్త్వము లోనూ ఒకేసారి ఉండజాలరు సుమా!

35. శ్రమచేసియు ఫలమొందక

విమనస్కతఁ గాంత్రు జనులు; విధులను మఱవన్

భ్రమగొల్పెడి భవభయమునఁ

బ్రమత్తు లగుచు మడియుదురు భవ్య సుధామా!

భవ్య సుధామా = మనోజ్ఞమైన మంచి స్థానమును పొందిన మహనీయుడా; శ్రమన్ + చేసియున్ = కఠిన పరిశ్రమ చేసినప్పటికీ; ఫలము + ఒందక = ఫలితమును పొందక; విమనస్కతన్ = విముఖమైన మనస్సును; జనులు కాంత్రు = మానవులు పొందెదరు; [పరధ్యానము గలవారివలెనో లేక మనోనిగ్రహము లేనివారివలెనో అగుదురు!]; విధులను మరవన్ = అసలు ప్రయత్నమే చేయక పోయినచో; భ్రమన్ + కొల్పెడి = భ్రాంతిని కలుగ జేయు; భవ భయమునన్ = మాయా సంసారములోని భయాందోళనల వలన; ప్రమత్తులు + అగుచున్ = మత్తున మునిగి తేలు వారిగా అగుచూ; మడియుదురు = నశించిపోదురు!

ఓ సుధామా! ఈ మాయాభ్రాంత ప్రపంచములో -- కష్టనష్టాలకు ఓర్చుకొని కఠిన పరిశ్రమ చేసికూడా ఫలితమును పొందలేని వారు నిరాశా, నిస్పృహలతో మనోనిగ్రహము కోల్పోవు చుందురు. అసలు ప్రయత్నించుటయే మానివేయగా, వారు తమోగుణ మావహించి నశించిపోతారు సుమా! అనగా, ఎన్నివిఘ్నములు కలిగినను భవ బంధములను తొలగించు కొనుటకు మానవులు నిరంతర శ్రమ పూనవలసినదే నని భావము!

36. పెంపొందెడు ధనములఁ గొని

యింపొదవెడు రీతి నొరుల యిక్కటు లడఁపన్

సంపద గాంచు సమృద్ధిని,

జొంపము గొను మానవవని చూడ సుధామా!

పెంపు + ఒందెడు = వృద్ధిచెందు; ధనములన్ + కొని = సంపదలను పొంది (మానవులు); ఇంపు + ఒదవెడు రీతిన్ = ప్రియమును, హితమును కలిగించు విధముగా ; ఒరుల = ఇతరుల యొక్క; ఇక్కటులు + అడపన్ = దుఃఖములను తగ్గింపగా; మానవ వని = మానవులను వనము (*రూపక అలంకారము*), మానవాళి; జొంపము గొనున్ = నిరంతరముగా పల్లవించుచూ వృద్ధిచెందును; సంపద సమృద్ధిని గాంచున్ = ధనములు తిరిగి వృద్ధిని పొందగలుగును;

ఓ సుధామా! ధనములు, ఏ కొద్ది మంది వద్దనో ప్రోగుబడుచు నుండును. కారణము, మాయా కారకమైన ధనమునకు అట్టి సహజ సిద్ధమైన లక్షణముండుటయే! అటుల నీ వద్ద ప్రోగుపడిన ధనమును - ఇతరుల బడలికనూ, నిస్త్రాణమునూ తొలగింప జేయుటకు ఉపయోగించితివా, నీ సంపదలు ఇంకను పెక్కువిధములుగా వృద్ధిని గాంచును. ఈ సమాజము కూడ, నిరంతరముగా పల్లవించుచూ అభివృద్ధిని పొందును సుమా!

అనగా, ధనవంతులు విఱ్ఱవీగక, భోగలాలసులు కాక సాటిమానవులకు మానవతాదృక్పథముతో, సేవలను, సహాయమును, సహకారమును అందించ వలసి ఉన్నదని సూచన!

*అప్రస్తుత ప్రశంసాలంకారము : "అప్రస్తుత ప్రశంసా స్యాత్ సా యత్ర ప్రస్తుతాశ్రయా" - ఒక విషయమును దృష్టిలో పెట్టుకొని వేరొక విషయమును ప్రస్తావించుట"*

"*స్వయం తీర్త్వా - పరాం స్తారయేత్*" అను న్యాయము చెప్పున జ్ఞానులు తమ జ్ఞానసంపదను యితరులకై (శిష్యులకై) వెచ్చింపవలెననునది ప్రస్తుత విషయము. దీనికై ధనవంతులు తమ సంపదలను పరులకై వినియోగింపవలెనను అప్రస్తుత విషయము చెప్పబడినది.

37. తలపెట్టిన కార్యంబును

నిలువఱచకు నడుమలోనె నీరస మతివై

తొలఁగును దత్కాలవ్యథ

కల సాకారంబునొందఁ గదురు సుధామా!

తలపెట్టిన (శబ్ద పల్లవము) = ప్రారంభించిన (ప్రస్తావించిన, శ్రీకారము  చుట్టిన, మొదలు పెట్టిన); కార్యంబునుస్ = పనిని, వ్యవహారమును; నీరస మతివి + ఐ = బలహీనమైన మనస్సు కలవాడవై;  నిలువరచకు = ఆపివేయ వద్దు; తత్కాల వ్యథ = అప్పటికప్పుడు తోచు దుఃఖము; తొలగును = (త్వరలో) సమసి పోవును; సాకారంబుస్ + ఒందస్ = ఫలించునట్లుగా,  సకలమూ కలుగునట్లుగా; కల కదురుస్  = స్వప్నము పొంగరించును (అతిశయించును).

ఓ సుధామా! ఒక కార్యమును తలపెట్టినచో దానిని మధ్యలో విడవక తుదిగాంచుట అనునది ధీర లక్షణము! అటులకాక ఏవేవో బాధలు, దుఃఖాలు మనస్సుకు తోచగా ఆ మొదలిడిన కార్యమును మధ్యలోనే ఆపివేయుట సామాన్యుల లక్షణముగ తోచును! కనుక, అట్టి దుర్బలతను తొలగించుకొని ముందుకు సాగగా, తాత్కాలికముగా కలుగు బాధలు తొలగిపోగా, సంపూర్ణమైన సంసిద్ధితో నీ కలలు సాకారమగును సుమా!

అవతారిక :   ఈ పద్యము చిచ్ఛక్తితో జ్ఞానశక్తిని పొంద వలసినదని తెలుపుచుండగా, ఈ క్రింది పద్యము క్రియా శక్తితో జ్ఞానశక్తిని పొంద వలసినదిగా తెలియ జేయుచున్నది!

38. మొదలిడు మున్నటు లిప్పుడె
 పొదలింపుము శక్తియుక్తి పూర్ణత కొఱకై
 వదలకు కష్టము తోఁచిన
 నొదవును ఫలసిద్ధి శ్రమమునోర్వ సుధామా!

ఉన్నటులస్ + ఇపుడే = ఏ విధముగా నున్నచో ఆవిధముగనే, ఈ క్షణముననే; మొదలు + ఇడుము = (పరతత్త్వమును గ్రహించుటకై) ఉంకింపుము, ప్రారంభింపుము; పూర్ణత కొఱకై = సంపూర్ణమైన సిద్ధిని పొందుటకు; శక్తియుక్తి = శక్తి యొక్క సంయోజనను (వినియోగమును); పొదలింపుము = వ్యాపింప చేయుము; కష్టము తోచినస్ = ఎంతో కష్టము అని అనిపించిననూ; వదలకు = మధ్యలో వదిలి వేయు ఆలోచనలకు స్వస్తి చెప్పుము; శ్రమమును + ఓర్వస్ = కష్టమును ఓర్చుకొనగా; ఫలసిద్ధి = చేపట్టిన కార్యము యొక్క సాఫల్యము; ఒదవుస్ = కలుగును;

ఓ సుధామా! ఆ వస్తువు సమగూడినచో అటుల చేతము, ఈ కార్యము ఒనగూడినచో ఇటుల చేయుదము అని మానవులు తలచుచుందురు. కానీ, ఏది కలిగిననూ, కలుగక పోయిననూ, ఉన్నస్థితినుండి ఉన్నట్లుగా శక్తియుక్తులతో కృషిని ప్రారంభించి - కలుగు కష్టనష్టములను ఓర్చుకొనగా, చేయదలచిన కార్యము యొక్క సంపూర్ణ సిద్ధిని పొందగలరు సుమా!

39. నమ్ముచు నిజశక్తి, నన

న్యమ్మగు సామర్థ్యమొసఁగి, నమ్రతగొని, న్యా

యమ్మగు రీతిని వ్యవహా

రమ్ము జరుపఁ జేరనగుఁ బరమ్ము సుధామా!

నిజశక్తిన్ నమ్ముచున్ = మానవులు తమ స్వశక్తిపై నమ్మకమును ఉంచుచూ; అనన్యమ్ము + అగు = తిరుగులేని, ఎదురులేని విధముగా; సామర్థ్యము + ఒసగి = గొప్ప సమర్థతను (ఆ కార్యనిర్వహణకు) అందజేసి; నమ్రతన్ + కొని = వినయ విధేయతలతో, వినమ్రమైన మనస్సుతో; న్యాయమ్ము + అగు రీతిన్ = న్యాయమార్గములో; వ్యవహారమ్మున్ = నిత్యకృత్యమును; జరుపన్ = జరుపగా; పరమ్ము = పరమాత్మ తత్త్వము; చేరన్ + అగున్ = పొందబడును (తెలియ బడును, అవగాహనకు వచ్చును, స్వానుభవమునకు వచ్చును).

ఓ సుధామా! భగవంతుడెక్కడో కలడని, పూజించి, ధూపదీపాదులతో, నైవేద్య ప్రసాదములతో ప్రసన్నునిగా చేసికొనవలెనని నమ్ముచూ నిత్యకర్మలు జరువు వారు, మరియు పరమాత్మ తత్త్వము వారి హృదయములలోనే ఉన్నదని నమ్మువారు, లేక, అసలు అట్టి అవసరమే లేదని భావించువారు కూడా స్వశక్తిని నమ్ముచూ సమర్థతతో, న్యాయ సమ్మతమైన విధముగా, విధేయతతో తాము చేయు చేష్టలు, కర్మలు, ఉద్యోగములు, వ్యాసంగములు మొదలైన నిత్యకృత్యముల వల్ల ఆత్మసాక్షాత్కారమును సులభముగా పొందెదరు సుమా!

అనగా, పరమాత్మ సాక్షాత్కారమునకు విధులు, నియమములు, సంసిద్ధతలు, ప్రయత్నములు, క్రియలు, కర్మలు అనునవి ఏమియునూ అవసరము లేదు -- కానీ కేవలమూ స్వశక్తిపై నమ్మకముతో, గొప్ప సంకల్పముతో, అణకువ, వినయము కలిగిన మనస్సుతో, ఇతరులెవ్వరినీ బాధింపని సమంజసమైన పద్ధతిలో, తగిన శక్తి యుక్తులతో, ఉన్ముఖతతో చేయు ఎట్టి నిత్యకృత్యము యొక్క సహాయమున నైననూ ఆత్మసాక్షాత్కారానుభవము కలుగ గలదు!

40. ఈషణ ధిషణ యణఁచి య
న్వేషణ జరుపఁగఁ బరాత్మ [1]ప్రేక్షితమై ని
శ్శేష మొనరింప మాయను
తోషంబున నరుఁడు వెతలు దొరఁగు సుధామా!

1 *ప్రాదియతి* - సాధారణముగా సంధి సందర్భముల యందు, ఉత్తరపద ప్రథమాక్షరమునకు యతిమైత్రి కూర్చ వలెను. కాని, 'ప్ర', 'అప' మొదలైన ఉపసర్గలతో పై పదమునకు సంధి ఏర్పడినప్పుడు అచ్చటి హల్లునకును, అచ్చునకును సంబంధించిన అక్షరములతో యతిమైత్రి చెల్లును. ఇచట, "న్వే" లోని 'వ' కారమునకు, 'ప్ర' లోని 'ప' కారమునకు యతి మైత్రి.

[ఈషణలు = కోరికలు - దారేషణ, పుత్రేషణ, విత్తేషణలను 'ఈషణత్రయము' అందురు]; ఈషణ ధిషణ + అణచి = కోరికల యందు బుద్ధిని అణచుకొని; అన్వేషణ జరుపగస్ = వెదుకగా; పరాత్మ ప్రేక్షితము + ఐ = పరతత్త్వము ప్రత్యక్షమై; మాయను = భ్రాంతిని కలిగించు మాయను; నిః + శేషము + ఒనరింపస్ = శేషము లేకుండునట్లుగా తొలగించగా; నరుడు = జీవుడు, మానవుడు; తోషంబునస్ = సంతోషముతో; వెతలు = దుఃఖములను; తొరగుస్ = విడచును;

ఓ సుధామా! ప్రయత్న పూర్వకముగా ఈషణ త్రయమును అణచుకొని మానవులు శ్రద్ధగా ముక్తి/జ్ఞాన మార్గములలో పరమాత్మను కనుగొనదలచి వెదకినచో, ప్రత్యక్ష జ్ఞానముతో పరమాత్మ తత్త్వము మాయను అంతము చేయుననియూ, అటు పిమ్మట మానవులు దుఃఖములను విడనాడి తృప్తులై సంతోషాంతరంగులు అగుదురనియూ భావము!

ఇటువంటి భావమునే ఆత్మయోగి వేమన ఈ విధముగా తెలియ చెప్పెను -- "*ఈషణత్రయంబు నెడపంగ నేరక, మోహరాశిలోన మునిఁగియుండు, మూఢ జనుల కెట్లు మోక్షంబు గల్గురా!*"

## 41. సహనంబుఁ బరీక్షించెడు

సహితునిపై విసరికొట్ట నగ్నినిఁ బట్టన్
దహియింపదె హస్తము? నా
గ్రహం బటులె తాల్పఁ గ్రోధిఁ గాల్చు సుధామా!

సహనంబున్ = మనయొక్క సహన శీలతను; పరీక్షించెడు = పరీక్షించునట్టి [అనగా, విసిగించి, శ్రమపఱుచు నట్టి]; అహితునిపైన్ = శత్రువు మీద; విసరి కొట్టన్ = రువ్వుటకు; అగ్నినిన్ + పట్టన్ = నిప్పులను చేతిలోనికి తీసికొనగా; హస్తమున్ దహియింపదె? = ఆ పట్టిన చేతిని కాలునట్లు చేయదా? [అనగా, కాల్చును అని భావము]; అటులె ఆగ్రహంబు = ఆదే విధముగా కోపము కూడా; తాల్పన్ = ధరించగా; క్రోధిన్ కాల్చున్ = కోపగించినవానినే దహించును;

సుమతీ శతక కారుడు ఏనాడో చెప్పినాడుకదా – "*తనకోపమె తన శత్రువు, తన శాంతమె తనకు రక్ష, దయ చుట్టంబౌ, తన సంతోషమె స్వర్గము, తన దుఃఖమె నరక మండ్రు తథ్యము సుమతీ*" అని. "మనకు కలిగిన కోపము ఏవిధముగా మనకు శత్రువగును?" అను ప్రశ్నించు వారికి పై పద్యమే సమాధానము!

ఓ సుధామా! ఒకానొకడు విసిగించి మనలను నిస్త్రాణులను చేయుచుండగా, అట్టి ఆహితమును చేయు వ్యక్తిని కొట్టుటకై నిప్పులను చేతిలోనికి తీసికొనినచో ఏవిధముగా మన చేతులనే కాల్చునో, అదే విధముగా, కోపము కూడా కోపించిన వానికే చెడుపును కలిగించుచు నశింప చేయును సుమా!

సాధకునకు కోపము పనికి రాదు - "*కోపము తపముం జెరచును - - - క్రోధిగాఁ దపస్వికిఁ జన్నే ?*" -- నన్నయ భారతము

42. పంకజ నళినీదళ మక
ళంకితమగు నట్టులె తరళంబగు ధరణిన్
సంకటముల బారిఁ బడియు
నుంకింపకు మాయఁ దలఁపు నూన్ప సుధామా!

పంకజ = బురద నుండి పుట్టిన; నళినీ దళము = తామరాకు; అకళంకితము + అగు నట్టులె = బురద యంటక స్వచ్ఛముగా ఉన్నట్లుగా; తరళంబు + అగు ధరణిన్ = చలించునదైన భూమియందు; సంకటముల బారిన్ + పడియున్ = కష్టములు, దుఃఖములు కలిగినప్పటికీ, మాయ తలపున్ = భ్రమ (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు) కలిగించు ఆలోచనలను; ఊన్పన్ = (మనస్సుకు) తగిలించుటకై; ఉంకింపకు = యత్నింపకుము

ఓ సుధామా! బురదయందు పుట్టిన తామరాకు ఏవిధముగా స్వచ్ఛమై భోజనాది కార్యములకు ఉపయుక్తమగుచున్నదో, అదేవిధముగా, మాయలో పుట్టి మాయను చుట్టుకొనిన మానవులు కూడా కష్టనష్టముల బారిన పడువారై నప్పటికీ, ఆ బాధలను లెక్కింపక పోయినచో, మాయను ఛేదించిన వారే అగుదురు సుమా!

అనగా, ద్వైతమున వసించుచూ అద్వైత భావములతో చరించుటయే మోక్షమనగా! తామరాకు పై నీటి బొట్టు ఏవిధముగా స్థిరముగా నుండక జారిపోవునో - అదే విధముగా మానవులు మాయలో నివసించుచూ మాయను అంటించుకొనని విధముగా ప్రవర్తింప వలెను సుమా!

**43. త్రిప్పటల బారి మానిసి**

**యప్పుల పాలఁబడును, సకలైశ్వర్యములన్**

**గుప్పు పరమాత్మ మదిలో**

**రప్పింపక తిరుగనేల భ్రమల సుధామా!**

**త్రిప్పటల బారి మానిసి = సంసార భ్రమలో కూరుకు పోయి తిరిగు మానవుడు; అప్పుల పాలన్ + పడునున్ (*శబ్ద పల్లవము*) = ఋణ గ్రస్తుడయి పోవును; సకల + ఐశ్వర్యములన్ = సమస్త సంపదలను; గుప్పు= అధికముగా, మిక్కిలిగా ఇచ్చు; పరమాత్మన్ = పరతత్త్వమును; మదిలోన్ = మదిలోనికి; రప్పింపక = రానీయక; భ్రమలన్ + తిరుగన్ +ఏల? = భ్రమచేత తిరుగుట ఎందులకు? [అనగా, అటుల తిరుగుట వ్యర్థమని భావము]**

**ఓ సుధామా! మానవులు ఈ సంసార భ్రమల్లో చిక్కుకొని పరమాత్మ తత్త్వమును మరచి, సంపదలకోసం తిప్పలు పడుచూ అప్పులు చేసి తీర్చలేక బాధలు పడుతూ ఉందురు సుమా! అనగా, పరమాత్మ తత్త్వము మనస్సున చేరినచో 'అప్పులు' చేయమా? లేక 'తిప్పలు' ఉండవా? అని అడుగు వారికి - సర్వ ముక్తుడై సర్వమూ తానైన వానికి, ఇతరము నశించిన వానికి కోరునదేమి ఉండదు కనుక, ఆ స్థితి పరమోత్కృష్టమని సమాధానము!**

**[దీనినే, వేమన - *'ఆత్మలోని శివుని ననువుగా శోధించి, నిశ్చలముగ భక్తి నిలిపె నేని, సర్వముక్తుడగును సర్వంబు తానౌను'* - అని తెలుపగా గ్రహించితిమికదా!]**

44. దుర్భరమీ జీవన మని

యర్భకు తలఁపులకుఁ దట్టు నజ్ఞతచే; నం

తర్భావిత పరమాత్మా

విర్భవమా వెఱపును మఱపించు సుధామా!

దుర్భరము + ఈ జీవనము + అని = ఈ మాయా సంసారమున జీవించుట సహింపరానిది అని; అర్భకు తలపులకున్ = దుర్బలుడు, అల్పుడు, మూర్ఖుడు అయిన వానియొక్క ఆలోచనలకు; అజ్ఞతచేన్ + తట్టున్ = అజ్ఞానము వలన తట్టును (అనిపించును); అంతర్భావిత = మనస్సులో ధ్యానించుకొనిన; పరమాత్మ + ఆవిర్భవము = పరమాత్మయొక్క ప్రత్యక్షీకరణము; ఆ వెఱపునున్ = అట్టి భయమును; మరపించున్ = పోగొట్టును;

ఓ సుధామా! మానవులకు కష్టాలు, బాధలూ అనునవి వారి అజ్ఞాన కారణమున, మానసిక దౌర్బల్యము వలననూ కలుగును. అట్టి బాధల యొక్క తలపులు (ఆలోచనలు) భయమును, వెఱపును కలిగించును. అట్టి వారి మనస్సులలో పరమాత్మ తత్త్వము వెలసినచో, ప్రతిష్ఠింపబడినచో వారి భయము దూరమై, వారు తమ దుర్బలతను పోగొట్టుకుని, అజ్ఞానమును రూపుమాపుకొని మహనీయులని పిలువబడెదరు సుమా!

45. అనలము దాల్చును దహనం
బొనరించు పదార్థ రూప; మొడలిఁ బ్రవేశిం
చిన యాత్మయు నాకారము
గొని - జీవి యటులనె భ్రాంతిఁ గొలుపు సుధామా!

అనలము = అగ్ని (అకార రహితమైన మంట); దహనంబు + ఒనరించు = మండించు; పదార్థ రూపము = పదార్థము యొక్క రూపమును ; తాల్చును = ధరించును; ఒడలిన్ ప్రవేశించిన = శరీరము నందు ఒదిగి ఉన్న; ఆత్మయున్ = పరమాత్మ కూడా; జీవి యటులనె = ఆ శరిరము ఏ జీవి/పశు/జంతువునకు సంబంధించినదో అటులనే; ఆకారము + కొని = రూపమును పొంది; భ్రాంతిన్ గొలుపున్ = భ్రమను కలుగ జేయును!

ఓ సుధామా! ఏవిధముగా అయితే స్వయముగా ఆకారము లేని అగ్ని తాను కాల్చుచున్న / మండించుచున్న వస్తువుయొక్క రూపమునుపొందునో, అదే విధముగా, స్వయముగా ఏ రూపము లేని పరమాత్మ తత్త్వము ఏ జీవియొక్క శరీరములో ఒదిగి ఉండునో, ఆజీవి యటులే కనిపించి 'స్వరూప భ్రాంతిని' కలిగించును సుమా!

46. ఓడకు రంధ్రం బేర్పడఁ

బాడఱి జనపాళి ముంచుఁ ; బరవశ మనముస్

బేడిదమగు మోహంబులఁ

గూడింపగ భ్రష్టమగుచుఁ గూలు సుధామా!

ఓడకుస్ = నౌకకు (నావకు); రంధ్రంబు + ఏర్పడస్ = చిల్లు పడగా; పాడఱి = పాడుపడి; జనపాళిస్ = జన సమూహమును (ప్రయాణికులను); ముంచుస్ = ముంపునకు గురిచేయును; పరవశ మనముస్ = స్వ వశములో లేని (అనగా, ఇతరమైన కాంక్షలు, కోరికలు, ఈర్ష్యలు, మొదలైన) మాయలయొక్క వశములోనున్న మనస్సు; బేడిదము + అగు = భయంకరమైన; మోహంబులస్ + కూడింపగస్ = మోహమాయతో సదా కలగలసి యుండుట వలన; భ్రష్టము + అగుచుస్ + కూలుస్ = భ్రష్టమగుచూ నశించును;

ఓ సుధామా! ఓడ నీటిపై తేలాలి అనగా, ఆ ఓడకు ఎట్టివిధమైన బెజ్జములూ, చిల్లులూ ఉండరాదు. చిల్లుపడినచో, "*చుట్టూవున్న నీరు లోపలికి చేరుట వలన*" ఓడ మునిగి యాత్రికుల మరణావవస్థకు కారణమగును! అదేవిధముగా, వశము తప్పిన మనస్సుకు భయంకరమైన (మరియు చుట్టూ పేరుకొని ఉన్న) మోహమాయ వచ్చి చేరితే, ఆమనస్సు కూడా పాడు పడిన ఓడవలె భ్రష్టుపట్టి పోవును సుమా!

అనగా, నీటిని ఆధారంగా చేసికొనుచూ, నీటిని లోనికి రానీయని నౌక తీరాలు దాటినట్లుగా, మాయను ఆధారంగా చేసికొని మాయను మనస్సు లోనికి రాకుండా ఉన్న మానవులే భవసాగరాన్ని అవలీలగా దాటి ముక్తులగుదురు సుమా!

47. నదముల నీరంతయు వడి

సుదధిఁ గలయ నది తొణఁకునె? యుల్లంబాత్మన్

బదిలముగ నిలుపు నరుఁడును

మెదలఁడు లాహిరి భ్రమ మితిమీఱ సుధామా!

నదముల నీరు + అంతయున్ = నదులలోని నీరు అంతయు; ఉదధిన్ + కలయన్ = సముద్రమునకు చేరగా; అది తొణఁకునె? = ఆ సముద్రము తొణకునా? (అనగా, తన ప్రశాంతతను కోల్పోదు); లాహిరి భ్రమ మితిమీరన్ = మైకమును కలిగించు మాయ ఎంత వైశాల్యాన్ని పెంచుకున్నప్పటికీ; ఉల్లంబు ఆత్మన్ + పదిలంబుగన్ నిలుపు నరుడు = మనస్సును ఆత్మయందు భద్రముగా ప్రతిష్ఠించిన మానవుడు; మెదలడు = స్థిరుడై ఉండును!

ఓ సుధామా! నదులలో గల నీరంతయు ప్రవహించి సముద్రములో కలిసినా ఆ సముద్రమునకు ఏ విధమైన వికారము కలుగదు. అదేవిధముగా పరమాత్మతో కలగలిసిన ఆత్మ కలిగిన మానవుడు తనను మాయ ఎంతగా ప్రేరేపించినా మైకాన్ని పొందక స్థిరుడై ఉండును సుమా!

48. భ్రాంత మనస్కృత నరులను
శాంతంబుగ నుండనీదు; జాగృతి వీడన్
జంతువులఁ బోలుచు మెలఁగి
కాంతురు దుర్దశలు మిగులఁ గదుర సుధామా!

భ్రాంత మనస్కృత = భ్రాంతిని పొందిన మనస్సు కలిగి యుండుట; శాంతముగన్ + ఉండనీదు = పరమాత్మ ఆశ్వాసమున స్థిరపడునట్లు చేయజాలదు; జాగృతి వీడన్ = జాగరూకత (మెలకువ) వీడిపోయినచో; జంతువులన్ పోలుచున్ మెలగి = జంతువుల వలె ప్రవర్తించి; మిగులన్ కదురన్ = మిక్కిలి విజృంభించగా; దుర్దశలు కాంతురు = దురవస్థను అనుభవింతురు!

ఓ సుధామా! భ్రాంతితో, గర్వావేశముతో మెలగు మానవులు జంతువర్తనులై యుందురు. వారికి పరమాత్మాశ్వాసితమైన ఆనందము, తృప్తి, శాంతము వంటి సాత్విక గుణములు లభింపవు. అట్టివారు ప్రాపంచికమైన, అశాశ్వతమైన సుఖములను కోరుకొనుచు, కోరినవి అందక దుఃఖితులై, అందని కోరికలకు బానిసలై, పెరసి తమ కోరికలకు తామే బందీలై, బంధ విమోచనమును పొందక, ముక్తులు కాకుండగనే (అనగా, బానిసలు, దాసులు గానే) నశించి పోవుదురు సుమా!

49. సందేహింపకు మొందటొ

వందలు వేలుగ మనుజులు పరతత్త్వంబున్

డెందమునఁ గాంచి పరమా

నంద భరితులైరి సాధనమున సుధామా!

వందలు వేలుగన్ మనుజులు ఎందరో = (కోట్లాది సంవత్సరాలుగా) ఎందరో (మహానుభావులు) మానవులు; పరతత్త్వంబున్ = పరమాత్మను; డెందమునన్ + కాంచి = తమ హృదయాలలోనే దర్శించి; [డెందము=హృదయము]; సాధనమునన్ = సాధన పద్ధతి ద్వారా; పరమ + ఆనందభరితులు + ఐరి = మిక్కిలి ఆనందమును తమ హృదయాలలో నింపుకొనిన వారుగా అయినారు; సందేహింపకుము = అనుమానము, శంక, మొదలైన వానిని వీడుము;

ఓ సుధామా! ముక్తి మార్గమును శంకింపకుము. సందేహపడి దానికి దూరము కాబోకుము. ఎందరో మహానుభావులు తమ ధ్యానాది సాధనల ద్వారా మోక్షానందమును పొందిరి. నీకునూ సాధ్యపడును -- సాధన విడువ వలదు.

50. సమయం బావశ్యకమగు;

శ్రమ చేత లభించు నాత్మ; బ్రహ్మాధ్యాయీ!

నిముసము నెడబాయకు నీ

వమితంబగు ముదముఁ గొందు వవల సుధామా!

సమయంబు + ఆవశ్యకము + అగున్ = మోక్షమును పొందుటకు కొంతకాలము అవసర మగును; ఆత్మ = పరమాత్మ తత్త్వము ; శ్రమ చేతన్ లభించున్ = సాధన, కఠోర పరిశ్రమ చేత మాత్రమే లభించును; బ్రహ్మ + అధ్యాయీ = పరతత్త్వమును అధ్యయనము చేయు వాడా, ఓ సాధకుడా!; నిముసమున్ + ఎడబాయకు = ఒక్క నిముషమునైనూ విడువ వలదు; అవలన్ = అవతల, చివర, తరువాత, ఆపైన; అమితంబు + అగు = అవధులు లేని; ముదమున్= ఆనందమును; నీవు కొందువు = నీవు అనుభవించెదవు

ఓ సుధామా! చుట్టుకొని ఉన్న ఈ భ్రాంతిను తొలగించుకొని పరమాత్మను చేరుకొనుటకు కొంత సమయము అవసరమే అగును. కఠిన పరిశ్రమకూడ అవసర పడవచ్చును. అయినప్పటికీ, ఒక్క క్షణమునైననూ వ్యర్థము చేయక పరబ్రహ్మమును (పరమాత్మను) గూర్చి సాధన చేయుము - అవధులు, సీమలు లేని అమందానందమును పొందగలవు!

51. గంపల దుంపల డింపక

కంపెడలని రీతి భువినిఁ గాంక్షల మాయన్

సంపద పెంపు గణింపక

లంపటముల గుంపడంప రాదె? సుధామా!

గంపల దుంపలన్ డింపక = గంపలో నున్న దుంపలను క్రిందకు దింపక పోయినచో - అనగా, ఎప్పటికీ నెత్తిన పెట్టుకొని మోయుచున్నచో; కంపు + ఎడలని రీతిన్ = దుర్గంధమును వీడని విధముగా; భువిన్ = జగము నందు; కాంక్షల మాయన్ = కోరికల యొక్క మాయాజాలముచే; సంపద పెంపు గణింపక = ధన ధాన్యములు, భోగ భాగ్యాలు, సంపదలు మొదలైన వానియొక్క పెంపుదలను కోరుకొనక; లంపటముల గుంపున్ + అడంప రాదె = దురాశా లంపటముల యొక్క సమూహములను తొలగించు కొనరాదా?

ఓ సుధామా! దుంపలను ఒక గంపలోనికి చేర్చి, ఆ గంపను నెత్తిన పెట్టి ఎచ్చటనూ దింపక ఎప్పటికినీ ఒకే రీతిగా సాగుచుండగా, ఆ దుంపలు కుళ్ళి కంపు కొట్టినటులుగా, కోరికలు అను మాయతో సంపదలపైన వ్యామోహమును పెంచుకొనినచో గుంపులు గుంపులుగా మనస్సులోనికి చేరు లంపటములు నెత్తిని జుట్టుకొని మనలను నశింప చేయును. కనుక అట్టి లంపటములను తొలగించు కొనవలసినదే సుమా!

*పరస్పరము కలహించు కొనుచు ఆశ్రమ నియమములకు భంగము కలిగించు శిష్యులను దారికి తెచ్చుటకై ఒకానొక గురువు "ఈ దుంపలను దింపక ఎల్లప్పుడునూ మోయు చుండవలెను" అను ఆంక్షను విధించెనను ఉపనిషత్కథను వినియే ఉన్నాము కదా!*

52. సౌరభ మాఘ్రాణింపఁగ

సారంగము చేరి పుష్ప సంగతిఁ జచ్చున్

వారించు గురునిఁ గాదని

ఘోరంబగు భ్రాంతి నరుఁడు కూలు సుధామా!

సౌరభము = సువాసన, పరిమళము; ఆఘ్రాణింపగన్ = వాసన చూచుట కొరకు; సారంగము = తుమ్మెద; చేరి = వాలి; పుష్ప సంగతిన్ + చచ్చున్ = పువ్వుల సాంగత్యముతో (మధ్యలో నలిగి) మరణించును; వారించు = ఆపు, అడ్డగించు, రోధించు; గురునిన్ కాదు + అని = గురువును లెక్కచేయక, గురు వాక్కులను గ్రహించ లేక; నరుడు = మానవుడు; ఘోరంబు + అగు = దారుణమైన; భ్రాంతిన్ = భ్రాంతితో ; కూలున్ = నశించును.

ఓ సుధామా! పువ్వుల యొక్క పరిమళాలను పొందాలని చేరు తుమ్మెదలు - ఆ పువ్వులు ముడుచుకు పోగా అసువులను వీడినట్లుగా, తమను ఆకర్షించు మోహమాయ లోబడి, గురువులు, అనుభవజ్ఞులు చెప్పిన మాటలను పెడచెవిని బెట్టి, వ్యామోహముల నుండి బయటపడలేక ఘోరముగా మోసపోయి మానవుడు నశించి పోవును సుమా!

**53. భ్రమఁగొలుపు తలఁపుఁ దొలఁచుచుఁ**
**గ్రమశిక్షణ తోడ నరులు గమ్యము చేరన్**
**సమదృష్టిఁ గొన్న గురువులు**
**విమలత నొనఁగూర్తు రిలను విధిగ సుధామా!**

క్రమశిక్షణతోడన్ = నియమ, నిష్ఠలతో; భ్రమన్ + కొలుపు = మైకము, మత్తు, భ్రమవంటి వానిని తోపింపచేయు; తలపున్ + తొలచుచున్ = ఆలోచనలను తొలగించుకొనుచూ; నరులు గమ్యము చేరన్ = మానవులు మోక్షమును పొందునట్లుగా; సమదృష్టిన్ + కొన్న = (ద్వైతముగా అగుపించు ఈ మాయా ప్రపంచ మందలి) అన్ని విషయములనూ సమానముగా గ్రహించ గలిగిన; గురువులు విధిగన్ = (పరమాత్మాను భవమును పొందిన) గురువులు తప్పని సరిగా; ఇలను = ఈ మాయా ప్రపంచ మందు; విమలతన్ = స్వచ్ఛతను; ఒనగూర్తురు = సిద్ధింప జేయుదురు

ఓ సుధామా! మానవుల మనస్సుకు తోచు మాయా మోహముల కారణముననే, వారు మోక్షమును పొందలేక పోవుచున్నారు సుమా! అట్టి మనస్సును వంచి (అనగా, అధీనములోనికి తెచ్చుకొని, దానిపై పట్టు సాధించి) మానవులు మోక్షమును పొందు విధముగా శుభ్రముచేసి "సుఖ-దుఃఖములను", "శీతోష్ణములను", "మంచి-చెడ్డలను", ఇత్యాది ద్వైతములన్నింటినీ సమముగా చూడగలుగు ప్రజ్ఞను గాంచిన పరమ గురువులు తీర్చి దిద్దెదరు సుమా!

"*సమత్వం యోగ ఉచ్యతే*" (సమదృష్టి యే యోగము)" అను గీతావచనమిట స్మరింప దగినది!

54. నూటికిఁ బదిమందైనను

బాటింపరు గురు పలుకులఁ - బట్టిన భ్రమలన్

గోటి యుగంబులు గడచిన

బూటకము లెడల్పలేరు భువిని సుధామా!

నూటికిన్ + పది మంది + అయిననూ = 10 శాతముగా గలిగిన శిష్యులు / వ్యక్తులు కూడా; గురు పలుకులన్ పాటింపరు = గురువులు చూపు మార్గమును అనుసరించ లేక పోవు చున్నారు! పట్టిన భ్రమలన్ = మాయలో చిక్కుకొనిన వారై; కోటి యుగంబులు గడచినన్ భువినిన్ = ఎన్నో జన్మలు ఎత్తి, ఎన్నో రూపాలను పొంది, ఎంతో కాలము ఈ మాయా సంసారములో చిక్కుకొని పోయి పుట్టుచూ - గిట్టుచూ ఉందురు తప్ప; బూటకములు + ఎడల్పన్ లేరు = మాయా వంచనలను తొలగించు కోలేరు

ఓ సుధామా! చాలామంది మానవులు తమను పట్టి పీడించుచున్న మాయా వ్యామోహముల వలన గురువులు చేయు సద్బోధలను గ్రహింప జాలరు సుమా! ఆ విధముగా కోట్ల కొలది సంవత్సరాలు గడచిపోయినా మాయచేయు కపటము, వంచన వంటివాని నుండి తప్పించుకోలేరు సుమా!

55. అద్దమున కంటుదుమ్మును
    రుద్దుచు వస్తువులఁ గనమె [1]ప్రోజ్జ్వలితముగన్?
    దద్దరముగఁ గ్రమ్మెడు కడు
    గద్దరి తెరలెడల నాత్మఁ గనుదు సుధామా!

[1]ప్రాదియతి - "ప్ర + ఉజ్జ్వలితము (=ప్రోజ్జ్వలితము)" అను సంధిలోని 'ప్రో' కు 'రు' కు యతిమైత్రి కుదిరినది.

అద్దమునకున్ + అంటు దుమ్మును = అద్దముపై పేరుకొనిన దుమ్మును; రుద్దుచున్ = తుడుచుచూ; వస్తువులన్ = అద్దములో కనిపించు వస్తువుల యొక్క ప్రతిబింబములను; ప్రోజ్జ్వలితముగన్ కనమె? = మిక్కిలి ప్రకాశించు నట్లుగా చూడమా?; దద్దరముగన్ = వైపరీత్యముగా, తల్లక్రిందులుగా; కడున్ క్రమ్మెడు = మిక్కిలిగా ముసురునట్టి, క్రమ్మునట్టి; గద్దరి తెరలు = దట్టమైన, సాంద్రమైన తెరలు; ఎడలన్ = తొలగి పోగా; ఆత్మన్ కనుదు = పరతత్త్వమును కనుగొనెదవు! ('వు' వర్ణమునకు లోపము వికల్పము)

ఓ సుధామా! అద్దమునకు పట్టిన దుమ్మును తొలగించి చూచినచో వస్తువులు ప్రకాశమానముగా కనబడును. వస్తువుల యొక్క ఉజ్జ్వలతలో ఏమార్పు ఉండక పోయినను, కేవలమూ మన కంటి ముందున్న అద్దముయొక్క మసిబారిన స్థితి ఆ వస్తువులను ప్రకాశహీనముగా కన్పింపచేయును. అదే విధముగా, అజ్ఞానమను దట్టమైన తెరలు క్రమ్మివేయగా అగపడని (సదా హృదయ కోశములో ప్రకాశించే) ఆత్మతత్త్వము, ఆ తెరలను తొలగించి చూడగా స్పష్టముగా కనబడును.

56. వినుచును బెద్దల మాటలఁ

బనుపఱచుము వారి యనుభవమ్ములఁ గొనుచున్

అనుకూలమనుచు నూరక

యనుసరణలఁ జేయఁ గలుగు హాని సుధామా!

పెద్దల మాటలన్ వినుచునున్ = అనుభవజ్ఞుల పలుకులను శిరసావహించుచూ; వారి యనుభవమ్ములన్ + కొనుచున్ = పెద్దల అనుభవములలోని సారమును గ్రహించుచూ; పను పరఅచుము = ఏదేని కార్యమును సమకూర్ప బూనుము; ఊరక = పనిలేని పనిగా (కాలక్షేపము కొరకు); అనుకూలమనుచున్ = ఆ పెద్దలు చెప్పిన అనుభవములు ఉపయోగ పడునని భ్రమించి; అనుసరణలన్ చేయన్ = అనుసరించినచో; హాని కలుగున్ = దురవస్థ కలుగును!

ఓ సుధామా! "పెద్దల మాట చద్దన్నం మూట" (అనుభవముతో పెద్దలు పలికిన పలుకులు మనకు చద్దియన్నము వలే ఉష్ణోపశమనమును కలిగించును) -- ఈ సామెతను బట్టి పెద్దలు ఏర్పరచిన మార్గాన్ని అనుసరించి మనమూ పోవుచుందుము. కాని, అట్లు అనుసరించినచో వారికి కలిగిన అనుభవములే మనకు కలుగునని చెప్పలేము!

పెద్దలను సంప్రదించుట, వారికి గౌరవ మిచ్చుట ఎందుకనగా, వారు మనకంటే ముందుగా, మనకంటే ఎక్కువగా కష్టనష్టాలను అనుభవించి, తట్టుకొని నిలబడ గలిగినందులకు మరియు వారి మాటలు వారి వ్యాసంగముల అనుభవ సారముతో కూడి మంచి మార్గమున నడిపించును కూబట్టి. కానీ, వారు అనుసరించు మార్గమునే అనుసరించుట వలన వ్యతిరేక ఫలితము కూడ కలుగ వచ్చు. కావున, వారిని గ్రుడ్డిగా అనుసరించ రాదని భావము!

57. జడిఁబడి జడిసి విహంగము

లెడనెడఁ గొను గూటిపట్టు; నెగురును డేగల్

తడఁబడక మింట; దృఢగతిఁ

గడంకఁ జేకొన్న వాఁడె ఘనుఁడు సుధామా!

విహంగములు = పక్షులు; జడిన్ + పడి = వానలో తడిసి; జడిసి = భయపడి; ఎడనెడన్ = ఆయా ప్రదేశములందు; గూటిపట్టున్ = సురక్షిత స్థానమును; కొనున్ = ఆశ్రయించును; డేగల్ = డేగలు; మింటన్ = ఆకాశమున; తడబడక = చలింపక; ఎగురున్ = (మేఘములు దాటి పైకి) ఎగురును; కడంకన్ = ప్రయత్నముతో; దృఢగతిన్ = గట్టి (స్థిరమైన) మార్గమును; చేకొన్నవాడె = అందుకొనిన వాడే; ఘనుడు = గొప్పవాడు

ఓ సుధామా! వాన పడుచున్న సమయమున, చాలా పక్షులు గూళ్ళకు చేరుకొనును, లేదా, ఏదైనా కప్పు, వాసము, గోపురము మొదలైన వాటిని వెదకి కొనుచుండును. కానీ, డేగలు (శ్యేనములు) వానమబ్బుల కంటే పైగాఎగిరి తమను తాము వాననుండి కాపాడు కొనును.  అదే విధముగా, కష్టాలు మీద బడినప్పుడు మానవులు కూడా ప్రయత్నించి ఒకానొక దృఢపైఖరిని అలవరచుకొని శక్తి సామర్థ్యాలతో ఘనులై లక్ష్యమును అందుకొనవలెనని ఆశయము!

**58. నరునకగు కష్ట దశయే**

**పరమముఁ బరిచయము సేయు పథమగు మదికిన్;**

**దరిఁజేరు బాధ భవమును**

**దరియింపగఁ జేయు పెద్ద తరణి సుధామా!**

నరునకున్ + అగు కష్టదశయే = కష్టములు, దుఃఖములు, బాధలు మొదలగునవి నరునకేర్పడు కాలమే; పరమమున్ మదికిన్ పరిచయము చేయు పథము + అగున్ = పరమాత్మను మనస్సుకు పరిచయము చేయునట్టి మార్గము అగును; దరిన్ + చేరు = ఒద్దకు వచ్చు; బాధ = పీడ, సమస్య; భవమునున్ +తరియింపగన్ చేయు = భవ సాగరమును దాటించు; పెద్ద తరణి = పెద్ద నౌక;

ఓ సుధామా! మానవులకు కష్టాలు పరమాత్మను మనస్సుకు పరిచయము చేయుటకే కలుగును. అటులనే, బాధ, దుఃఖము అనునవి కూడా ఈ భవసాగరాన్ని దాటింప చేయుటకు మనకు సహాయపడు నౌకలే యగును సుమా!

59. కనకపు నాడెము నెఱుఁగఁగఁ
    జెనకింపమె గీటుఱాతి జేగురు పలకన్?
    మనుజులలో మాన్యునటులెఁ
    గనుగొనవలె త్యాగనిరతిఁ గనుచు సుధామా!

కనకము + నాడెమున్ + ఎఱుగగన్ = బంగారము యొక్క శ్రేష్ఠతను తెలిసికొనుటకు; గీటురాతి జేగురు పలకన్ = గీటురాయి యొక్క ఎర్రనైన ఫలకముపై; చెనకింపమె = గోటితో నొక్కి (గీటు) గీయమా?; అటులె = అదే విధముగా; మనుజులలోన్ మాన్యులన్ = మానవులలో గౌరవనీయులను; త్యాగనిరతిన్ = త్యాగ భావనల వలన; కనుచున్ = (పరిశీలించి) చూచుచూ; కనుగొనవలెన్ = గ్రహించవలెను

ఓ సుధామా! గీటురాతిపై బంగారాన్ని గీటుపెట్టి, దాని శ్రేష్ఠతను నిర్ణయించుకొనునట్లే, మానవుల యొక్క త్యాగభావాన్ని చూచి వారి మహనీయతను అంచనా వేయవలెను సుమా! త్యాగనిరతియే మహనీయతకు మూలకారణమని భావము

60. ఏకాకి ననెడు తలఁపున
నేకాగ్రత విడిచి చెడకు - హితమగు రీతిన్
సాకార మొంది కలలిల
శ్రీకారము చుట్టు నిన్నుఁ జేరు సుధామా!

ఏకాకినిన్ + అనెడు తలపునన్ = నేను ఒంటరి వాడిని - నాకెవ్వరూ లేరు అను అనవసరపు ఆలోచనలతో; ఎకాగ్రతన్ = దీక్షను, స్థిర బుద్ధిని; విడిచి = వదిలి వేసి; చెడకు = నశింపకు; ఇలన్ = జగమున; కలలు = కన్న కలలు; హితము + అగు రీతిన్ = మేలును కలిగించునట్లుగా; సాకారము + ఒంది = నిజములై; శ్రీకారముచుట్టు నిన్నున్ = (వానిని సాధించుటకై) ప్రారంభించు నిన్ను; చేరున్ = చేరుకొనును

ఓ సుధామా! నేను ఏకాకిని, నాకెవ్వరూ లేరను తలపులు కొంతమందిని క్రుంగ దీయును! కానీ, అటువంటి ఆలోచనలు చేయక, నీకు కలిగిన కలలను సాకారము చేయు దిశగా పని ప్రారంభించగా, చక్కగా నీకనుకూలమైన ఫలములు కలుగును సుమా!

"సత్సంకల్పముతో చేయు పనులు త్వరితముగను, ఒరులతో సంబంధమున్న పనులు కొంత సమయ విరామానంతరమును తప్పక ఫలించున"ను పరమాత్మ సాధన యొక్క సహజ లక్షణమునే పై పద్యము తెల్పుచున్నది.

61. మలుపగఁ గ్లిష్ట పరిస్థితి
నలవున దుఃఖంబు లెల్ల నావిరి గాఁగన్
సులభావకాశ రీతుల
దలఁపుల వెలిఁగించి తీర్చు దమము సుధామా!

క్లిష్ట పరిస్థితిన్ = కష్టదశను; మలుపగన్ = మలగజేయగా, త్రిప్పగా, మళ్లించగా; అలవునన్ = సులభముగా; దుఃఖంబులు + ఎల్లన్ = శోకభావనలు అన్నీ; ఆవిరి కాగన్ = వ్యర్థమై పోగా, ఆవిరై పోగా; దమము = నీయొక్క ఇంద్రియములను నిగ్రహించు శక్తి; తలపులన్ = ఆలోచలందు; సులభ + అవకాశ రీతులన్ = అవలీలగా అందుకొను అవకాశములను; వెలిగించి తీర్చున్ = తళుకుమని తట్టునట్లు చేయును;

ఓ సుధామా! దమము (అనగా, ఇంద్రియ నిగ్రహము లేక క్లేశములకు ఓర్చుకొను శక్తి) వలన మానవులు కష్టనష్టాలను ఓర్చుకొనగా వారికి కలిగిన దుఃఖాలు నివారింపబడి, ఆ కష్టాల స్థానంలో సత్ఫలమును పొందే అవకాశాలు వారికి మెండుగా కనబడునని భావము.

(Often opportunities disguise in the form of difficulties – with a strong mind and steadfast belief, human beings can detect the opportunity)

62. ముద మొదవించెడి జీవన

ముదయించు నరునకు జగతి నోజము మీఱఁ;

హృదయస్థ పరాత్మ నెఱిఁగి

చదురున సకలజన సేవ సలుప సుధామా!

హృదయస్థ = హృదయమునందున్న; పరాత్మన్ + ఎఱిగి = పరమాత్మను తెలిసికొని; చదురునన్ = గొప్ప సమర్థతతో; సకల జన సేవన్ = సర్వ జనులకూ సేవలను; ఓజము మీఱన్ = శక్తికొలది, పటిష్ఠముగా; సలుపన్ = సలుపగా, కలిగించగా; నరునకున్ = జీవునకు; ముదము + ఒదవించెడి = సంతోషమును కలిగించు; జీవనము + ఉదయించును = బ్రతుకు కలుగును (మొలకెత్తును);

ఓ సుధామా! మానవులు వారి హృదయాలలో నివాసమున్న పరమాత్మ తత్త్వమును అర్థము చేసికొనుచూ, నేర్పుతో శక్తికొలది (పటిష్ఠముగా) ఇతరులకు సేవలను అందించగా, వారి వారి కార్య రంగములలో సంతోష దాయకమైన పరిస్థితులు కలిగి ఆహ్లాదకరమైన ఆనందము వెల్లివిరియును సుమా! దీనినే అద్వైతానందమందురు.

దీనినే, ఈశావాశ్యోపనిషత్ 7వ మంత్రము ఈ విధముగా తెలియ జెప్పినది :

*యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్ విజానతః*

*తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః*

[జ్ఞానియైన వానికి ఎప్పుడైతే అన్నిభూతములందును పరమాత్మ తత్త్వమే గోచరించునో, ఆ ఏకత్వ దృష్టి కలవానికి మోహము కానీ, శోకము కానీ ఉండదు - అన్నియు ఆనంద మయముగనే తోచును]

63. పడు వానకు నర్తింపుము;

పెడలింపుము వఱద భీతి; విడువుము భవితన్;

నడువుము ప్రస్తుత మెఱుఁగుచు;

పడఁబోకు మతీత మాయఁ - బరమ సుధామా!

పడు వానకున్ = కురియుచున్న వర్షమునకు; నర్తింపుము = ఆనందించుచూ కేరింతలతో గంతులు వేయుము; వఱద భీతిన్ = ఈ వాన గొప్ప వరదను కలిగించునేమో అను భయమును; పెడలింపుము = విడిచి పెట్టుము; భవితన్ విడువుము = భావి కాలమునకు చెందిన ఆలోచనలకు స్వస్తి పలుకుము; ప్రస్తుతము + ఎరుగుచున్ నడువుము = వర్తమానమును గ్రహించుచూ ప్రవర్తించుము; అతీత మాయన్ పడబోకుము = (జరిగి పోయిన సంఘటనలను, ఉదంతములను తలచు కొనుచూ) భూత కాలపు మాయలో కాలమును వ్యర్థ పరుపకుము;

ఓ సుధామా! వాన పడుచున్నది -- అది చక్రవాతమో (తుఫానేమో) లేక వరదను సృష్టించునదేమో అను భయమును పొందక, చక్కగా నర్తించి ఈ క్షణమున (వర్తమానమున) జరుగు దానిని ఆనందముతో స్వీకరించుటయే జ్ఞాని లక్షణము! గత కాలపు విచారమూ మాయయే, భావికాలపు భీతియూ మాయయే అగును - కనుక ఆ మాయ పట్టులో పడవలదు సుమా!

## 64. సమయం బెవనికి స్వాధీ

నమగును? వ్యయమొందదె యనునయ మొవ్వకయే?

తమమెంచక శమదమముల[1]

శ్రమఁజేయుచు నణఁప వలెను భ్రమల సుధామా!

*[1] శమము = అంతరింద్రియ నిగ్రహము; దమము = బహిరింద్రియ నిగ్రహము*

సమయంబు + ఎవనికిన్ స్వాధీనము + అగును? = కాలమెవ్వరికి లొంగి యుండును? అనునయము = బుజ్జగింపు; ఒవ్వకయే = సరిపడకే; వ్యయము + ఒందదె = ఖర్చు అయిపోవును కదా! తమము + ఎంచక = అజ్ఞానము (తమస్సు) దెసకు వెళ్ళక; శ్రమన్ + చేయుచున్ = కఠిన పరిశ్రమ చేయుచూ; శమ దమములన్ = శాంతముతోను, ఇంద్రియ నిగ్రహముతోను; భ్రమలన్ = భ్రాంతులను (మాయాంధతలను); అణప వలెను = అణగించుకొన వలెను;

ఓ సుధామా! ఈ మాయా ప్రపంచములో సమయము ఎవరికి వశమై ఉండును? (ఎవ్వరి అధీనములోనూ ఉండదని భావము). ఏవిధమైన బుజ్జగింపునూ, సాకులు, వంకలు అక్కడ పనిచేయవు కదా!  దీనిని గ్రహించి, తమో (తమస్సు) మార్గాన్ని విడిచి, శాంతముతో, ఇంద్రియ నిగ్రహముతో సాధన చేయగా, మాయాంధతలు నశించి పోవునని భావము.

65. స్వానుభవ రజ్జువులచేఁ
బేనఁబడిన జీవితమును విశ్లేషింపన్
[1]స్థాణువయిన పరమాత్మము
మానసమునఁ దోఁచుఁ దత్త్వ మహిమ సుధామా!

[1] 'న-ణ' ప్రాసము ప్రయోగింప బడినది.

స్వానుభవ రజ్జువులచేన్ = స్వీయ అనుభవములు అనెడు త్రాళ్ళతో (దారములతో) ; పేనబడిన జీవితంబు = అల్లుకొనిన జీవితము; విశ్లేషింపన్ = విచారణ జరుపగా; తత్త్వ మహిమన్ = తాత్త్విక చింతనచే; స్థాణువు + అయిన = ఎచ్చటికీ కదిలిపోక స్థిరముగా నున్న; పరమాత్మము = పరమాత్మ తత్త్వము; మానసమునన్ + తోచున్ = తలపునకు వచ్చును;

ఓ సుధామా! పరమాత్మ, అనుభవైక వేద్యమే కాని, ఒకరు చెప్పగా గాని, ఒకరిని అనుసరించగా గాని, పుస్తకములలో చదువగా లభించునది గాని కాదు. కనుక, అట్టి అనుభవాలను పేర్చి జీవితములో ఏర్పడు సంఘటనలపై తాత్త్విక చింతనతో విచారణజరుపగా, కర్మఫలములనెడి పాశములు విడివడి ఆ పరమాత్మ తత్త్వము అవగాహనకు వచ్చును సుమా!

## 66. మాటికి కలుగఁగఁ గష్టము

పాటిగొనకు దుఃఖమొంది; పట్టు సడలఁగన్

సూటిగ హేతువు గనుగొనఁ

బాటిల్లును భవ్య మోక్షపదవి సుధామా!

మాటికిన్ = మాటిమాటికీ, తరచుగా; కష్టము కలుగన్ = బాధలు, కష్టాలూ కలుగుచుండగా; దుఃఖము + ఒంది = శోక భావనలను పొంది; పాటిగొనకు = లక్ష్యపెట్టకుము; సూటిగన్ = నేరుగా; హేతువున్ కనుగొనన్ = కారణమును కనుగొనగా; పట్టు సడలగన్ = మాయ యొక్క పట్టు (బిగువు) సడలి పోగా; భవ్య మోక్ష పదవి = శుభప్రదమైన మోక్షసిద్ధి; పాటిల్లును = కలుగును;

ఓ సుధామా! తరచుగా కలుగు కష్టాలు త్వరలోనే సమసిపోతాయి - సందేహము లేదు. కానీ, ఆ కష్టాలు ఎందుకు కలిగాయి అనే విషయం మాత్రం నీకు బోధ పడాలంటే రోత కలిగించుచూ నిన్ను క్రమ్మిన మాయ / వ్యామోహము / భ్రాంతి విడిచి పెట్టవలసినదే!

అలా మాయ వీగిపోగా జరిగిన సంఘటన(ల) యొక్క అసలు తత్త్వము బోధపడి నీకు నీవుగా శుభంకరమైనమోక్ష మార్గాన్ని అందుకొందువు సుమా!

**67. ఇప్పుడె కలిగిన కష్టము**
**నొప్పించును మాయ వలన న్యూనత నిడుచున్;**
**గొప్పునఁ దాల్చిన పువ్వుల**
**చొప్పున శుష్కించి జాలుఁ జూడ సుధామా!**

ఇప్పుడె కలిగిన కష్టము = కష్టము కలిగిన వెనువెంటనే; మాయ వలనన్ = మాయ కారణముగా; న్యూనతన్ + ఇడుచున్ = వెలితిని మనస్సునకు తోపజేయుచూ; నొప్పించును = బాధను, దుఃఖమును కలిగించును; కొప్పునన్ తాల్చిన = జడయందు తురుము కొనిన; పువ్వుల చొప్పునన్ = పువ్వుల దండవలె; శుష్కించి జాలున్ = ఎండిపోయి నేలపై రాలును;

ఓ సుధామా! కష్టములు కలిగినప్పుడు ఏవేవో ఆలోచనల మాయవలన దుఃఖము కలిగి వెలితి గాను, ఎదుటివారి ముందు లోకువగాను అగుపించి దుఃఖము పెల్లుబుకును. కానీ, జడలో పెట్టుకొనిన పువ్వులు ఏవిధముగా అయితే వాడి, కృశించి రాలిపోవునో, అదే విధముగా కష్టాలు ఎంతో సేపు నిలబడవు సుమా!

## 68. ఫలముల వంగిన శాఖలు

తలఁపింపవె జ్ఞానభరతఁ దగ్గిన యోగిన్?
వలదిల మాయా గర్వము
విలపింపఁగఁ జేసి నిన్నుఁ బీల్చు సుధామా!

ఫలములన్ = పండ్లతో; వంగిన శాఖలు = వంగిపోయిన కొమ్మలు; జ్ఞాన భరతన్ = జ్ఞానముయొక్క నిండుతనముతో; తగ్గిన యోగిన్ = వినయమును పొందిన యోగీశ్వరుని; తలపింపవె = జ్ఞప్తికి తెచ్చును కదా; అట్టి దృష్టాంతము (ఉదాహరణ)ను ఆధారముగా చేసికొని; మాయా గర్వము = మాయ వలన కలిగిన గర్వము; ఇలన్ = ఈ ధరలో (ఎవ్వరికినీ); వలదు = పనికి రాదు, ఉండ కూడదు; (అది ఉన్నచో) విలపింపగన్ చేసి = మిగుల దుఃఖమందునట్లు చేసి, శోకించునట్లుగా చేసి; నిన్నున్ + పీల్చున్ = నిన్ను (నీలోని సద్భావనలను) పీడించి, పీల్చి పిప్పిని చేయును

ఓ సుధామా! పండ్లతో నిండిన వృక్షశాఖలు ఏవిధముగా అయితే వంగి ఉంటాయో, జ్ఞానమును పొందిన వ్యక్తులు కూడా మిడిసిపాటు, గర్వము నశించి అణగిమెణగి ఉంటారు సుమా!

“(*భవంతి నమ్రాస్తరవః ఫలోద్గమైః* – భర్తృహరి (తరవః = వృక్షములు; ఫల + ఉద్గమైః = ఫలభారములచే; నమ్రాః భవంతి = వంగి ఉంటాయి)”

గర్వము ఎంత వారినైనా నశింప చేయగలదు. ఎంత త్వరగా ఈ విషయాన్ని (ఫలాలతో నిండిన చెట్ల కొమ్మల ఉదాహరణతోనో, లేక ఇంకే విధమైన ఉదాహరణలతో నైననూ) అర్థము చేసికొని గర్వ భావనలను తగ్గించు కొంటామో అప్పుడు శాంతి కలుగును. లేనిచో, అనేక రకాలైన దుఃఖాలతో మాయ పీడించి పిప్పి చేయును సుమా!

69. మన వశమున లేకున్న౯ ప

వనము, మరల్చి తెరచాప౯ బయనింపమె? జీ

వనమందటె దుఃఖంబొద

వ, [1]నెటులో త్వర౯ బట్టు మోక్షపథము సుధామా!

[1] సంధిగత ప్రాసము - నకారము, పై అచ్చుతో కలిసి (ఒదవన్ + ఎటులో = ఒదవనెటులో) హల్లుగా, అనగా, 'న' కారముగా ఏర్పడినది గావున, సహజ 'న' కారముతో ప్రాసము కుదిరినది.

పవనము మనవశమునన్ లేక + ఉన్నన్ = గాలి మన స్వాధీనములో లేకపోయిననూ; తెరచాపన్ మరల్చి పయనింపమె? = తెరచాపను అటు, ఇటు మరల్చి మనము (గమ్యమును చేరుకొన గలందులకై) ప్రయాణము చేయమా?; జీవనమందున్ + ఆటె = జీవితమునందు ఆవిధముగనే; దుఃఖంబు + ఒదవన్ = దుఃఖ సంఘటనలు జరిగినప్పుడు; మోక్ష పథమున్ + ఎటులో త్వరన్ + పట్టు = మోక్షమార్గమును ఉపాయముతో తొందరగా పట్టుకొనుము

ఓ సుధామా! సముద్రములో ప్రయాణము చేయు నావికులు, పవనములు ఏసమయములో ఎటునుండి వీచునో, ఎటువైపుకు మళ్ళునో ఊహించలేరు కదా! అనగా, గాలియొక్క ప్రసరణపై ఎట్టి నియంత్రణయు ఉండదు కదా! అయినప్పటికీ, తెరచాపలను అటు, ఇటు మరల్చుచూ వారు ఓడలను తమతమ గమ్యములకు చేర్చ గలుగుతారు! అదే విధముగా, జీవితములో మన వశములో లేని ఎన్ని కష్టములు, దుఃఖములూ ఎదురైనా, లేక 'క్రోధావేశములు' అను తీవ్ర కెరటములు అలజడిని కలిగించినను మోక్షమార్గము (అను తెరచాప కట్టిన నావ) పై మన గమ్యమైన పరమాత్మ తత్త్వమును చేరుకొనెదము సుమా!

70. దీప కణిక చాలు నమిత

దీపంబుల వెలయఁ జేయ; స్థిరయోగజ్ఞుం

డాపఁగ నజ్ఞానాంధతఁ,

దోఁపఁగఁ బరమాత్మ దీప్తిఁ దొడఁగు సుధామా!

దీపకణిక = అగ్గిపుల్ల; అమిత దీపంబులన్ = అధిక సంఖ్యలో నున్న దీపములను; వెలయన్ + చేయన్ = వెలిగింప గలుగుటకు; చాలున్ = సరిపోవును; స్థిరయోగజ్ఞుండు = జ్ఞానముచేత స్థిరత్వమును పొందిన జ్ఞాని; అజ్ఞాన + అంధతన్ ఆపగన్ = అజ్ఞానపు చీకటులను ఆపుటకై; పరమాత్మ దీప్తి తోపగన్ = పరమాత్మ యొక్క వెలుగులను (మన మనస్సులో) నింపుటకై; తొడగున్ = పూనుకొనును.

ఓ సుధామా! ఒకేఒక్క అగ్గిపుల్ల సహాయముతో ఏవిధముగా నయితే అనేక దీపాలను వెలిగించ గలిగెదమో, అదే విధముగా జ్ఞానాన్ని పొంది స్థిరుడైన వాడు అజ్ఞానమును పారద్రోలి, ఎంతోమందికి పరమాత్మ తత్త్వమును పరిచయముచేయ సమర్థుడగును.

71. సృష్టిఁగల మేటి సొత్తు - స
మష్టిగఁ బంచేంద్రియముల మాయఁ దగులకే
స్పష్టమగు పరమ హృత్సం
తుష్టిని - మోక్షానుభూతి - తొడరు సుధామా!

సృష్టిన్ + కల మేటి సొత్తు = ఈ సృష్టిలోని విలువగల ధనమైన; మోక్ష + అనుభూతి = పరమాత్మానంద అనుభవము; సమష్టిగన్ = ఉమ్మడిగా; పంచ + ఇంద్రియముల = కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అను 5 ఇంద్రియముల; మాయన్ + తగులకే = మాయకు చిక్కుకొని పోక; స్పష్టము + అగు = సువ్యక్తమగు; పరమ హృత్ + సంతుష్టినిన్ = పరమమునకు చేర్పబడిన హృదయముయొక్క సంతుష్టిచే; తొడరున్ = కలుగును.

ఓ సుధామా! ఇంద్రియముల (కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము -- అను పంచేంద్రియముల) మాయకు అందక కేవలమూ పరమాత్మను హృదయమందు కనుగొనుటచే తృప్తిచెందిన వాని ప్రత్యక్షజ్ఞానము వలన -- ఈ సృష్టిలోని గొప్ప సొత్తు అయిన మోక్షము లభించును సుమా!

## 72. సామాన్యుని కష్టంబులు

ప్రామాణికుఁ గాఁగఁజేయు పరిణతియె సుమీ!

సోమరివై గిఱి యందునె

సేమంబుగ నుండఁగోరి చెడకు సుధామా!

సామాన్యుని = సాధారణ మానవునికి కలుగు; కష్టంబులు = బాధలు అనునవి; ప్రామాణికున్ + కాగన్ + చేయు = ప్రత్యక్ష జ్ఞానము నెఱిగిన వానిగా చేయు; పరిణతియె సుమీ = పరిపాకమే సుమా; సోమరివి + ఐ = అలసత్వము కలవాడవై; గిరియందునె = స్వయముగా గీసికొనిన గిరియందునే (అనగా, కూపస్థ మండూకము వలె); ఉండన్ + కోరి చెడకు = ఉండిపోవాలి అని భావించి చేటును కొనితెచ్చికొనవద్దు

ఓ సుధామా! కష్టాలు అనునవి సాధారణ మానవులను కూడా ప్రత్యక్ష జ్ఞానము తెలిసికొను వానివలె సమర్థునిగా చేయగలవు. కనుక, సోమరితనముతో నూతిలోని కప్పవలె, అచ్చటనే స్థిరపడి పోవుదమని కోరుకోవద్దు. అట్టి లక్షణము నిన్ను అప్రయోజకునిగా చేసి చేటు కలిగించును సుమా!

73. నలుగురు నడచిన పథమున

సులభంబుగఁ నేఁగఁ గలము - శోధింపంగన్

ఫల సహిత వృక్ష మొకటియు

నలవినిఁ గనుగొనఁగఁ జాల మచట సుధామా!

నలుగురు నడచిన పథమునన్ = సదా మానవులు రాకపోకలు సాగించు మార్గములో; సులభంబుగన్ + ఏగన్ + కలము = అనాయాసముగా మనము కూడా పయనింప గలుగుతాము; శోధింపంగన్ = ఆలోచించి చూడగా, జాగ్రత్తగా గమనింపగా; ఫల సహిత వృక్షము + ఒకటియున్ = (యాత్రికులకు ఆకలి, దప్పుల తీర్చగలుగు) చక్కని రసవంతములైన పండ్లతో ఒప్పెడు ఒక్కచెట్టు అయిననూ; అలవినిన్ = సులభముగా; అచటన్ = ఆ మార్గములో; కనుగొనగన్ + చాలము = చూడలేము

ఓ సుధామా! నలుగురూ నడచిన మార్గములో నడిస్తే - ఆపదలు, అరిష్టాలూ తగ్గునేమో కానీ, ఆలోచించి చూస్తే, ఆ దారిలో ఫలాలతో నిండిన చెట్లను చూడ గలమా? (చూడలేమని భావము). అనగా, మనకంటే ముందు ఆ మార్గములో నడిచిన వారు ఫలాలను కోసికొని యుందురు! అదే విధముగా, ఏ సత్కార్యము తలపెట్టినను, క్రొత్త పుంతలు త్రొక్కినచో ఫలితాన్ని శీఘ్రముగా గ్రహించి వెనుక వచ్చువారికి పంచగలమని భావము! నలుగురును నడయాడిన త్రోవను పోయినచో ఫలితము ఆలస్యముగా అందును, ఇతరులకు పంచుటయు కుదరనిదే అగును సుమా! అందువలననే కాబోలు, పరిశోధకులు ఎప్పటి కప్పుడు క్రొత్తను కనుగొనవలెనని తాపత్రయ పడెదరు! (పై పద్యములో 'శోధింపంగన్' అని ప్రయోగించుటలోని ఉద్దేశ్యమును అదే!)

ఈ క్రింది కఠోపనిషత్ – ప్రథమోధ్యాయ ద్వితీయ వల్లి లోని 5వ మంత్రమును చూడుడు.

*అవిద్యాయా మంతరే వర్తమానాః। స్వయం ధీరాః పండితమ్మన్యమానాః॥*

*దంద్రమ్యమాణాః పరియన్తి మూఢా। అంధేనైవ నీయమానా యథాంధాః ॥*

(స్వయం ధీరాః = స్వయముగా ధీరులైనవారు కూడా; మూఢా = మూఢత్వముచేత; అవిద్యాయాం అంతరే వర్తమానాః = అజ్ఞాన మార్గమునందు పయనించువారై; పండితం మన్యమానాః = పండితులముగా భావించుకొనుచూ; దంద్రమ్యమాణాః = అవక తవక పోకడలను పట్టుకొనుచు; అంధేన = గ్రుడ్డివానిచేత; నీయమానాః = తీసికొని పోబడుచున్న; అంధా యథా = గ్రుడ్డివారివలే; పరియంతి = నాశమును పొందుచున్నారు!)

74. తలఁతుము ధనముల నొందఁగఁ
దలఁతుము విపులంబగు ప్రణుతమ్ముల గొనఁగాన్
దలఁపులఁ గలిగెడు కోరిక
తలవంపులు కలుగఁ జేయుఁ దలఁప సుధామా!

ధనములన్ + ఒందగన్ = ధనములను, సిరి సంపదలను ఆర్జించ వలెనని; తలతుము = (ఈ మాయా ప్రపంచములో భ్రాంత మనస్కులమై) ఆలోచనలు చేయుచుందుము; విపులంబు + అగు = విస్తారమైన; ప్రణుతమ్ములన్ = పేరుప్రఖ్యాతులను (గౌరవ మర్యాదలను); కొనగాన్ తలతుము = అందుకొన వలెనను ఆలోచనలను కూడ చేయుచుందుము; తలపులన్ = ఆలోచనలందు ఆవిధముగా; కలిగెడు = కలుగునట్టి; కోరిక = ఇచ్ఛ; తలపన్ = అలోచించి చూడగా; తలవంపులన్ = అవమానమును; కలుగన్ + చేయున్ = (మనకు ఫలముగా) అందజేయును

ఓ సుధామా! మానవులు - తాము ధనవంతులము కావలెనని, నలుగురును ఎంతో గొప్పగా మెచ్చుకొను పనులు చేయవలెననియు కోరుకొందురు! కోరిక అనగానే, అది బంధమే అవుతుంది. దేనిని కోరుకొనుచున్నామో దానికి వ్యతిరేకమైన ఫలితమును కలిగినచో, అట్టి కోరిక సమాజమందు పరాభవమును కలుగ జేయును.

75. ఎందుకు జీవింప వలెనొ

కొందఱి కైనను దెలియును; గురువులు నియతిస్

అందఱ కెట్టులనొ తెలిపి

కొందురు మన్ననలఁ - దెలిసి కొనుము సుధామా!

ఎందుకుస్ జీవింపస్ + వలెనొ = మనకు కలిగిన ఈ మానవ జన్మను ఎందుకు సాగించ వలెనో; కొందరికిస్ అయినను = కొద్దిమందికి అయిననూ; తెలియును = అవగాహన అగును; గురువులు = సద్గురువులు; నియతిస్ = నియమ నిష్ఠలతో; అందరకుస్ + ఎట్టులనొ తెలిపి = ఈ సంఘములోని వ్యక్తులందరకు (చెప్పవలసిన విధముగా) జీవన విధానమును శ్రమపడి తెలియ చెప్పి; మన్ననలస్ + కొందురు = గౌరవములను అందుకొందురు

ఓ సుధామా! "మానవజన్మ మనకు ఎందులకు కలిగినది -- దీని రహస్యమేమి" అను ప్రశ్నలకు సమాధానములు కొందరికి మాత్రమే అర్థమగును. అట్టివారు మిగిలిన వారికి ఆ రహస్యమును బోధించి గురువులై మన్ననలను పొందెదరు సుమా! కావున, సద్గురువుల నాశ్రయించి కర్తవ్యము నెరుగవలెను

పై పద్యానికి స్ఫూర్తి -- *He who has a 'why' to live for can bear almost any 'how'.*
*~~~ Friedrich Nietzsche (German Scholar, Writer, Philosopher).*

"*ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వ దర్శినః*" (తత్త్వము నెరిగిన జ్ఞానులు ఇతరులకు ఆ జ్ఞానమును ఉపదేశింతురు) - అను గీతావాక్యమునిట సమన్వయించు కొనవలెను.

76. సంకల్పించుచు మనుజుం

డుంకింపఁగ జీవఫలము నొందుట కొఱకై

శంకింపక, జాగొందక

యంకించును సఫలతలఁ బరాత్మ సుధామా!

మనుజుండు = మానవుడు; జీవఫలమున్ + ఒందుట కొఱకు + ఐ = జీవిత ప్రయోజనము సాధించుట కొరకు; సంకల్పించుచున్ = సత్సంకల్పములు చేయుచూ; శంకింపక = సంకోచమును వీడి; ఉంకింపగన్ = పూనుకొనగా; పరాత్మ = పరమాత్మ తత్త్వము; జాగు + ఒందక = ఆలస్యము చేయక (వెంటనే); సఫలతలన్ = ఆ సంకల్పించిన కార్యములకు గొప్ప ఫలితములను; అంకించును = కలుగజేయును

ఓ సుధామా! జీవన ప్రయోజము సిద్ధించుటకై మానవులు శక్తితో, శ్రద్ధతో, సామర్థ్యముతో సంకల్పించగా, వారి కోరికలను, సంకల్పములను మన్నించుచూ పరమాత్మ తత్త్వము కార్య సఫలతను ఎట్టి ఆలస్యము, అడ్డు లేకుండు విధముగా కలుగచేయును సుమా!

77. ఉప్పెనఁ బోలు నభీష్టము

లెప్పటి కీడేరు నంచు నేఁకటఁ బడుచున్

గుప్పగఁ గూలును నరుఁడిలఁ

జొప్పింపక పరము నందుఁ జూడ్కి సుధామా!

ఉప్పెనన్ పోలు = పెద్ద సముద్రపు పొంగు వెలె ముంపునకు గురి చేయు; అభీష్టములు = కోరికలు; ఎప్పటికిన్ = ఏ నాటికి; ఈడేరును + అంచున్ = తీరునో కదా అని తలచుచూ; ఏకటన్ పడుచున్ = వాచిపోవుచు (తగని అపేక్ష పొందుచు); చూడ్కిన్ = చూపులను; పరము నందున్ చొప్పింపక = పరమాత్మ యందు నిలుప లేక; నరుడు + ఇలన్ = మానవుడు ఈ మాయా ప్రపంచములో; కుప్పగన్ + కూలున్ = కూలబడును;

ఓ సుధామా! మానవులు పరమాత్మ తత్త్వముపై మనసును నిలుపలేక, ముసరుకొను కోరికలు తీరే మార్గమేమీ అగుపించక, ఆ కోరికలు ఎప్పటికి తీరునొ తెలియక నిరుత్సాహముతో చతికిలపడి పోవుచుందురు. ఆవిధముగా, పరమాత్మను గాంచు సక్రమ పథములోనికి నడువలేక నష్టపోవుచున్నారు సుమా!

78. అసమ [1]ప్రతిభను సప్త

వ్యసనమ్ములఁ బాఱఁద్రోలి యనిమిత్తికమై

యెసఁగిన బ్రహ్మాసక్తినిఁ

బ్రసన్నతను బొంది జ్ఞాని వరలు సుధామా!

[1]"*స్వభావాచరణాభ్యాస యోగాదృష్టో పపాదితాం, విశిష్టోపహితాం చేతి ప్రతిభాం షడ్విధాం విదుః*" = "స్వభావ ఉపపాదిత, ఆచరణ ఉపపాదిత, ఆభ్యాస ఉపపాదిత, యోగ ఉపపాదిత, అదృష్ట ఉపపాదిత, విశిష్ట ఉపహిత" మను 6 విధములైన ప్రతిభలు కలవని పెద్దలండ్రు!"

అసమప్రతిభను = దీటురాని గొప్ప ప్రతిభతో; సప్త వ్యసనమ్ములన్ = 7 వ్యసనములను (దుష్ట వ్యాపారములను మరల మరల చేయు దురాలోచనను); పారన్ + త్రోలి = వదల గొట్టుకొని; అనిమిత్తికము + ఐ = అసంకలిపతముగా (అప్రయతనముగా); ఎసగిన = పెంపొందిన; బ్రహ్మ + ఆసక్తిన్ = పరమాత్మ తత్త్వమును చేరుకొన వలెనను కుతూహలముతో; ప్రసన్నతన్ + పొంది = ప్రశాంతిని పొంది; జ్ఞాని = మోక్షమార్గ గామి (మోక్షమార్గమునందు చరించు ప్రజ్ఞానమును పొందిన యోగి పుంగవుడు); వరలున్ = ప్రకాశించును, శోభిల్లును;

ఓ సుధామా! (*జూదము, మద్యము, శృంగారము, వేట, వాక్పారుష్యము, అకారణ ధనవ్యయము, దండ పారుష్యము* అను) సప్త (7) మహావ్యసనములను, అట్టి దుష్ట వ్యాపారములను మరల మరల చేయు దురాలోచనలను అప్రయతనముగా దరిజేర నీయక, ప్రతిభతో పరమాత్మ యందు గొప్ప ఆసక్తిని పెంపొందించుకొని ప్రశాంత చిత్తముతో (మోక్షమార్గ గామి) మోక్షమార్గమునందు చరించు ప్రజ్ఞానమును పొందిన యోగిపుంగవుడు జగమున గౌరవింప బడుచు శోభిల్లును సుమా!

79. శశివదనపు శిశువును గనఁ

[1]గృశియింపఁగ మాయ - పెద్ద, వృద్ధినిఁ దలఁపన్

వశమై విశ్వాత్మ మతనిఁ

బ్రశాంత చిత్తు నొనరించి ప్రబలు సుధామా!

[1]ఋుత్వ సామ్య యతి - 'ఋ' కార సంబంధ సమత్వముగల ఏ హల్లుకైనను, ఏ హల్లుతో నైనను యతిమైత్రి చెల్లును. ఇక్కడ 'కృ', 'వృ' లకు ('ఋ' కార సంబంధము అను సామ్యము ఉన్నది కావున) యతిమైత్రి.

శశివదనము + శిశువునున్ = చంద్రబింబాకారములో నున్న ముఖము కలిగిన చంటి పాపను; కనన్ = చూడగా; మాయ కృశియింపగన్ = చుట్టుకొనిన మాయయొక్క ఆవరణము తొలగగా; పెద్ద = ఒకానొక పెద్ద [విశేషణముగా కాక నామవాచాకమైన 'పెద్ద']; వృద్ధినిన్ తలపన్ = అభివృద్ధిని, పురోగతిని గురించిన ఆలోచనలు చేయగా; విశ్వ + ఆత్మము = విశ్వమంతటను పరచుకొనిన పరమాత్మ తత్త్వము; వశము + ఐ = ఆ విధముగా తలచుకొను వృద్ధునకు లొంగి; అతనిన్ = ఆ పెద్దను,వృద్ధుని; ప్రశాంత చిత్తున్ = శాంతిని పొందిన మనస్సు కలవానిగా; ఒనరించి = చేసి; కావించి; ప్రబలున్ = వర్ధిల్లును, అతిశయించును, వృద్ధిచెందును, ప్రకాశించును;

ఓ సుధామా! పెద్దలు, వృద్ధులు - చంటిపాపలతో, పసికూనలతో ఆడుటకు 'ఎందుకు ఇష్ట పడతారు?', అనగా, "వారికి తాత్కాలికముగా చింతలు తొలగి, ఒకానొక అనిర్వచనీయమైన ఆత్మీయతాభివృద్ధి భావన తోచుట వల్ల" అని సమాధానము. అట్టి స్థితిలో ఉన్న పెద్దకు విశ్వాత్మము అవలీలగా వశమై అజ్ఞానాన్ని అంతము చేయునట్టి చైతన్య వంతునిగా చేయును సుమా!

80. కర్తవ్యము పాలింపక

ధూర్తతఁ బచరించు జనుల దోషము లెల్లన్

గుర్తుగఁ దలఁపులఁ జొన్పుచు

నర్తింపఁగ మోహమాయ నడుపు సుధామా!

గమనిక: "*Work is worship - duty is God*" -- అను పలుకు బడిని వివరించి చెప్పిన పద్యమిది!

కర్తవ్యమున్ = చేయవలసిన పనులను, తమకు ఒప్పగింప బడిన పనులను, తాము చేయుదమని అంగీకరించిన పనులను; పాలింపక = చేయక; ధూర్తతన్ = దుర్వర్తనమును; పచరించు = ప్రదర్శించు; జనుల = మానవుల యొక్క; దోషములు + ఎల్లన్ = తప్పులన్నింటినీ, వారు చేసిన అకృత్యపు పనుల, ఆలోచనల యొక్క ఫలితములను; మోహమాయ = వారికి వ్యామోహమును కలిగించిన మాయ; గుర్తుగన్ = స్మృతిచిహ్నముగా; తలపులన్ = వారి వారి ఆలోచనలలో; చొన్పుచున్ = నింపుచు; నర్తింపగన్ నడుపున్ = తన చెప్పుచేతలలో, కనుసన్నలలో నాట్యమాడునట్లుగా [*Dancing to the tune of Maya*], కట్టడి చేయును;

ఓ సుధామా! తమ కర్తవ్యాన్ని (అనగా, "*duty*"ని - చేయవలసిన పనులను, తమకు ఒప్పగింప బడిన పనులను, తాము చేయుదమని అంగీకరించిన పనులను) నిర్వర్తించక, ధూర్త కృత్యాలను (లంచాలను ఇవ్వడమో, పుచ్చుకోవడమో, కావలసిన వారితో ఒకవిధమైన వ్యవహారము - పరులతో వేరొక విధమైన వ్యవహారము నడిపించుట, మొదలైన దుర్మార్గపు పనులను) చేయు వారికి వారి చెంతనే ఉన్న మోహమాయ, ఆయా తప్పులను, భయాలను వారి మనస్సులపై స్మృతిచిహ్నముగా ముద్రించి తన చెప్పుచేతలలో నాట్యమాడునట్లుగా చేయును సుమా!

అనగా, కర్తవ్య నిర్వహణ చేయ జాలని మానవులకు ప్రశాంతత ఉండదు. ధూర్తత వీడి మోక్షమార్గాన్వేషణము చేయువాడు నిజమైన కర్తవ్యపాలకుడు అని భావము!

## 81. ఆదర్శ స్వచ్ఛతనిల

వాదంబులఁ ద్రోసిపుచ్చ, బ్రహ్మాండంబున్

ఆదర్శింపగఁ జేయుచు

హ్లాదం బొడగూర్చు నాత్మమంత సుధామా!

ఆదర్శ స్వచ్ఛతన్ = అద్దము వంటి మానసిక స్వచ్ఛతతో; ఇలన్ = ఈ మాయా సంసారము నందు; వాదంబులన్ + త్రోసిపుచ్చన్ + అంతన్ = వాదోపవాదములను నివారించిన వెనువెంటనే; ఆత్మ = పరమాత్మ తత్త్వము తన; బ్రహ్మ+అండంబున్ = విశ్వమంతనూ; ఆదర్శింపగన్ + చేయుచున్ = కన్పింప చేయుచూ (అనగా, తన విశ్వరూపమును చూపుచూ); హ్లాదంబు + ఒడగూర్చున్ = మహానంద భరితునిగా చేయును;

ఓ సుధామా! ఆదర్శ వంతమైన జీవితముతో (అద్దము వంటి మానసిక స్వచ్ఛతతో), వాదప్రతివాదాలను (తర్క-వితర్కాలను) విడిచి పెట్టిన ఈ మాయా సంసారములోని నరులకు, పరమాత్మ తత్త్వము -- తన "విశ్వ రూపము"ను దర్శింప చేసి పరమానందమును కలిగించును సుమా!

82. సౌకర్యార్థము వసతులఁ

జేకూర్చుకొనిరి మనుజులు; చింతలు తొలఁగన్

ఏకాత్మతత్త్వ మొందుచుఁ

గాకొనరింపుము విషయపు గబ్బు సుధామా!

సౌకర్య + అర్థము = వెసులుబాటు కొఱకు; వసతులన్ = జీవన సదుపాయములను; చేకూర్చుకొనిరి = ఏర్పాటు చేసికొనిరి; చింతలు తొలగన్ = (గతకాలపు) దుష్ట ఆలోచనలు తొలగిపోవాలంటే; ఏకాత్మ తత్త్వము = విశ్వాత్మ తత్త్వము; ఒందుచున్ = పొందుచూ, అందుకొనుచూ; విషయము + గబ్బున్ = విషయముల యొక్క (కంపు/గబ్బు) వాసనలను; కాకు + ఒనరింపుము = తిరస్కరింపుము

ఓ సుధామా! మానవులు సంఘములో నుండుటకు వీలుగా ఎన్నో సదుపాయాలూ, సౌకర్యాలు ఏర్పాటు చేసికొనిరి. అంతియే కాని, ఆ సదుపాయాలపై, సౌకర్యాలపై పూర్తిగా అధారపడి, అట్టి సదుపాయములు లేనిచో జీవనము దుర్భరమను ఆలోచనలు చేయుట ఉచితము కాదు, వ్యాఖ్యలు చేయుటయూ అవశ్యము కాదు! అట్టి చింతలు నశింపు పొందుటకై, విశ్వాత్మ తత్త్వమును లేక ఏకాత్మ తత్త్వమును అనుసరించుచూ, విషయ వాసనలను వదిలించు కొనవలెను సుమా!

## 83. విడిపోయిన దేదైనను

బడకుము దుఃఖమున; వెదుకఁ బ్రారంభింపన్

గడు వసతుల నిడి పరమము

విడఁజాలని హర్షమొసఁగుఁ బేర్మి సుధామా!

విడిపోయినది + ఏది + ఐనను = మనలను వీడి ఏది పోయినప్పటికీ; దుఃఖమునన్ పడకుము = బాధపడవలదు, దుఃఖింప వలదు; వెదుకన్ + ప్రారంభింపన్ = ఈ సంసార బంధములను త్రెంచు మార్గమును వెదుక దలచినచో; పరమము = పరమాత్మ తత్త్వము; కడున్ వసతులన్ + ఇడి = పెక్కు సదుపాయములను అందించి; పేర్మిన్ = అధికముగా; విడన్ + చాలని = విడివడని (శాశ్వతమైన); హర్షము + ఒసగున్ = ఆనందమును నీకు అందించును

ఓ సుధామా! మనుషులు విడిపోయినా, మనసులు విడిపోయినా, లేక మనము ఇష్టపడే వస్తువులు, జంతువులు విడిపోయినా మనస్సుకు కష్టము తోచి, బాధ, దుఃఖము వంటివి కలుగును! అటువంటి సమయములలోనే, సహనము నలవరచుకొని మోక్షపథ ప్రస్థానమును ప్రారంభింపగా, ఆ మార్గ గమనమున ఎన్నో సదుపాయాలను సమకూర్చి పరమాత్మ తత్త్వము గొప్ప ఆనందాన్ని అందించగలదు సుమా!

84. గతము గఱపు పాఠం బా
తతమై భవితవ్య మిడును; ధైర్య పథ విని
ర్జిత మానస మవధానముఁ
బ్రతిష్ఠిత మొనర్చి కూర్చుఁ బ్రగతి సుధామా!

గతము గఱపు పాఠంబు= అతీతము (గడచి పోయిన కాలము) మనకు నేర్పిన పాఠము; ఆతతము + ఐ = విరివిగా అయి; భవితవ్యము + ఇడును = శుభములను చేకూర్చును (కాగల దానిని నిర్దేశించి కర్తవ్యమును తెలుపును); ధైర్య పథ = ధైర్యమను మార్గమును పట్టుటచే, వినిర్జిత మానసము = జయింపబడిన మనస్సు; అవధానముస్ = ఏకాగ్రతను; బ్రతిష్ఠితము + ఒనర్చి = శాశ్వతముగా స్థిరపడునట్లు చేసి; ప్రగతిస్ కూర్చుస్ = పురోభివృద్ధిని చేకూర్చును;

ఓ సుధామా! మనస్సుపై పట్టు సాధించి, ఏకాగ్రతను (బుద్ధి చెదరనీయక పెక్కువిషయములను ధారణచేయు శక్తిని) శాశ్వతముగా ప్రతిష్ఠ చేసికొను ధైర్యము కలిగిన మానవులకు, గతించిన కాలములో (అనుభవముల ద్వారా) నేర్చుకొనిన పాఠములు రాబోవుకాలమున శుభములను కలుగ జేయును సుమా!

అనగా, గతములోని జయములకు గర్వింపక, అపజయములకు దిగులు చెందక, మనస్సును దిటవు పరచుకొని, ఏకాగ్ర బుద్ధితో, ధైర్యముతో ముందుకు సాగవలెనని భావము.

85. వ్యక్తిత్వము ప్రస్ఫుటమగు
యుక్తంబుగ నాడుమాట; నొరు చేష్టలచేన్
వక్తవ్యము మార్చుకొను ప్ర
సక్తిఁ గొనక పరముఁ గూడ శాంతి సుధామా!

యుక్తంబుగన్ = ఒప్పిదముగా; ఆడుమాటన్ = పలికెడు మాటచేత; వ్యక్తిత్వము = మానవుని యొక్క స్వభావము / నైజము; ప్రస్ఫుటము + అగున్ = మిక్కిలి స్పష్టమగును; ఒరుచేష్టల చేన్ = ఇతరుల నడవడిని అనుసరించుట వలన; వక్తవ్యమున్ = మాట తీరును; మార్చుకొను ప్రసక్తిన్ కొనక = మార్చుకొను ప్రస్తావనను దరికి రానీయక; పరమున్ కూడన్ = పరమాత్మ తత్త్వమందు రమించగా; శాంతి = ప్రశాంతి (కలుగును).

ఓ సుధామా! మనము నలుగురతో చేయు సంభాషణ మన వ్యక్తిత్వమును స్పష్టము చేయగలదు. ఇతరులు చేయు పనులు, పలుకు మాటల వలన (అనగా, ఇతరుల వ్యక్తిత్వము వలన) నీ మాటతీరును (నీ వ్యక్తిత్వమును) మార్చుకొను ప్రయత్నము చేయక, స్థిరుడవై, శాంతముతో పరమాత్మ తత్త్వమును చేరుకొనుము.

86. పరవశ చింతల మనమం
దొరవడి దిద్దంగ లేము; యోగి కఱపులన్
బరమము దెసకు మఱల్పఁగ
గురుతరమౌ గుండె దిటవు గొల్పు సుధామా!

పరవశ చింతల మనమందున్ = వశము తప్పిన ఆలోచనలతో కూడిన మనస్సునందు లేక ఇతరుల ఉద్దేశ్యము ప్రకారము చేయు చింతలతో కూడిన మనస్సునందు; ఒరవడిన్ + దిద్దంగన్ + లేము = ఒక విధానము, పద్ధతిని తీసికొని రాలేము; యోగి = జ్ఞాని; కఱపులన్ = శాంతి వచనాలతో; పరమము దెసకున్ మరల్పగన్ = (మనస్సును) పరమాత్మ దిక్కుగా మరల్చగా; గురుతరము + ఔ + గుండె = గొప్పదైన హృదయము; దిటవున్ + కొల్పున్ = బలమును (దార్ఢ్యమును) కలిగించును.

ఓ సుధామా! వశము తప్పిన ఆలోచనలతో కూడిన మనస్సుకు ఊరటను కల్పించ లేము. కాగా, యోగులు రకరకాలుగా ఉపదేశించిన పద్ధతుల ప్రకారము, మనస్సును వశములోనికి వచ్చునట్లు చేయగా, హృదయము గొప్ప నిబ్బరమును, ఊరటను కల్పింప గలదు. అనగా, ముందుగా మనస్సును శాంతింప చేయుట ఎంతయో ముఖ్యము సుమా!

87. మంగల మందెగిరి పడు టె

ఱుంగు చణక మెటుల వ్రయ్యలు పఱపు దానిస్?

సంగత మాయ బ్రతుకు క్షణ

భంగురమని తలఁప లేము భ్రమల సుధామా!

మంగలమందుస్ + ఎగిరి పడెడు = మంగాలము (బాణలి) లో వేచబడు; చణకము = శనగ దినుసు; దానిస్ = ఆమంగలమును; ఎటుల వ్రయ్యలు పఱపుస్ = ఏవిధముగా బ్రద్దలు కొట్టును? సంగత మాయస్ = మాయయొక్క సాంగత్యములో; భ్రమలస్ = భ్రాంతివలన; బ్రతుకు = జీవనము; క్షణభంగురము + అని = అంతలోనే ముగిసిపోవును అని; తలపస్ లేము = ఆలోచింప లేము

ఓ సుధామా! వేడిగా కాల్చిన మంగలము నందు శనగ గింజలు ఎగిరెగిరి పడును. అదే విధముగా, మొక్కజొన్నల నుండి *'పాప్ కార్న్'* తయ్యారుచేయు సమయముల యందు ఆ జొన్నగింజలు ఎగిరెగిరి పడును. ఆ దృశ్యము ఎటులున్నదనిన, బాణలిని బ్రద్దలు కొట్టుటకై ఆ శనగ గింజలు ఎగురు చున్నవా అన్నట్లున్నదట! [*ఉత్ప్రేక్షా లంకారము*].

అటులెగిరి పడుచూ, బాణలిని బ్రద్దలుకొట్టదలచు శనగగింజ ఎంత సఫలతను పొందగలదో, ఈ మాయా సంసారము నందు భ్రాంతులమై జీవించు మనము కూడా ఈ మాయను ఛేదించుటలో అంతియే సాఫల్యమును పొందగలము సుమా! [అనగా, అది సంభవము కాని పని అని భావము]

88. ఉన్నది మఱుజన్మ మనుచు
నెన్నియొ వ్యాఖ్యల నొనర్ప నేమి ఫలంబౌ?
మిన్నగ నువ్విళులూరుచు
సన్నిధి సేయు పరము దెసఁ జనక సుధామా!

మిన్నగన్ + ఉవ్విళులూరుచున్ = శ్రేష్ఠమైన రీతిలో అమితమైన ఆసక్తితో; సన్నిధి + చేయు = తన సాన్నిధ్యమును అందించు; పరము దెసన్ + చనక = పరమాత్మ దిక్కుగా (దిశగా) వెళ్ళక; మరుజన్మము ఉన్నది అనుచున్, ఎన్నెనో వ్యాఖ్యలను చేయన్, ఏమి ఫలంబు + ఔన్? = రేపు, మాపు అని చెప్పుచూ సాధనను మరుజన్మకు వాయిదా వేయుట ఎంత ప్రయోజనకరము?

ఓ సుధామా! గొప్ప శ్రేష్ఠమైన రీతిలో తన సాన్నిధ్యమును అందించు పరమాత్మ దిశగా పయనింపక, మానవులు మరోజన్మలో మోక్షాన్ని పొందుదాములే అని తలచినచో ఫలితమే విధముగా కలుగును? (కలుగదని భావము)! ఈ జన్మలో మనస్సును వశము చేసికొన జాలని వానికి మరొక జన్మలో, ఆ మనస్సు ఏవిధముగా వశము కాగలదు? అనగా, ఎప్పటి కైననూ శ్రమకోర్చి మానసమును వశము చేసికొనుట తప్పనిసరి అగును.

"పరమాత్మ తత్త్వము మానవులకు మోక్షమును అందజేయుటకు తహతహలాడును" అను కల్పన ఈ పద్యమున చేయుట జరిగినది. (నిజమునకు, పరమాత్మ తత్త్వము సాక్షిభూతమై ఉండును కానీ, ఎట్టి వికారములకూ లోనుకాదు. అందరికి కూడ, అనగా, తెలియ గోరువారికిని, తెలియ గోరని వారికిని కూడ, అందుబాటులోనే ఉండును).

89. శ్రమమునఁ గలిగిన జయము ల
ణిమాది సిద్ధులనుకొంద్రు నేరక మనుజుల్;
క్షమ నసలు శక్తిగ నెఱిఁగి
రమియింతురు పరమమున నరక్తి సుధామా!

మనుజుల్ = మానవులు; నేరక = నిజమును గ్రహించ లేక; శ్రమమునస్ కలిగిన జయములు = కఠోర పరిశ్రమ చేయుట ద్వారా కలిగిన విజయములను; అణిమ + ఆది సిద్ధులు + అనుకొంద్రు = అణిమ, గరిమ మొదలైన (అష్ట) సిద్ధులు కలిగినవని భ్రమింతురు; క్షమస్ + అసలు శక్తిగస్ + ఎఱిగి = క్షమా గుణమే (ఓర్పే) అసలైన శక్తి, అని అవగాహన చేసికొని; అరక్తిస్ = (ఈ మాయా సంసారమునందు) కోరిక నశించి; పరమమునస్ = పరమాత్మ తత్త్వమునందు; రమియింతురు = లీనమైన మనస్సు కలవారుగా అయ్యెదరు;

ఓ సుధామా! మానవులు గొప్ప సాధన, కఠోర పరిశ్రమ చేసి వానికి ఫలితముగా కలిగిన విజయాలకు తామే ఆశ్చర్యచకితులై తమకు (*అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనెడు అష్ట*) సిద్ధులు సంక్రమిం చినట్లుగా భ్రాంతులగుచుందురు. కానీ, తితిక్ష (ఓర్చుకొనుట) యొకటే 'నిజమైన శక్తి' అని గహించిన వారు, పరమాత్మ తత్త్వములో సదా నిమగ్నులగుదురు సుమా!

## 90. వేదప్రామాణికతను

వాదమ్ముల నిల్పలేము; ఫలితము గలుగన్

భేదించు వారికైనను

నాదరణను మనసు మార్పనగును సుధామా!

వేద ప్రామాణికతన్ = వేదములచే నిరూపింపబడిన పరమాత్మ తత్త్వమును; వాదంబులన్ = వాద ప్రతివాదములను జరుపుట ద్వారా; నిల్పలేము = స్థిర పరచ లేము, అర్థమగునట్లు వివరింప లేము! ఫలితము కలుగన్ = వేద ప్రామాణికత స్థిరప డుటకై; భేదించు వారికిన్ + అయిననూ = మనము నమ్మిన ఈ వేదాంతమును నమ్మక తనకు తానుగా ఏదేని ఇతరమైన తాత్త్వికతను పొందిన వారికి కూడా వేద ప్రామాణికతను తెలియ చేయవలెనన్నచో; ఆదరణన్ = గొప్ప సౌజన్యము, సౌహార్దము, సహానుభూతి, సన్మానము ఇత్యాది పద్ధతుల ద్వారా గౌరవించి; మనసు మార్పన్ + అగును = ఎదురు వాదింప బూనువాని మనస్సును మార్చ వీలగును.

ఓ సుధామా! వేదములు ప్రమాణములని వాదనల ద్వారా నిర్ధారింప నెంచినచో విపరీత పరిణామము కలుగవచ్చును. కానీ, ఎంతో విభేదించు విషయమునైనను, గౌరవ మర్యాదలు, మన్నన, ఆదరణములతో చెప్పగా, భావమును చక్కగా అన్యుల మనస్సులకు చేర్చ గలిగెదము సుమా!

"*నైషాతర్కేణ మతిరాపనేయా*" (కఠోపనిషత్)- "తర్కము ద్వారా ఈ బుద్ధిని తొలగింప (ఖండింప) జాలము". "*వాదో నావలంబ్యః*" (నారద భక్తిసూత్రములు) - ఈ విషయమున వాదవివాదములు అనవసరము. ఈ రెండును పైన చెప్పిన విషయమునే సమర్థించుచున్నవి.

91. మంట లెగయునొకో కట్టెల
నంటిన గూఢాగ్ని తైల మంటింపనిచో?
అంటఁదఱుము తలఁపు లెడలఁ
దంట తొలఁగి యాత్మ కదురుఁ ద్వరగ సుధామా!

తైలము + అంటింపనిచోన్ = (కిరోసిన్ వంటి) నూనెలను అంటించక పోయినచో; కట్టెలన్ + అంటిన గూఢాగ్నిన్ = కట్టెలలో దాగియున్న అగ్నినుండి (*పంచమ్యార్థమున ద్వితీయా విభక్తి*); మంటలు ఎగయున్ + ఒకో = మంటలు బయల్వెడలునా? అంటన్ + తఱుము = వెంబడించు; తలపులు + ఎడలన్ = ఆలోచనలు తొలగి పోగా; తంట = మోసము, కలహము, కష్టము; తొలగి = తొలగిపోయి, నశించి, త్వరగన్ = వేగముగా; ఆత్మ కదురున్ = పరమాత్మ అనుభవమునకు వచ్చును.

ఓ సుధామా! ఏవిధముగా అయితే కిరోసిన్ వంటి నూనెలను అంటించక పోయినచో కట్టెలలో పూర్వమే నిక్షిప్తమయిన అగ్ని బయట పడక కట్టెలలోనే ప్రశాంతముగా ఒదిగి ఉండునో, అదే విధముగా, ఆలోచనలు అణగారి పోయినచో, ప్రాణుల హృదయాలలో ఆత్మ అతిశయించును సుమా!

అనగా, మానవులకు కలుగు ఆలోచనలే వారి మనస్సులను కలవర పరచును. ఏ క్షణమున ఆలోచనలు అణగిపోయి నిలువబడునో, ఆక్షణమున, ఎట్టి ప్రయత్నము చేయ కుండగనే తాపము నశించి మానవులు శాంతులు కాగలరు సుమా!

**92. మానవులకు బంధనలిడి**

**బానిసలుగఁ జేయు మనము - ప్రాపంచికమై!**

**వానినె యొప్పరికింపగ**

**హానితొలఁగి హాయిగొలుపు నదియె సుధామా!**

మనము = మనస్సు; ప్రాపంచికము + ఐ = బాహ్యమున నున్న ప్రపంచములో తిరుగాడునట్టిదై; మానవులకున్ = మానవులకు; బంధనలు + ఇడి = బంధన భావనలు కలిగించి; బానిసలుగన్ + చేయున్ = తన బానిసలుగా చేసికొనును; వానినె = ప్రాపంచికమైన విషయములనే; ఒప్పరికింపగన్ = ఉపేక్షింపగా, లెక్కింపక పోయినచో; హాని తొలగి = ముప్పు తొలగి పోయి; అదియె = ఆ మనస్సే; హాయిన్ కొల్పున్ = ఆనందమును కలిగించును

ఓ సుధామా! ద్వైత ప్రపంచములో నివసించుచూ ఆ ద్వైత భావములలో కొట్టుమిట్టాడినచో అదియే బంధము. దానిని తోపింప చేయునది మానవుల మనస్సు మాత్రమే! అటులకాక, ప్రాపంచిక విషయాలపై అనిష్టత, తటస్థత అవలంబించినచో, ఆ బంధము తొలగిపోగా, ఆనందమును కలిగించునదియూ ఈ మనస్సే సుమా! అనగా, మనస్సే అన్ని బంధ భావలనకును మూలమగుచున్నది!

"*మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః - బంధాయ విషయాసక్తం, ముక్త్యై నిర్విషయం హి తత్*" – (అమృతబిందూపనిషత్ - రెండవ మంత్రము) – (మన: + ఏవ = మనస్సే; మనుష్యాణాం = మానవులకు; బంధ మోక్షయోః = బంధమును, మోక్షమును కలిగించుటకు; కారణం = కారణమగుచున్నది; తత్ = ఆ మనస్సు; విషయ + ఆసక్తం = ఇంద్రియ విషయముల యందు ఆసక్తి కలిగినదైనప్పుడు; బంధాయ = బంధ హేతువగుచున్నది; నిర్విషయం = అట్టి ఆసక్తి లేనిదైనప్పుడు; ముక్త్యై హి = మోక్ష హేతువగుచున్నది కదా) – అను సూక్తి ఇట స్మరించుకొన దగినది!

93. నిస్తేజు సచైతన్యుగ

విస్తర పఱపుచు వివేక వికసన మొదవన్

వ్యస్తంబవు మానసమును

బ్రస్తుతముగ మార్చి కూర్చుఁ బరము సుధామా!

పరము = పరమాత్మ తత్త్వము; నిస్తేజున్ = ఎట్టివిధమైన తేజస్సు, బలము లేనివానిని; సచైతన్యుగన్ = చైతన్యమును పొందిన వానిగా; విస్తర పఱపుచున్ = వ్యాపింప చేయుచూ; వివేక వికసనము + ఒదవన్ = సత్యాసత్య వివేచనము కలుగు నట్లుగా; వ్యస్తంబు + అవు మానసమును = వ్యాకులతను పొందిన మనస్సును; ప్రస్తుతముగన్ మార్చి = స్వస్థ పరచి (ప్రస్తుత స్థితికి తెచ్చి); కూర్చున్ = చక్కచేయును;

ఓ సుధామా! పరమాత్మ తత్త్వము తమోగుణులను కూడా సత్యా సత్యములను చక్కగా విచారణ చేయగల చైతన్యవంతులుగా మార్చి విస్తరింప చేయగలందులకు, వారి వ్యాకులపడిన మనస్సును (ఆ బాధలను తొలగింప చేయుట ద్వారా) స్వస్థపరచి చక్కజేయును!

94. నేతులడుగంటఁ బ్రమిదల

జ్యోతి వెలుగు టెట్లు జరుగదో[1] యటులె మహిఁ

జేతమున భ్రాంతి యణఁగఁగ

నూత మొసఁగు నాత్మఁ జేరనూను సుధామా!

[1]*కాకుస్వర యతి* - జ్యోతి లోని "యో" కారమునకు, దో లోని "ఓ" కారమునకు యతిమైత్రి! 'అ', 'ఇ', 'ఉ', 'ఎ', 'ఒ' - అను హ్రస్వాక్షరములను సంబోధన, ప్రశ్న, ఆశ్చర్యము, సందేహము, పరిహాసము, దృఢ ప్రతిపాదన, ప్రార్థన మొదలగు సందర్భములలో దీర్ఘములుగా ఉచ్చరింతుము. అట్టి దీర్ఘ స్వరమునే 'కాకుస్వరము' అందురు. ఉదాహరణ : కనవా, కనుమీ, కనవూ, కనవే, కనవో.

ప్రమిదలఁ నేతులు = ప్రమిదలయందలి నేయి, నూనె వంటి ఇంధన ద్రవ్యములు; అడుగు + అంటఁ (*శబ్ద పల్లవము*) = ఇంకిపోగా (శోషించిపోగా, క్షీణించిపోగా, అణగారిపోగా); జ్యోతి = దీపము; వెలుగుట + ఎట్లు జరుగదో = ఏవిధముగా వెలుగలేదో; మహిఁ అటులె = అదేవిధముగా ఈ మాయా సంసారము నందు(నరుడు); చేతమునఁ = మనస్సునందు; భ్రాంతి అణగగఁ = భ్రమ తొలగి పోగా; ఊతము + ఒసగు = ఆసరాను, పట్టును అందించు; ఆత్మఁ + చేరఁ + ఊనుఁ = పరమాత్మను చేరుటకు పూనును.

ఓ సుధామా! తైలమున్నంత వరకు మాత్రమే దీపము వెలుగులీను నట్లుగా, ప్రాణి తనలో అజ్ఞానమున్నంతవరకు మాత్రమే ప్రాపంచికుడగును. ఏ క్షణమున భ్రాంతి నశించి పోవునో, ఆ క్షణముననే ప్రక్కనే అండగా (అందుబాటుగా తనలోనే) ఉన్నట్టి పరమాత్మ తత్త్వమును చేరుకొన పూనును.

95. మౌనము వహించు జ్ఞానుల
మానసమును బోలవలయు మనుజుని తలఁపుల్
లీనంబయి పరమానం
దానుభవమ్మున మునుంగు మభవ సుధామా!

మనుజుని తలపుల్ = మానవుల యొక్క ఆలోచనలు; మౌనముస్ = త్రివిధ-మౌనమును ( *1.వాఙ్మౌనము* - మాట్లాడ కుండుట, *2.అక్షమౌనము* – పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనో, బుద్ధి, చిత్త, అహంకారము లను పదునాలుగింద్రియముల విషయాదులందు చొరనీక పరబ్రహ్మమందే లగ్నము చేయుట, *3.కాష్ఠ మౌనము* - పద్మాసనాదుల యందు ఉంచిన శరీరము); వహించు = పాటించు; జ్ఞానుల = తత్త్వ జ్ఞానుల యొక్క; మానసమునుస్ = అంతరంగమును (మనస్సును); వోలవలయుస్ = సరిపోల వలెను; అభవ సుధామా = తిరిగి పుట్టుక లేని వాడా; లీనంబు + అయి = (మమేకముగా) ఒక్కటిగా అయిపోయి; పరమ + ఆనంద + అనుభవమ్మునస్= పరమాత్మానందము నందు; మునుంగుము = కలగలసి పొమ్ము (నిన్ను నీవు మరచిపోమ్ము);

ఓ సుధామా! జ్ఞానులు గొప్ప నియమములతో మూడు విధముల మౌనమును పాటించి చిత్తమును పరమాత్మ యందు నిలుపుదురు. అట్టి దృఢచిత్తమును పొందుటయే మానవ జన్మ ముఖ్యోద్దేశము. అట్టి స్థితికి చేరిన (పరమాత్మ యందు లీనుడైన) జీవుడు పరమానందమును అనుభవించుచునే ఉండును - తిరిగి జన్మించుట అనునది ఉండదు సుమా!

96. చంచల చక్రపు టంచుల

నెంచెడు భ్రమలందుఁ బడకు – మీడ్గిలఁ బఱచుస్;

గొంచక యిరుసును గొనఁగా

నించుక యత్నించి పరమ మెఱుఁగు సుధామా!

చంచల = చంచలమైన, కదలుచున్నట్టి (తిరుగుచున్నట్టి); చక్రము + అంచులస్ + ఎంచెడు = చక్రపు టంచులను మాత్రమె ఆశ్రయించు; భ్రమలందుస్ + పడకుము = మాయ యందు పడవలదు; ఈడ్గిలస్ + పఱచుస్ = (ఆ మాయ) ఏమీతోచనట్లుచేసి, చతికిల బడజేయును; కొంచక = సంకోచింపక; ఇరుసును కొనగాస్ = అక్షము (నడుమ/హృదయ భాగము) నకు చేరుకొనుటకై; ఇంచుక యత్నించి = కొంచెము ప్రయత్నించి; పరమము + ఎఱుగు = పరమాత్మ తత్త్వమును తెలిసికొనుము.

ఓ సుధామా! చక్రమునకు, 'ఇరుసు' చిన్నదిగానూ, సూక్షముగానూ ఉండును. కానీ, అదియే అక్షమును ఆధారముగా గొని చక్రపుటాకులకు ఆవలగా అంచు ఉండును. వేగముగా తిరుగు చక్రపుటంచుల నాశ్రయించి యున్నచో కన్నులు తిరుగును. అంత వేగముగనే ఇరుసు కూడ తిరుగు చున్ననూ, ఆ భ్రమణము వలన హాని కలుగదు! ఈ నిజమును గ్రహించి చక్రపుటంచున నివసింపగోరక, ఎంత త్వరితముగా ఇరుసు దెసగా పయనింతుమో అంత సురక్షితులము కాగలము.

అదే విధముగా, ఈ మాయా ప్రపంచపుటంచున (బాహ్యములో) జీవింపక (హృదయమే - ఇరుసు) హృదయ గతమైన ఆత్మ వైపునకు ప్రస్థానము చేసినచో, మనలను నిర్వీర్యులను జేయు మోహమాయ తొలగిపోవునని భావము!

97. గాలిపట మెగురు చెగురుచు

నేల కొరుగుఁ బట్టిలాగ; నిజము దెలియఁగాన్

ఆలోలత తగ్గి మనము

గాలూనును బరమమెఱుఁగు గతిని సుధామా!

గాలిపటము = బాలక్రీడా సాధనవిశేషము, పతంగము [హిందుస్తానీ భాష యందు], *Kite* [ఆంగ్ల భాష యందు]; ఎగురుచున్ + ఎగురుచున్ = ఎంతయో సమయము పాటు గాలిలో ఎగురుచూ; పట్టి లాగన్ = దారమును (త్రాటిని) పట్టి క్రిందకు లాగివేయగా; నేలకున్ + ఒరుగున్ = భూమిమీదకు వచ్చి పడును; నిజము తెలియగాన్ = సత్యము బోధపడగా; ఆలోలత = చంచలత్వము (భ్రాంతి); తగ్గి = తగ్గిపోగా; మనము = మనస్సు; పరమము + ఎరుగు గతినిన్ = పరమాత్మను గ్రహించు (మోక్ష) మార్గమునందు; కాలు + ఊనును = నిలద్రొక్కుకొనును (స్తిమిత పడును);

ఓ సుధామా! ఏవిధముగా అయితే, గాలిలో ఎగిరే గాలిపటాన్ని (దారమును) పట్టిలాగి శాంతింప చేయుదమో, అదే విధముగా మనస్సును కూడా సత్యమును "తెలిసికొనుట" అను క్రియ ద్వారా భ్రాంతి, త్రిప్పుటలు, విషయ లంపటములు అనువాని బారినుండి బయల్వెడల జేసి (అనగా, నిశ్చలతను పొందించి), పరమాత్మ తత్త్వమును తెలిసికొను దిశగా మరల్ప గలము.

\

98. పాముల నిచ్చెన లాటలఁ

బ్రామాణికతత్త్వమెఱిఁగి బ్రహ్మాన్వేషుల్

దామున్న చోటె పరమ సు

ధామమని గ్రహింతు రాత్మదర్శి సుధామా!

ఆత్మదర్శి సుధామా = ఆత్మతత్త్వమును దర్శించి, గొప్ప స్థానమున ఉన్నట్టి ఓ మానవుడా! బ్రహ్మాన్వేషుల్ = సత్య సాధకులు; పాము-నిచ్చెనల + ఆటలన్ = వైకుంఠ పాళి (***Snakes & Ladders***) అను ఆట ద్వారా; ప్రామాణిక తత్త్వము + ఎరిగి = ప్రత్యక్ష జ్ఞానమును తెలిసికొని; తాము + ఉన్న చోటె = వారుండిన స్థానమే; పరమ సుధామము + అని = పరమాత్మ యొక్క గొప్ప స్థానము, అని; గ్రహింతురు = తెలిసి కొందురు.

ఆత్మతత్త్వమును దర్శించి, గొప్ప స్థానమున ఉన్నట్టి ఓ సుధామా! "వైకుంఠ పాళి" అను క్రీడ ద్వారా, ఈ లోకములోని మోహములు, దుఃఖములు ఏవిధముగా మానవులను ఎత్తులెక్కించుచూ, పతనము గావించునో తెలిసికొనెదము! ఆ ఆటయందు నిక్షిప్తమైన అంతరార్థమును గ్రహించిన బ్రహ్మసాధకులు తామున్న స్థానములోనే పరమాత్మ ఉండునను సత్యమును గ్రహింతురు. తనయందు సకల భూతములు, సకల భూతములయందు తాను నిండియుండుట అనెడి '*వాసుదేవ తత్త్వమును*' అనుభవింతురని భావము.

**99. నిద్రించుచు నరుఁడు తలఁచు**

**భద్రంబని మోహమాయ పట్టునఁ బడుచున్**

**క్షుద్రాలోచన పరతా**

**ఛిద్రితుడై కూలి చితికిఁ జేరు సుధామా!**

నరుడు = జీవుడు; నిద్రించుచున్ = నిద్రపోవుచు; భద్రంబు + అని = తనకు భద్రత ఏర్పడినదని; మోహమాయ పట్టునన్ + పడుచున్ = మోహ పరచు మాయకు చిక్కుకొని; తలచున్ = తలపోయును; క్షుద్ర + ఆలోచన పరతా చిద్రితుడు + ఐ = నీచమైన తలపులతో తూట్లుపడిన హృదయము కలవాడై; కూలి చితికిన్ చేరున్= మరణించి వల్లకాటికి చేరుకొనును.

ఓ సుధామా! శరీరి (శరీరమును పొందిన ప్రతి జీవి) ప్రతిదినము నిద్రించి తన యలసటను తీర్చు కొనుచుండును. అనగా, అలసటను తీర్చుకొనుటకు 'నిద్ర' అవసరమైన ఒక శారీరిక స్థితి అగును. అలసట తొలగిన పిదప నిద్రించుట అవశ్యము కాదు. కానీ, పెక్కురు మాయచే తామసులై, తామింకను కొంత సమయము నిద్రింపకున్న అలసట తీరదని భ్రమించుచు, 'నిద్ర'యను మత్తుకు బానిసలై బ్రతుకు చుందురు! కనుక, "అతినిద్ర" కూడ వ్యసనముగా నిర్ణయింపబడి, క్షుద్ర కార్యములందు చేర్పబడెను!

అట్లే, మోహనిద్రనుబడు వ్యక్తులు నీచమైన చిత్తచంచలతతో తుదకు ఊరకే కాటికి చేరుకోవలసినదే కాని, మోక్షమును పొందలేరు సుమా!

100. అజ్ఞత ముదిరిన నరునకు

సుజ్ఞానము నందఁజేఁత సొలపులఁ గొలుపున్

జిజ్ఞాస గొనిన వానికి

విజ్ఞానము నేర్పవచ్చు విధిగ సుధామా!

అజ్ఞత ముదిరిన నరునకున్ = మిక్కుటమైన అజ్ఞానము కలిగిన మానవునకు; సుజ్ఞానమున్= బ్రహ్మజ్ఞానమును; అందజేత = 'అందజేయుట' అను పని; సొలపును = నీరసమును, (ఆయాసమును); కొలుపున్ = కలిగించును; జిజ్ఞాస కొనిన వానికిన్ = ఆత్మజ్ఞానమును తెలిసికొన గోరువానికి; విధిగన్ = తప్పనిసరిగా; విజ్ఞానమున్ = శాస్త్రములను; నేర్పన్ + వచ్చున్ = నేర్ప గలిగెదము;

ఓ సుధామా! ఏదైనా తెలిసికొన వలెననెడి కోరిక, బుద్ధి ఉన్నవానికి క్రొత్తవిషయాలను బోధించ గలుగుదుము కానీ, అట్టి ఇష్టత లేనివానికి నేర్పలేము కదా! (అజ్ఞానములో కొట్టుమిట్టాడు వానికి బ్రహ్మజ్ఞానము పొసగదు సుమా!). అట్లు కాక ఆత్మజ్ఞానమును తెలిసికొన గోరువారిని తామసులైనను సాత్వికులనుగా మార్చుట సాధ్యపడును అని భావము!

*అజ్ఞస్సుఖమారాధ్యః సుఖతరమారాధ్యతే విశేషజ్ఞః - జ్ఞానలవ దుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి* -- *(అజ్ఞః – ఏమియును తెలియని అజ్ఞాని; సుఖం – సులభముగా; అరాధ్యః – బోధించుటకు అర్హుడై యుండును; విశేషజ్ఞః – జ్ఞాని యైనవాడు; సుఖతరం ఆరాధ్యతే – అతిసులభముగా విషయమును గ్రహింప గలుగును; జ్ఞాన లవ దుర్విదగ్ధం – మిడిమిడి జ్ఞానము కలిగిన; నరం – మానవుని; బ్రహ్మ + అపి – బ్రహ్మదేవుడు కూడా; న రంజయతి – బోధించి ఒప్పించ లేడు)* అని భర్తృహరి తన సుభాషిత రత్నావళిలో ఇదే విషయమును చెప్పెను.

101. ముడిలోహము గరఁగింపగ

వడి వలసిన రూపుఁ గాంచుఁ; బామరుఁడటులే

చిడిముడి పఱుపగఁ గష్టము

పడి పదముల గురునిఁ గోరు భవిత సుధామా!

ముడిలోహము గరగింపగన్ = గట్టిగ నండు లోహమును కరగించగా; వడిన్ వలసిన రూపున్ కాంచున్ = వేగముగా కావలసిన రూపమును పొందును; పామరుడు + అటులే = అజ్ఞాని కూడా అదే విధముగా; కష్టము చిడిముడి పరుపగన్ = కష్టము ఆందోళన పరచగా; గురుని పదములన్ పడి = గురువుల యొక్క పాదాలపై వ్రాలి; భవితన్ కోరున్ = భవిష్యత్తులో శుభములను కలుగ జేయమని కోరుకొనును

ఓ సుధామా! లోహము అగ్నిచే కరగింపబడనిచో ఏవిధముగా కావలసిన రూపమును ధరింపదో, అదే విధముగా అజ్ఞాని తామసముతో ఎట్టి మార్పును పొందక జడుడై యుండును. కానీ, తనకు కష్టాలు అనుతాపమును కలిగించి నప్పుడు మాత్రమూ, గురువులను చేరి తనను ఉద్ధరింప వలసినదిగా (అనగా, బ్రహ్మజ్ఞానిగా మలచ వలసినదిగా) కోరుకొనును సుమా!

102. 'నేన'ను తలంపు మనుజుల
మానసమున ఘోర గర్వ మలినత నద్దన్
దీనతఁ బతనము నొందుచు
[1]క్షీణింతురు మచ్చరంబు చెనక సుధామా!

[1] "న-ణ ప్రాసము" ను గమనింపుడు

నేను + అను తలంపు = "నేను" అను ఆలోచనయే; మనుజుల మానసమునన్ = మానవుల మనస్సులలో; ఘోర గర్వ మలినతన్ + అద్దన్ = భయంకరమైన / నీచమైన అహంకారమును నిక్షేపింపగా; దీనతన్ = దైన్యము చేత; పతనమున్ + ఒందుచున్ = అధమ స్థితిని పొందుచూ; మచ్చరంబు = మాత్సర్యము; చెనకన్ = తగులుకొనగా; క్షీణింతురు = నశించి పోదురు;

ఓ సుధామా! "నేను" అను ఆలోచనే మానవులను సర్వనాశనము చేయుచున్నది -- ఎటులనగా, అట్టి ఆలోచన పరమ నీచమైన గర్వము అను మాలిన్యమును మానవుల మనస్సులలో నాటగా వారు తమ కనుల ముందే సాధన మార్గమున ఎదిగి పోవుచున్న ఇతరులను చూచి అసూయ, ద్వేషము, క్రోధము అను దీనతలను తలనిడి క్షీణించి పతనము చెందుచున్నారు సుమా!

## 103. నీలో 'నేన'ను తత్త్వం

బాలోకింపఁగ మనుజున కవగాహన గాన్

వ్యాలోలత్వము దొలఁగఁగ,

లోలోపలి యాత్మ యలరు, రూఢి సుధామా!

నీలో నేను అను తత్త్వంబు = నీ యందు 'నేనుంటిని' అను సత్యము; ఆలోకింపగన్ = తలచి చూడగా; మనజునకున్ + అవగాహన + కాన్ = మానవునకు బోధపడగా; వ్యాలోలత్వము తొలగగన్ = (మనస్సుకు కలిగిన) త్రిప్పటలు తొలగి పోగా ; లోలోపలి యాత్మ = స్వాంతము నందలి పరమాత్మ; రూఢిన్ అలరున్ = తప్పకుండా వికసించును.

ఓ సుధామా! 'నేను' అను భావము కలిగి నంతనే, 'నీవు' అన్న భావము కూడ కలిగి ద్వంద్వమేర్పడును! అట్టి ద్వంద్వములోనూ "నీ యందు 'నేనుంటిని" అను భావము మానవులకు బోధపడగా, త్రిప్పటలు, భ్రమలు తొలగి ఆత్మానందము కలుగును సుమా!

"సర్వాంతరాత్మ తత్త్వము - అంతటనూ ఉండునది పరమాత్మ తత్త్వమే అను భావము" కలిగిన వారే సిద్ధ పురుషులు - వారికే నిజమైన ఆనందము అందుబాటులో నుండును. ఆ ఆనందమును అనుభవించుట కొఱకే, వారు ధ్యాన సమాధులలో నుండెదరు, అని భావము. ("తత్త్వమసి" అను మహా వాక్యము యొక్క అర్థము కూడా ఇదే సుమా).

104. పూజల వ్రతముల నోముల

నోజమున సలిపి ధనముల నొందు తలఁపులన్,

ఓజ నజబృంద మట్టుల

భోజనమునె కోరి మడియఁ బోకు సుధామా!

ధనములన్ + ఒందు = సంపదలను పొందు; తలపులన్ = ఆలోచనలతో; పూజలన్, వ్రతములన్, నోములన్ = పూజాది కార్యక్రమములను; ఓజమునన్ = ఓపికతో; సలిపి = జరిపి, నిర్వహించి; అజ బృందము + అటులన్ = గొర్రెల మంద వలె; ఓజన్ = నేర్పుతో, ఉపాయముతో; భోజనమునె కోరి = తిండి తినుట మాత్రమె కోరుకొని; మడియన్ + పోకు = నశించి పోకుమా!;

ఓ సుధామా! కేవలము తిండిని కోరుకొనే గొర్రెల మంద వలె ధనాది భోగములను మాత్రమె కోరుకొనుచు పూజలు, వ్రతాలు, నోములు మొదలైనవి చేసి జీవితమును వ్యర్థము చేసికొనకు సుమా!

జంతు వర్తనమును వీడి, [1]జపతపాదులను మోక్షసాధమునకు సోపానములుగా నిర్మించుకొని బ్రతుకును సార్థకము చేసికొన వలెనని భావము

[1]జపతపాదులు అను పదము గ్రాంథికముగా ఒప్పిదము కాదు. 'జపతప ఆదులు' అని విడిగా ఉండవలెను. కారణము 'తపస్' అనునది 'స' కారాంత శబ్దము. అయిననూ వాడుకలో 'జపతపాదులు' అని శిష్ట వ్యవహారికముగా చెల్లుబాటు అగుచున్నది!

105. వేసవి యెండలఁ జనియెడు

నాసామికి నీటి నొసఁగ నాసగఁ గ్రోలుస్

వేసర పడునె గొడుగుకై

వాసంబునఁ గూరుచుండు వాడు? సుధామా!

[1] "ఆసామి" అను పదమునకు "కొలుదారు, రైతు" అను అర్థములు కలవు. అయిననూ, వ్యవహారికమున "వ్యక్తి, మానవుడు" అను అర్థములలో రూఢ మగుచున్నది. అట్టి రూఢార్థమే ఇచ్చట ప్రయోగింప బడినది!

వేసవి + ఎండలస్ + చనియెడు = మండు వేసవి ఎండలలో తిరుగాడుచున్న; ఆసామికిస్ = వ్యక్తికి; నీటిస్ = (త్రాగుటకై) మంచినీటిని; ఒసగస్ = ఇవ్వగా; ఆసగస్ = ఎంతో ఆశతో (మిక్కిలి అపేక్షతో); క్రోలుస్ = త్రాగును (దప్పిక తీర్చుకొనును); వాసంబునస్ = ఇంటి పట్టున; కూర్చుండువాడు = కూర్చున్న వ్యక్తి; గొడుగుకయి = గొడుగు కొఅకై; వేసర పడునె? = శ్రమపడి వెదకునా? (వెదకడని భావము)

ఓ సుధామా! వేసవిలో ఎండలో ప్రయాణము చేయు వ్యక్తి దప్పికను తీర్చుటకు నీటిని ఇచ్చినచో ఆనందంగా అంగీకరిస్తాడు. కానీ, చక్కగా నీడపట్టున కూర్చున్న వ్యక్తి గొడుగు కోసం వెదుకులాడడు కదా!

ఇట "*అప్రస్తుత ప్రశంసాలంకారము*" కలదు. “సంసార సుఖములు మరగినవాడు, సుఖపడు మార్గములను మరింతగా అన్వేషించుచు కాలము గడుపును. చివరకు వానివల్ల విసిగి వేసరి, మోక్షేచ్ఛతో వైరాగ్యము నవలంబించును” - అనెడు ప్రస్తుతాంశము - 'వేసవిలో నీరుకొరుకొను వ్యక్తి యొక్కయు', 'నీడను సుఖించుచు గొడుగును కోరుకొనని వ్యక్తియొక్కయు' ప్రస్తావన (వర్ణన) ద్వారా స్ఫురింప జేయుట జరిగినది.

106. బలపమున వ్రాఁతఁ గఱపుచు

నలసట తెలియంగనీని యారక్షణచేఁ

దొలఁగించి భ్రమల మలఁచుచు

నిలుపు గురుఁడు శిల్పిభాతి నిన్ను సుధామా!

గురుడు = సద్గురుడు; శిల్పిభాతిన్ మలచుచున్ = శిల్పి శిల నుండి శిల్పమును మలచు రీతిగా; బలపమునన్ వ్రాతన్ + కరపుచున్ = పలకపై బలపముతో (అక్షరములు) వ్రాయించి నేర్పు చందమున; అలసటన్ = శ్రమను; తెలియంగన్ + ఈని = తెలిసికోలేని విధముగా; ఆరక్షణచేన్ = గొప్ప సంరక్షణచే (కాపుచే); భ్రమలన్ తొలగించి = భ్రాంతులను వదలించి; నిన్నున్ = నిన్ను; నిలుపున్ = (దృఢ మనస్కునిగా) తీర్చిదిద్దును;

ఓ సుధామా! తమకు పెద్దగా శ్రమ కలుగకుండా రక్షించుచూ, ఒకానొక శిల్పి 'రాతి నుండి శిల్పాలను వెలయించి నట్లుగా' – గురువులు భ్రమలను తొలగించి నిజాత్మలో దృఢముగా నిలుచునట్లుగా శిష్యులను మలచగలరు సుమా!

"*బలపమున వ్రాత గరపుచు*" అను పోలిక, గురువునకు శిష్యునిపై గల వాత్సల్యమును, శిష్యునకు గురువుపై గల శ్రద్ధావిస్వాసములను సూచించు చున్నది!

107. "యా మా సా మాయా" యని
సామాన్యునకును దెలిపెడి సామర్థ్యముచేస్
గ్రామగ్రామముల గురుఁడు
నేమంబున జ్ఞానసేవ నెఱపు సుధామా!

గురుడు = సద్గురువు (అవధూత); నేమంబునస్ = నియమ నిష్ఠలతో; సామాన్యునకుస్ = అతి సాధారణ వ్యక్తికి (ఎట్టి పాండిత్యము, విద్యా వ్యాసంగములు, నాగరిక పద్ధతులు, సంస్కృతి తెలియని వానికి) కూడా; "యా మా సా మాయా" అని = మాయా తత్త్వమును ఉదాహరణలతో, విశ్లేషణలతో; తెలిపెడి = వివరముగా తెలియ చేయగలుగు; సామర్థ్యముచేస్ = సమర్థతతో; గ్రామ గ్రామములస్ = ప్రతి జనావాసము లందునూ (గ్రామైక రాత్రముగా = ఒక్కొక్క గ్రామమున ఒక్క రాత్రిమాత్రమే వసించుచూ); జ్ఞాన సేవస్ నెరపుస్ = "మోక్ష మార్గమును చూపు జ్ఞానమును బోధించుట" అను సేవను నెరవేర్చును.

ఓ సుధామా! "యా మా సా - మాయా" - "ఏదైతే ఉన్నట్లు అగుపడి నిజమునకు ఉండదో అదియే మాయ" *['మా' అనగా లక్ష్మి - అనగా ధనము అనియును అర్థము కలదు కావున, "ధన సంబంధ మగునది ఏది అయిననూ మాయాహేతువే" అను తాత్పర్యమును కూడ చెప్పుకొనవచ్చును!]* అను భావమును ప్రజలందరకూ తెలియ చెప్పు నుద్దేశ్యముతో గురువులు ఊరూరా తిరిగి ప్రజలకు "జ్ఞానసేవ" లందింతురు సుమా!

108. పదునాఱు కళలు చంద్రునిఁ
గదురుఁ, దొలఁగు - భూమిఁ జుట్టి కదలుటఁ; బరమం
బదనున నటె దేహము గొను,
వదలును బరిణామ లీలఁ బఱపి సుధామా!

పదునారు కళలు = షోడశ (16) కళలు; చంద్రునిస్ = చంద్రునికి; భూమిస్ చుట్టి కదలుటస్ = (అతడు) భూమిచుట్టూ తిరుగుట వలన; కదురుస్ + తొలగుస్ = కలుగుచూ, తొలగుచూ ఉండును. అటె = అదే విధముగా; పరిణామ లీలస్ = రూపాంతరము చెందు క్రీడను; పరపి = జరుగునట్లు చేసి; పరమంబు + అదనునస్ = పరమాత్మ తత్త్వము సరిఅయిన సమయములో; దేహమ్మ్ముస్ + కొనుచుస్ = శరీరమును పొందుచూ; వదలును = విడచును

ఓ సుధామా! చంద్రుడు భూమికి ఉపగ్రహమని, భూమిని చుట్టి తిరుగు నప్పుడు తన కక్ష్యలో ఊగిసలాడుననీ, ఆ కారణముగా చంద్రునికి "షోడశ" (16) కళలు కలుగునని విజ్ఞానశాస్త్రము మనకు చెప్పును. కోట్లాది సంవత్సరాలుగా ఈ క్రమము జరుగుచునే ఉన్నది!

అదే విధముగా, పరమాత్మ తత్త్వము కూడా, తగిన సమయములో శరీరాన్ని పొంది, మరొక తగిన సమయంలో శరీరాన్ని వదిలివేయు లీలను ప్రదర్శించు చుండును. అనగా, ప్రాణులకు ప్రాణము కలుగుట (జీవి రూపమున ఒదుగుట), పోవుట (జీవము శరీరమును వదులుట) అనునది ఆ పరతత్త్వము యొక్క లీలయే. [అనగా, మరణము (మృత్యువు) కూడా క్రీడలోని ఒక భాగమే సుమా!]

ఆత్మ (వి)జ్ఞానమనగా ఇదియే కదా!

---- ఇతి శమ్ ----

## *మలి మాట:*

“భారతులు" అనగా, భరతవర్షమున గల ప్రజలు - అను సామాన్యార్థము ఉండగా, "పరమాత్మ వెలుగు లందు క్రీడించు/రమించు జ్ఞానులు" అను అర్థము కూడ కలదు!

అగ్రాచలస్థ కుహర స

మగ్రారుణ వర్ణ బ్రహ్మ యభ్యున్నతిఁ బ్ర

త్యగ్రతగొను భారతులకు

సుగ్రాహ్య సుశాస్త్రములిడుఁ జూడ సుధామా!

అగ్ర + అచలస్థ కుహర = ఉన్నతమైన పర్వత గుహయందు ఉన్నట్టి; సమగ్ర + అరుణ వర్ణ = సంపూర్ణమైన కెంపు వర్ణముతో నొప్పు; బ్రహ్మ = పరమాత్మ తత్త్వము; అభ్యున్నతిన్ = యోగాభ్యున్నతి చేత; ప్రత్యగ్రతన్ + కొను= నూతనత్వమును పొందు; భారతులకున్ = ఆధ్యాత్మిక దృష్టి కలవారికి; చూడన్ = ఆలోచింపగా; సుగ్రాహ్య సుశాస్త్రములు = సులభముగా గ్రహించు శాస్త్రములను; ఇడున్ = ఇచ్చును;

ఉన్నతమైన పర్వత గుహయందు (అనగా, హృదయ కోశమున) కెంపు వర్ణ ప్రకాశముతో నొప్పు పరమాత్మ తత్త్వము, ఆధ్యాత్మిక దృష్టితో యోగాధ్యయనముచే నూతముగా తమ్ము తాము మలచుకొన గోరువారిని గొప్పశాస్త్రములను సులభముగా గ్రహించు శాస్త్రజ్ఞులనుగా తీర్చిదిద్దును, జూడుమా!

("సూచ్యార్థ సూచనం ముద్రా - ప్రకృతార్థపరైః పదైః [చంద్రాలోకము - అలంకార గ్రంథము]" – ముద్రాలంకారము అనిన, సూచింపదగిన అర్థమును ఆయా అర్థములనిచ్చు పదములచే సూచించుట).

పై పద్యమున అట్టి ముద్రాలంకారము ననుసరించి, అగ్రాచల అనుచోట 'అచల' పదము, ఉగ్రారుణ అనుచోట 'అరుణ' పదము, భారతులకు అనుచోట 'భారత' పదము (ఇంటిపేరు) మరియు సుశాస్త్రములు అనుచోట 'శాస్త్రి' పదము వాడబడి, 'భారతం అరుణాచల శాస్త్రి' అను కవి నామమును సూచించినవి.

శాస్త్రజ్ఞానము తెలిసికొనిన మానవులు దుర్వినియోగ పద్ధతిని గాని, అహంకార ప్రవృత్తిని గాని అవలంబించిన, అజ్ఞానులై నీచత్వమును పొందెదరు. దీనినే భర్తృహరి –

*"కిం వేదైః శ్రుతిభిః పురాణ పఠనైః శాస్త్రైః మహావిస్తరైః*
*స్వర్గగ్రామ కుటీ నివాస ఫలదైః కర్మక్రియా విభ్రమైః*
*ముక్త్వైకం భవదుఃఖ భార రచనా విధ్వంస కాలానలమ్,*
*స్వాత్మానంద పదప్రవేశ కలనం, శేషైః వణిగ్ వృత్తిభిః"*

అని, వైరాగ్య శతకమున తెలిపెను.

అటులకాక శాస్త్రములను, అందలి జ్ఞానమును లోక కళ్యాణార్థమై అనగా, ప్రజోపయోగ కార్యక్రమములకు శ్రీకారముచుట్టి, వివిధ సదుపాయములతో జనులకు సేవలు సల్పినచో అట్టి శాస్త్రజ్ఞానమునకు వన్నె, శోభ చేకూరగలదు!

మానవులు తాము చేయు కార్యములు జ్ఞానహేతువులో లేక అజ్ఞాన కారకములో తెలిసికొనుటకై గురువులను సందర్శించుచుందురు. గురువు అను పదము వ్యక్తి పరముగనే మన మనస్సులకు తట్టును. కానీ, మన జీవితములో తారసపడు వ్యక్తులే కాక, మన సమక్షములో, కలలలో, ఆలోచనలలోను తారసపడు ఏ సంఘటన ఐననూ మనకు గురువై మార్గదర్శనము చేయగల చేవను కలిగి యుండును.

'అద్వయ తారకోపనిషత్', గురు శబ్దమునకు ఈ విధముగా అర్థమును బోధించినది.

*'గు' శబ్ద స్త్వంధకారః స్యాత్ 'రు' శబ్ద స్తన్ని రోధకః*
*అంధకార నిరోధిత్వాత్ గురురిత్యభిధీయతే*

గు - అనగా అహంకారము, అజ్ఞానము, తమోగుణము అనియు, రు - అనగా నశింపచేయునది, పారద్రోలునది అనియు చెప్పబడుచున్నది. కనుక, మన మనస్సులలోని అహంకారమును, అజ్ఞానమును తొలగించు వ్యక్తి, సంఘటన, ఆలోచన మొదలైన వన్నియును గురుతుల్యములే అని 'గురు' శబ్ద నిర్వచనము.

ఉదాహరణకు, *“భోజన మొసగుట కొరకై, యోజన గోధుమలు విసరు యువతి కపోణిస్, గాజుల నొకటిగ జేర్చిన, యోజను గని యోగి యాత్మ యోగము నెరిగెస్“* -- ఒక సన్యాసికి భిక్ష నొసగుటకు వంటచేయు తలపుతో ఒకానొక ఇల్లాలు గోధుమలు విసరుచూ, మాటిమాటికి శబ్దము చేయుచూ అడ్డుపడుచున్న గాజులను మోచేతి మీదకు చేర్చి శబ్దమును నివారించిన సంఘటన ఆ సన్యాసికి అద్వైతమును నేర్పిన కథను వినియే ఉన్నాము కదా! అనగా, అట్టి సంఘటనయే ఆ సన్యాసికి గురువు అయినట్లయినది కదా!

ఈ సత్యమును గ్రహించినందు వలననే కాబోలు, 'సిఖ్'ల దశమ గురువైన "గురు గోవింద్ సింఘ్", వ్యక్తి పరమైన గురు పరంపరకు స్వస్తి పలికి "గురు నానక్" నుండి తనవరకు చేయబడిన ప్రబోధములను గ్రంథరూపమున పొందుపరచి, ఇకపై ఈ గ్రంథరాజమే 'సిఖ్'లకు మార్గదర్శనము చేయునని తెలిపెనని, ఆ విధముగా 'గురు గోవింద్ జీ' దేహమును వీడిన 1708వ సంవత్సరము నుండి నేటి వరకు కూడ ప్రపంచములో ఏ మూలనున్నను 'సిఖ్'లు ఆ గ్రంథమునే "గురుగ్రంథ్ సాహెబ్" అని పిలుచుకొనుచు, తమ మతము యొక్క పవిత్ర గురువుగ స్వీకరించిరని మనము వినియె ఉన్నాము కదా!

అటులనే, రమణ మహర్షికి తన 16వ యేట కలిగిన - "*మరణ మనగా నేమి?*" అను ఆలోచనయే ఆయనకు గురువై, ఆయనను జగద్గురువుగా నిలిపినది కదా! అనగా, ఒక సంఘటన, ఒక గ్రంథము, ఒక ఆలోచన కుడ "అజ్ఞానమును తొలగించు" గురువు కాగల శక్తిని సంతరించుకొని ఉండునని బోధపడినది కదా!

అట్టి సద్గురువును మన మనస్సులలో ప్రతిష్ఠింప చేసుకొని మనము కూడ ఆ గురు మార్గదర్శనముతో ప్రజ్ఞానులమై సుధామ తత్త్వము నలవరచు కొందమను ఆశయముతో, నమస్కృతులతో

మీ,

అరుణాచల భారతం

## కృతజ్ఞతలు

ప్రథమ గురువై చిన్నతనముననే సంస్కృతాంధ్రములకు పునాది నేర్పరచిన మా తల్లి శ్రీమతి కమలాంబగారికి, ఈ కృతిలోని ప్రతి పద్యమును చదివి కూలంకషముగా చర్చించి, భావ వ్యక్తీకరణ పద్యమందు అన్వయించుటకు తగిన మార్పులు చేర్పులు సూచించి, ఆద్యంతమూ వెన్నుదన్నుగా నిల్చిన నా కవితా గురువులు మా తండ్రి శ్రీ భారతం శ్రీమన్నారాయణ గారికి, నా ఉపనయనానంతరము నాచే సంధ్యా వందనాదులను చేయించి నా శ్రేయస్సును కాంక్షించిన మా పెదనాన్నలు కీర్తిశేషులు శ్రీ వీరభద్ర శాస్త్రి, కీర్తిశేషులు శ్రీ సుబ్రహ్మణ్య లక్ష్మీపతి సోమయాజులు గార్లకూ మరియు పెద్దమ్మలకూ, మేనత్తలు శ్రీమతి మల్లెల శకుంతలాదేవి, శ్రీమతి చామర్తి అన్నపూర్ణ, శ్రీమతి వెంపటి రాధాకృష్ణవేణి, శ్రీమతి యేలూరిపాటి బాలాత్రిపురసుందరి, కీర్తిశేషురాలు శ్రీమతి గోనెళ్ళ వరలక్ష్మి గార్లకు మరియు వారి భర్తలకు, నా యీ కృతిరచనను ప్రోత్సాహపరచిన పినతల్లి శ్రీమతి అంబటిపూడి సత్యవతి గారికి, బాబాయి శ్రీ ఉమామహేశ్వర శాస్త్రి గారికి, సోదరులు శ్రీ కట్టమూరి చంద్రశేఖరం గారికి మరియు వారి తల్లిదండ్రులు శ్రీ కట్టమూరి కొండలరావు, శ్రీమతి కట్టమూరి వెంకట సుబ్బలక్ష్మి దంపతులకు, పద్యాలను, భావాలనూ విమర్శ చేసి కావ్యోన్నతికి సహాయపడిన శ్రీ పోలిశెట్టి వీరసుబ్రహ్మణ్య కుమార్ గారికి (వీరే ఈ శతకమునకు ముఖచిత్రపట ప్రదాతలు కూడ – వీరికి విశేష ధన్యవాదములు), ఈ పద్యములను సమీక్షించిన సోదరి శ్రీమతి యేలూరిపాటి అపర్ణ, బావ శ్రీ యేలూరిపాటి ఆంజనేయ శర్మ గార్లకూ, పద్యరచనకు ప్రోత్సాహము చేసిన అన్న శ్రీ భారతం విశ్వేశ్వర ప్రసాదు, వదిన శ్రీమతి మాధవి గార్లకు, శ్రేయోభిలాషులు శ్రీ ప్రతాప వేంకట రమణ, అరుణ దంపతులకు, శ్రీ కూచిభట్ల ప్రసాద్, శారదాభ్రమరాంబ దంపతులకు, శ్రీ కొంపెల్ల మురళీ మోహన్, పద్మలత దంపతులకు, సహచరులు శ్రీ పెరక దుర్గాప్రసాదరావు గారికి, శ్రీ మల్లిన మురళీకృష్ణ గారికి, చిన్న నాటినుండి హితుడు, సన్నిహితుడు, స్నేహితుడు అయిన శ్రీ అంబటిపూడి సేతుమాధవ గారికి, మిత్రులు శ్రీ జొన్నాభట్ల ప్రసాద్ గారికి, అస్మత్ పుత్రికలు శర్వాణి, వాసంతులకు, భార్య పద్మావతికి, అత్తగారు శ్రీమతి నూకల లక్ష్మి, మామగారు శ్రీ నూకల సుబ్రహ్మణ్యశర్మ గార్లకు, వదిన శ్రీమతి కందాళ వెంకట రమణి

తోడల్లుడు శ్రీ కందాళ సన్నిబాబు గార్లకు, బావ శ్రీ నూకల నాగేశ్వరరావు వారి సతీమణి నాగమణి గార్లకు, అస్మత్ పితామహి కీర్తిశేషురాలు అన్నపూర్ణమ్మ, పితామహులు కీర్తిశేషులు శ్రీ విశ్వనాథం గార్లకు, మాతామహి కీర్తిశేషురాలు ఆకెళ్ళ సత్యనారాయణమ్మ, మాతామహులు కీర్తిశేషులు ఆకెళ్ళ అరుణాచల శాస్త్రి గార్లకు, నన్ను నన్నుగ తీర్చిదిద్దిన అధ్యాపకులకు, ఆధ్యాత్మిక గురువులకు ఇంకను ముద్రణ కర్త యైన శ్రీ పండు వెంకట్ గారికి, ప్రచురణ కర్తలకు, అభిప్రాయములను తెలిపిన పండితులకు, విమర్శకులకు, విద్వత్శిఖామణులకు పేరు పేరున కృతజ్ఞతలను సమర్పించు చున్నాను.

ఇంకనూ ఎందరో పిన్నలూ పెద్దల సహాయము వలనను, సలహాల వలనను ఈ కావ్య నిర్మాణము పూర్తి అయినది -- వారందరికీ కూడ కృతజ్ఞతలు.

మీ,

అరుణాచల భారతం

## సమర్పణ

మాయ ద్విస్వాభావిక. అనగా, ద్వైతాన్ని అనునిత్యము మన మనోదర్పణముపై ప్రతిబించుచు నుండును! అట్టి ద్వైతంలో పడిన మనకు మోహమావరించగా మైమరపును పొందెదము. అందువలననే, మనము అరిషడ్వర్గమును శత్రువుగా తలపలేము. అయితే, సదా జాగరూకతతో, "సుస్వాంత జ్యోతి శిఖలపై", అనగా, అంతరాత్మ పై, మనసు నిల్పి "స: అహం" (అతడే, నేను) అని నిరంతరము తలచు దృఢచిత్తునకు మాయ హారతి కర్పూరము వలే హరించుకు పోవునను నిజము బోధ పడును. అనగా, మాయ అట్టి దృఢచిత్తునకు, జితేంద్రియునకు [అనగా, గోస్వామికి] వశమగును! అట్టి ఆత్మయోగి తత్త్వమును గురువుగా స్వీకరించి ఈ శతక సంపుటిని గురు వందనములుగా సమర్పించు చున్నాను.

ద్విస్వాభావిక మాయను

సుస్వాంత జ్యోతిశిఖల నో~హంబనుచుస్

స్వస్వామికి హారతులిడు

గోస్వామీ! యందుకొనుము గురువందనముల్!

ఓం అసతో మా సద్గమయ – తమసో మా జ్యోతిర్గమయ –

మృత్యోర్మా~మృతం గమయ ఓం శాంతి: శాంతి: శాంతి:

**ఓం తత్ సత్**

=== [స్వస్తి] ===

అనుబంధము: అకారాది క్రమములో పద్యముల పట్టిక

# కవి పరిచయము



| | |
|---|---|
| పేరు : | అరుణాచల శాస్త్రి భారతం |
| జననము : | నిడదవోలు, ప.గో.జిల్లా |
| తల్లి : | శ్రీమతి కమలాంబ భారతం |
| తండ్రి : | శ్రీ శ్రీమన్నారాయణ భారతం |
| చదువు : | బి.టెక్ (కప్యూటర్ సైన్స్), హైదరాబాద్ కేంద్రీయ విశ్వ విద్యాలయము, గచ్చిబౌలి, హైదరాబాద్ |
| వృత్తి : | టెలికమ్యునికేషన్స్ ఆర్కిటెక్ట్ |
| ప్రస్తుత నివాసము : | డల్లాస్, టెక్సాస్, అమెరికా |
| స్థిర నివాసము : | తాడేపల్లిగూడెం, ప.గో.జిల్లా |
| వ్యాసంగము : | ఆధ్యాత్మికానందము |
| ఆదర్శము : | తాపత్రయ రహిత జీవనము |
| ధ్యానము : | హృదయస్థాచలారుణ తత్త్వము |
| గురువులు : | ఎందరో మహానుభావులు |